వాఙ్మయ
యోగ
పరిశోధన
పత్రిక

# మణిమంజరి



శ్రీ ప్రభాకర పరిశోధక మండలి
హైదరాబాదు-500457

# మణి మంజరి

వాఙ్మయ - యోగ - పరిశోధన పత్రిక

సంపుటి : 1. సంచిక : 2 ఆగస్టు - 1981

శ్రీ ప్రభాకర వర్ధంతి సంచిక



సంపాదకులు

వేటూరి ఆనందమూర్తి

వేటూరి ఆంజనేయులు








శ్రీ ప్రభాకర పరిశోధక మండలి

'శ్రీనివాస్' - 6/2 ఆర్.టి. (న్యూ)

విజయనగర్ కాలనీ, హైదరాబాదు - 500457

ఆంధ్రప్రదేశ్

వాఙ్మయ - యోగ - పరిశోధన షాణ్మాసిక
మణిమంజరి
శ్రీ ప్రభాకర వర్ధంతి సంచిక
ఆగస్టు, 1981.

వార్షిక చందా : ఇరవై అయిదు రూపాయలు
విడిప్రతి : పదిహేను రూపాయలు

ప్రకాశకులు :
వేటూరి ఆనందమూర్తి
శ్రీ ప్రభాకర పరిశోధక మండలి
హైదరాబాదు - 500 457

ముద్రణ :
అవేర్ ప్రింటింగ్ ప్రెస్
2-2-1167/8/9,
తిలక్‌నగర్,
హైదరాబాదు - 500 044.

BHATTAM SRIRAMA MURTHY
Minister for Special Employment Schemes
and Cultural Affairs

Hyderabad
2-8-81

I am very happy to learn that a bi - lingual bi - annual Literary Yoga Research Journal "Manimanjari" is being brought out by Sri Prabhakara Parisodhaka Mandali, Hyderabad. Sri Prabhakara Sastry Garu, to whose memory this journal is dedicated, was an outstanding scholar and poet in both Telugu and Sanskrit. Besides, he was a sage, in the true sense of the adage, నానృషిః కురుతే కావ్యమ్. His invaluable and enduring service to the cause of Telugu language and literature will be ever cherished by the Telugus. His service to the suffering humanity, under the influence of Master C.V.V., will be ever green among the progeny of the beneficiaries, for generations to come.

I wish you all success in bringing out a special issue commemorating the 31st ( vardhanti ) of Sri Prabhakara Sastry Garu.

S/d- Bhattam Srirama Murthy

Dr. B. GOPALA REDDY
President, A.P. Sahitya Akademi

5-8-1981

Though it is thirty years since Sri Prabhakara Sastri passed away, all his compositions, creative and investigative, had not seen the light of the day. He was one of the few savants who tried to unmask many hidden facts in literature and history. His was an incessant struggle against odds and gaps in the evolution of the language.

What he achieved and engraved in letters is not fully. published. 'Manimanjari' which is coming out on his anniversary day as a six-monthly journal is intended to bringout all his writings. I am sure it will add considerably to our extant knowledge and widen our mental horizons.

I am happy to welcome this new venture, which is going to be costly and difficult. But with the cooperation of lovers of literature the burden will be lightened.

I wish it every success. I congratulate Dr. Anandamurthy and his brothers in launching out this project. They are dedicated sons of a dedicated scholar.

S/d- B. GOPALA REDDI

Prof. G. Ram Reddy
M.A. M.Sc. (LOND). Ph. D.
VICE-CHANCELLOR

OSMANIA UNIVERSITY
Hyderabad-5 0 007
Andhra Pradesh
INDIA

August 27, 1981.

I am happy to learn that Sri Prabhakara Parisodhaka Mandali is bringing out its second issue of MANIMANJARI succesfully. The first issue indicates the monumental research work done by the scholar and the wide range of subjects dealt with by him.

Sri Prabhakara Sastri garu is an ideal for any research scholar in any field, more so in the field of literature. As a teacher and researcher I personally wish the Mandali all the success in future.

I hope all the education institutions will support this academic venture, and that the journal will be of great value to the researchers and scholars in the field.

S/d.
(G. Ram Reddy)

# స్మృత్యంజలి

[ గురుదేవులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 1950 - ఆగస్టు 29వ తేదీ మధ్యాహ్నం తిరుపతిలో అస్తమించారన్న విషాదవార్తను ఆకాశవాణి వినిపించింది. దేశంలోని పత్రికలన్నీ శ్రద్ధాంజలులు ఘటించాయి. సంపాదకీయాలు వ్రాశాయి. వాడవాడలా సంతాప సభలు జరిగాయి. తీర్మానాలు వచ్చాయి. పెద్దలెందరో సంతాప సందేశాలు పంపారు.

ముప్పై యేళ్ల కిందటి పత్రికల్లో పడ్డ వాటిల్లో, కొన్నింటి నుండి, కొన్నికొన్ని పంక్తుల్ని ఇక్కడ పొందుపరుస్తున్నాము – సం. ]

---

"సుప్రసిద్ధ సంస్కృత, ఆంధ్ర పండితుడు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి నిర్యాణము. ఆంధ్ర ప్రముఖుల సానుతాప సందేశాలు. తిరుపతి. ఆగస్టు 29: ప్రముఖ పండితుడు సుప్రసిద్ధ పరిశోధకుడు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నేడు 12–40 గంటలకు శివసాయుజ్యము పొందిరని తెల్పుటకెంతయూవిచారించు చున్నాము...." ఆంధ్ర పత్రిక. 30-8-50.

---

గా॥ సంజీవరెడ్డిగారు:

"సారస్వతోపాసకులు ఆంధ్రకవి ప్రపంచమున అగ్రస్థానం అలంకరించిన శాస్త్రిగారి అస్తమయం మనకు తీరనిలోటు కలిగించినది. మొదట వెంకట శాస్త్రిగారు, తరువాత శేషాద్రి శర్మగారు, ఇపుడు ప్రభాకర శాస్త్రిగారు మనం కోల్పోవుటచే మన సాహిత్య లోకమునకు వాటిల్లిన నష్టమును మనం ఎంతకాలమునకు భర్తీచేయగలమో ఊహకు అందరానిది...."

-ఆంధ్ర పత్రిక. 30-8-50.

---

మంత్రి శ్రీ బి. గోపాలరెడ్డిగారు

"....ప్రాచీనాంధ్ర వాఙ్మయ పరిశోధన విస్తారం కావించి 'తెలుగు మెరుగుల' నందరకు అందజేసిన వారు, లుప్తమైన ఆంధ్ర సాహిత్య భాండారమును తాళ్లపాకవారి సంకీర్తనలు మున్నగు పరిష్కృత గ్రంథ సంచయం ద్వారా వెలికి తెచ్చి ఆంధ్ర మహాజనుల హృదయములలో గొప్ప స్థానం ఆక్రమించినారు...."

-ఆంధ్ర పత్రిక. 30-8-50.

---

"ఆర్ద్రహృదయుడు."

"....ఈ తపస్సు క్రమక్రమంగా ఆయనను గౌతమబుద్ధుని గాంధిమహాత్ముని దివ్య పథాల వైపు పూర్తిగా మరలించి వేసింది కూడా. శ్రీ శాస్త్రిగారి ఆధ్యాత్మిక జీవనంలోని ఈ పరిణామానికి నిదర్శనంగా 1943 లో (గాంధీజీ ఆమరణ నిరశన దీక్షను పూనిన ఒక ఘట్టంలో) మాకు ఆయన వ్రాసిన ఒక లేఖలోని కొన్ని వాక్యాలను ఇక్కడ ఉదాహరించకుండా వుండలేము. "ఈశ్వరుడు చావుబ్రదుకులలో వున్న కాలమిది. గంధికి కాదు చావుబ్రతుకులు - ఈశ్వరునకే.... శ్రీరాముడు అవతారము ముగించినపుడు అయోధ్యావాసులు వయస్సయిన వారెందరో....సరయూ ప్రవేశము చేసిరట. వయసయిన అస్మదాదులకు - గంధి జీవించకపోతే - ఇక జీవతాశ వ్యర్థము. అమంగళము కలుగకుండుగాక". ఏ అంతస్థుకు శ్రీ శాస్త్రిగారు పరిణతి చెందారో తెలుపడానికి ఈ వాక్యాలను మించి మరేమికావాలి?

....ఆయన కేవలం గతంలో బ్రతికేవారు కారు. గతాన్ని వెలవెల బోయేటట్టు చేయగల భవితవ్యాన్ని సాధించడమే — మానవుడు ఒకమెట్టు పైకియెక్కడమే - ఆయన నిరవధిక లక్ష్యం.... జాత్యుద్ధరణకు, లోకకల్యాణానికి జీవించి, అందుకే అసువులను బాసిన ఈ ఆర్ద్రహృదయునికి మా అంజలి".

ఆంధ్రప్రభ-సంపాదకీయం. 31-8-50.

---

ఏలూరు పాటి రామభద్రచయనులు:

"....ఆయన ఒక సరస్వతీపీఠం. శాస్త్రిగారితో నాకు 1920 నాటినుండి పరిచయం, కాదు సుమైత్రి. నా సారస్వతసర్వస్వ పత్రికలో వారి శృంగారశ్రీనాథముపై వాదోపవాదములు ప్రకటింపబడినవి. శాస్త్రిగారొక విద్యాపేటిక. వారి పీఠికలు, వ్యాసములు తెలుగుబాసను తీర్చిదిద్దినవి, కొన్ని వ్యాసముల బలువురు పెద్దలు వీరినుండి సంగ్రహించి తమ యూహలను చేర్చి ప్రకటించికొని వీరి నెరుగకుండగ చేసి తిరిగి యీయకపోయినను వీరు మౌనమునే వహించిరి. వారు ముద్రించక మిగిల్చిన వ్యాసములు వారింట చాలకలవు. శ్రీవారి కుమారులు వానిపేర్లయిన నాంధ్రలోకమునకు నెరుకపరచుట జరుగునని ఆశించుచున్నాను...."

ఆంధ్రప్రభ. 11-9-50.

స్వతంత్ర - సంపాదకీయం, 8-9-50.

"....బహుముఖమూ, పరిపుష్టమూ, నిర్దుష్టమూ అయిన శాస్త్రిగారి సాధనామార్గములలో ప్రతిదానినీ కాకపోయినా, ఏ ఒక్కదానినైనా నిలబెట్టి నిశ్రేయస మార్గమును ఆచరణలోకి తీసుకు వచ్చుట, ప్రభాకరశాస్త్రిగారి శిష్యవ్రతులకు నిజమైన గురుభక్తి."

---

విజయప్రభ: 30-9-50.

"మహాపండిత నిర్యాణం - ఆంధ్రాకాశపథంనుండి యింకో దివ్యనక్షత్రం రాలి పోయింది."

---

మా గురుపాదులు : గొడవర్తి శ్రీరామమూర్తి

"తిరుపతికి వెడితే శ్రీ శాస్త్రిగారిని చూడకుండాపోతే పుట్టింటికి వెళ్ళి తల్లిదండ్రినిచూడకుండా తిరిగివచ్చి నట్లుండేది...."

ఆంధ్రప్రభ. 3-9-50

---

యోగిపుంగవుడు ప్రభాకరశాస్త్రిగారు : డా॥ గాలి బాలసుందరరావు

"ఒక రాజకీయవేత్త మరణిస్తే మరొక రాజనీతిజ్ఞుడు ఆయన స్థానాన్ని ఆక్రమించివచ్చు....కానీ-కవి. పండితుడు, యోగి నిర్యాణంతో మానవ లోకంలో ఏర్పడ్డ ఖాళీ పూరించడానికి ఇంకెన్నేళ్ళు పడుతుందో చెప్పలేను....యోగాభ్యాసంలో వారికి అమోఘమైన రోగనిర్మూలన శక్తి లభించింది....ఈ మధ్యనే మద్రాసులో చాలామంది ప్రసిద్ధవైద్య వేత్తలను విస్మయ పూరితులను చేసేసంఘటన జరిగింది. ఒక యువతికి హఠాత్తుగా 108 డిగ్రీల జ్వరం వచ్చింది. ఆమె చాలా పెద్దయింటి ఆడపడచు. పెద్దయింటి కోడలు. ఆమెకు వేరే ఏబాధలూ లేవు. డాక్టర్లు అన్నిపరీక్షలూ చేశారు. విజ్ఞానానికి తెలిసిన అన్నివైద్యాలూ చేశారు, లాభంలేకపోయింది.... నేను శాస్త్రిగారివద్దకు పొమ్మన్నాను. పోయిన మరుక్షణంనుంచీ ఆ జ్వరం పూర్తిగా పోయింది. ఆమె వ్యాధి చాలా విచిత్రమయింది, ఆమెకు స్పృహ తప్పదు, తింటుంది, తిరుగుతుంది, చక్కగా మాట్లాడుతుంది, కాని థర్మామీటరు నోట్లో పెడితే 108 డిగ్రీలుంటుంది. ఆమెకు వాడని మందు లేదు, చేయని వైద్యంలేదు. ఇట్లా శాస్త్రిగారి యోగ చికిత్సను గురించి కొన్నివేల గాథలు చెప్పవచ్చు...."

ఆంధ్రప్రభ. 31-8-50

---

# సంపాదకీయం

తొలి సంచికను వెలువరచడంలో అనుకోనంత ఆలస్యమే జరిగినా మలిసంచికను వేళకే అందించ గల్గుతున్నందుకు ఆనందిస్తున్నాము. కేలండరు లెక్క ప్రకారము ఆగస్టు 29 తేదీ ప్రభాకర గురుదేవుల వర్ధంతి. ఈ యేడు ఆనాడు శ్రీవారి 31వ వర్ధంతి. నాటికి మా యీ మణిమంజరి శ్రీ ప్రభాకర వర్ధంతి సంచికగా రూపు దిద్దుకొని మీ చేతుల్లోకి వస్తున్నది. ఇందు మా ప్రయత్నం యథాపూర్వమే సాగినా ఈశ్వరేచ్ఛ కూడా తోడుపడింది. వేళకు వ్యాసాలందినవి. పనులన్నీ అనుకొన్న ప్రకారం జరిగినవి. పత్రిక ముచ్చటగా అచ్చయి మీ ముందున్నది. సంకల్పసిద్ధి సంకల్పశుద్ధికి సూచకమనడాని కిదే నిదానం.

మణిమంజరి తొలిసంచిక బాగా వచ్చిందనిపించుకోగా మలి సంచిక మరిన్ని మెఱుగులు దిద్దుకొని ఉత్తరోత్తర వృద్ధిని సాధించేది కాగలదని ఆశిస్తున్నాము. ఇక మీద నియతంగా 120 పుటలకు తక్కువ కాకుండా పరువు బరువుగల విషయ సామగ్రిని ప్రతిసంచికలోను అందించడం జరుగుతుంది. వీటి అన్నిటితోపాటు జిజ్ఞాసువులకు, భావిపరిశీలకులకు ఉపకరించే ఆకరాల్నీ, ఆధారాల్నీ, దరిమిలా వాటినిగూర్చిన అంచనాల్నీ సవిమర్శంగా ప్రకటిస్తూ రాగలము. ఇప్పటికే ఇందులో కొన్ని కొత్త శీర్షికలను ప్రవేశపెట్టినాము. వాటిని కొన సాగించగలము. ముందుముందు మరికొన్నిటిని ఆరంభించగలము. గురుదేవుల అముద్రిత రచనలను, యోగానుభూతి విశేషాలను ప్రకటిస్తూ ఉండగలము. వీటితోపాటు ఇకముందు ఒక్కొక్క సంచికలోను ప్రభాకర వాఙ్మయరాశికి సంబంధించిన ఒక్కొక్క అంశానికి ప్రాధాన్యమిచ్చే తీరున - మధుర కవితా శాఖకీ; ప్రాచీన సాహిత్యానికీ; భాషకీ; చరిత్రకీ; శాసన పరిశోధనకీ; సృజనాత్మక రచనలకీ; యోగానికీ, మానవత్వానికీ, నైతిక విలువల పోషణకీ శ్రీవారు చేసిన దోహదాన్ని విస్తరించడం మా ప్రణాళికలో భాగం కాగలదు.

దైవబలంతో, సహృదయుల శుభాకాంక్షలతో కర్తవ్యాన్ని నిర్వహించడం మా వంతు. ఆదరంతో స్వీకరించి ఆనందించడం మీ వంతు. దీనికి నిదర్శనంగానే ఇటీవల మా మణి-మంజరి తొలిసంచిక ఆవిష్కరణ సభ నగరంలో ప్రముఖుల సమక్షాన నిర్వహింపబడడము, మా కృషిని మెచ్చి, సభకు విచ్చేసి, సంచికను ఆవిష్కరించిన ముఖ్య అతిథి సహృదయులు మంత్రివర్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు రాష్ట్ర సాంస్కృతిక వ్యవహారాలశాఖ పక్షాన మణిమంజరికి ఐదువే లివ్వడానికి నిర్ణయించడము జరిగినది. అందుకు మా కృతజ్ఞతలు వారి కిందుమూలంగా తెలుపుకొంటున్నాము.

మళ్ళీ ఫిబ్రవరిలో కలుసుకొందాము. అంతదాకా సెలవు.

ఇట్లు

సంపాదకులు

## స్వవిషయము

"రవికి దీపమున నర్చ లిచ్చు పగిదివోలె"

(నన్నిచోడుని కుమారసంభవము 1-49)

శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరబాదు) వారు ప్రచురిస్తున్న ఈ షాణ్మాసిక 'మణి మంజరి' వాఙ్మయ - యోగ - పరిశోధన పత్రికగా రూపుదిద్దుకొన్నది. గురుదేవులు స్వర్గీయ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి దివ్యస్మృతి కంకితమై మా యీ 'మణిమంజరి' శ్రీవారి జయంతి-వర్ధంతి సందర్భాలను పురస్కరించుకొని ఏడాదికి రెండుసార్లు ఫిబ్రవరిలోను-ఆగస్టులోను వెలువడుతుంది. గురుదేవుల 31వ వర్ధంతిని పురస్కరించుకొని "ప్రభాకరవర్ధంతి సంచిక" ప్రస్తుతం మీ ముందున్నది.

విడిప్రతి వెల (స్వదేశంలో) రూ. 15/- పోస్టేజి ఉచితము, రిజిస్ట్రేషను ఖర్చులు అదనము)

సంవత్సర చందా ,, రూ. 25/- ( ,, )

సంవత్సరచందా (విదేశాలకు) 8 డాలర్లు ( ,, )

కొద్ది ప్రతులు మాత్రమే అచ్చయినవి. వలసినవారు ముందుగానే సొమ్మును మనియార్డరు ద్వారాగాని, డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారాగాని క్రింది విలాసమునకు పంపి చందాదారులు కావచ్చును. మణిమంజరి హైదరాబాదు పేరున చెక్కులు పంపగోరేవారు బ్యాంకుచార్జీల నిమిత్తం అదనంగా రూ. 2/- పంపవలెను.

ముందుముందు 'మణిమంజరి' కొత్త శీర్షికలను సంతరించుకొనబోతున్నది. గురుదేవుల మౌలిక రచనలెన్నో పరంపరగా వెలువడనున్నవి.

సంపాదకులు-మణిమంజరి
6/2 RT (New) విజయనగర్ కాలనీ,
హైదరాబాదు-500 457. ఆంధ్రప్రదేశ్.

---

# విషయసూచిక


| | | |
|---|---|---|
| స్వాతంత్ర్యదినోత్సవము | 93 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| స్వాతంత్ర్య గీతాలు | 96 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| మహర్షి వేటూరి | 98 | శార్వరి |
| నా రచనలు | 103 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| ఆదర్శపురుషుడు - అమృతకల్పుడు | 107 | గొట్టిపాటి బ్రహ్మయ్య |
| శ్రీ ప్రభాకర పరిశోధక మండలి ప్రథమ వార్షిక సమావేశము | 110 | (నివేదిక) |
| జిజ్ఞాసువు | 111 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| స్మృతిపథంలో | 112 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| శ్రీనివాస నిర్యాణం | 117 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| నాడీగ్రంథములు | 119 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| లక్ష్మీ పార్వతీ సంవాదము | 123 | వేటూరి సుందరశాస్త్రి |
| శ్రీ కాకా భుజండరు మహర్షి | 125 | వావిలికొలను వేంకటరమణారావు |
| ముఖాముఖి మోచర్లవారితోను, దీపాలవారితోను | 127 | డా॥ వేటూరి ఆనందమూర్తి |
| ఆస్థానకవికి అభినందనలు | 133 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| లేఖలు - గురుశిష్య న్యాయనిర్మాణం | 137 | డా॥ వేటూరి ఆనందమూర్తి |
| ఆస్థానకవి నిర్యాణము-మరికొన్నిలేఖలు | 150 | వేటూరి ప్రభాకరశాస్త్రి |
| గురుదేవుల డైరీనుండి కొన్నిపుటలు | 154 | (డైరీ) |
| చాటుపద్య - మణిమంజరి | 156 | (సంకలనము) |
| అనుభూతి - సమన్వయము | 161 | (ఉపన్యాససారము) |
| గాంధిరామాయణం | 162 | (సంకలనం) |
| ఆదర్శదంపతులు | 164 | కొత్త రామకోటయ్య |
| బాష్పాంజలి | 169 | డా॥ వేటూరి ఆనందమూర్తి |
| గురుస్మృతి | 171 | తిమ్మావఝల కోదండరామయ్య |
| ఓ గురుమూర్తీ | 173 | తిమ్మావఝల కోదండరామయ్య |
| వ్యావహారికభాషకు వేటూరివారి తోడ్పాటు | 175 | డా॥ పోచిరాజు శేషగిరిరావు |
| ప్రభాకర స్మృతి | 178 | చల్లా సూర్యనారాయణ |
| గ్రంథసమీక్ష | 180 | శ్రీవత్స |
| శృంగారశ్రీనాథ ప్రశంస - లేఖలు | 183 | |
| వార్తలు - విశేషాలు | 185 | |



మణిమంజరి ఆవిష్కరణోత్సవం సందర్భంలో తీసిన చిత్రపటం. ఎడమనుండికుడికి డా॥ వాసా ప్రభావతీశాస్త్రిగారు, డా॥ దివాకర్ల వెంకటావధానిగారు, మంత్రివర్యులు భాట్టం శ్రీరామమూర్తిగారు, కె.వి. భాస్కరరావుగారు, డా॥ పి.యస్.ఆర్. అప్పారావు గారు, ఆచార్య తిరుమలగారు, వేటూరి ఆంజనేయులుగారు, వేటూరి ఆనందమూర్తిగారు.

(వివరాలు 185, 186వ పేజీలలో)

# స్వాతంత్ర్యదినోత్సవము

**- వేటూరి ప్రభాకరశాస్త్రి**

[భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన శుభసమయాన-1947 ఆగస్టు 14 రాత్రి 12 గం॥ వేళ తిరుపతిలో గురుదేవులు తాము నివసిస్తూ ఉండిన "సీతారామ విలాస్" భవనం మేడమీద భారతపతాక నెగురవేసి ప్రార్థనానంతరం మిత్రగోష్ఠిలో చేసిన ప్రసంగమిది. దేశంతోపాటు మానవజాతి అంతా "IN-DEPENDENT" కావా లన్నదే శ్రీవారి ఉద్బోధ——సం॥ ]

సహృదయ వర్యులారా! ఆనంద మయమయిన నేటి యీ స్వాతంత్ర్యోత్సవము 60 యేండ్లకు పూర్వము దాదాబాయినౌరోజీ మొదలగు నాయకులచే నాటబడిన కాంగ్రెసు దివ్యవృక్షము యొక్క మహా ఫలము. వారు భారత దేశాభ్యుదయమునకై యెంతో కృషి సల్పినారు. నౌరోజీ మొదలు మాలవ్యాజీ దాకా ఆరముగ్గి రాలిపోయిన మహా పురుషులే కాక స్వాతంత్ర్యయుద్ధములో నలిగి చనిపోయినవా రింకా యెందఱో? ఇప్పటికీ అనేక కష్టాలకు లోనగుతూ కోలుకోలేకుండా యెందఱో సంకట పడుతున్నారు. వీరందఱకు కేల్మోడ్పులు. జీవించి యుండి అన్న వస్త్రాలకు లేక నిన్నటిదాకా ప్రభుత్వము వారి నిరాదరణకు పాత్రులై ఉన్నవారిని ప్రస్తుత ప్రభుత్వము ఆదరించవలసి యున్నది. ఇక

మనది దేశము మనది రాజ్యము
మనమె పాలకులము సమస్తము
మనదె మనమే మనకు మేళ్ల
నమర్చుకో వలయున్.
కష్టకాలము తొలగి పోయెను
గాంధి సంకల్పపు(క్విట్ యిండియా) బలంబున
పుష్టితుష్టియు జగతి పొంపిరి
పోవునిక మీదన్

మనకు స్వాతంత్ర్య ఫలమును పండించి అరగింప పెట్టిన వాడు గాంధిగారు. ఈ ప్రపంచానికంతకూ ఆయన మహాత్ముడు. పురుషోత్తముడు. ఆయన ఈ స్వాతంత్ర్యానందసమయమున కలకత్తాలో రాళ్ల దెబ్బలకూ నిందలకూ పాలవుతూ ఉపవాసంతో ఉన్నాడు. తిట్లకు గాదు, రాళ్లకుగాదు, తుపాకులకు గాదు, ఫిరంగులకు గాదు, ఆటం బాబులకు గాదు ఆయన జడిసేది. ఆయనను వెఱపించే శక్తి సత్యాహింసా స్వరూపుడైన భగవంతునికి తప్ప వేరెవ్వరికీ లేదు. ఎప్పుడో టాగోరు మహాకవి అన్నాడట! "ఎవరికి జడవక పోయినా యమునికి జడవనివా డంటూ మానవు డెవడూ ఉండడు. గాంధి మహాత్ముడు యమునికి కూడా జడవడు". అని! టాగోరు మహాకవియోగ్యత లేవీ నాకు లేవుగాని అయినా నే నేమంటున్నా నంటే యముడికి గాంధిగారు జడవక పోవడం వింతగాదు. గాంధిగారంటే యముడికే ఠారు. ఆయన దగ్గఱకు రావడానికి యముడే భయపడుతాడు అని. ఇది కవితా కల్పనగాదు సుమండీ! జరిగిన సత్యానుభవమే.

మీలో కొందఱు మరచిపోయి యుంటారేమో? ఈ స్వాతంత్ర్య విజయాని కంతా కారణమైన మహా మంత్రమును "క్విట్ యిండియా"ను భారతీ

# స్వాతంత్ర్య గీతాలు

— వేటూరి ప్రభాకరశాస్త్రి

[ భారతజాతి స్వేచ్ఛావాయువులు పీల్చిన శౌలిఘడియల్లో గురుదేవులు జండావందనం చేసినప్పుడు పాడిన గీతం మొదటిది. నాడు బ్రాహ్మముహూర్తాన లేచి, ప్రార్థనసలిపి, శిష్యగణము, మిత్రబృందము వెంటరాగా నగర సంకీర్తనం చేస్తూ ఆలపించిన మేలుకొలుపు రెండవది——సం॥ ]

## 1. జయజయా జెండా!

ఆత్మ సాక్షాత్కార హేతువు
ఆపదంబుధి తరణ సేతువు
సీ, వి, వీ నామాంకకేతువు
జే! జయతు! జై! జై!

నిజమా!

విజయధ్వజమా, చిరం, జీవి
వీ, జయధ్వజమా!
నిజమహాత్మ్యము
ప్రజలం దుత్పాదింపుమా!
విజయధ్వజమా! చిరంజీవి
విజయధ్వజమా!

వైభవము మువ్వన్నె జెండా!
ప్రాభవమ్మ స్వరాజ్య జెండా!
శ్రీభరతఖండ స్వతంత్ర స్థేమజయ జెండా!
జెండా జయజయా జెండా

చిరం

జీవివీజెండా! జెండా! జే!జే!

జయజయ శ్రీ విష్ణుచక్రమ!
జయజయ శ్రీ బౌద్ధచక్రమ!
జయజయ శ్రీ గాంధిచక్రమ!
జయ జయా జై! జై!
చక్రమ! జయజయా! జై జై!

చిరం

జీవివై జైజై!! జై! జై!

❊ ❊ ❊

## 2. మే౼కొలుపు

మేలుకొనుడో యువకులారా!
మేలుకొనుడో యువతులారా!
బాలులారా! వృద్ధులారా!
మేలుకొండయ్యా! అంతా మేలుకొండయ్యా॥ మేలు॥

భారత స్వాతంత్ర్య దేవత
భాగ్యభోగ్య వరమ్ములీయగ

చేరవచ్చిన దిదిగొ పూజలు-సేయ రండయ్యా
వరములు చెంద రండయ్యా అంతా॥మేలు॥

తిండికరవులు గుడ్డకరవులు
నుండరాదిక భారతాంబకు
మెండుగావలె పాడిపంటలు
మేలుగావలయున్ మనకు సమేలమున్ వలయున్
కావున మేలుకొండయ్యా అంతా॥మేలు॥

పాలపొదుగుల తోడగోవులు
పంటతోటల తోడభూములు
చాలసౌఖ్యము తోడ ప్రజలును
శాంతి మనవలయున్
అందుకు జతనడపవలయున్!
కావున మేలుకొండయ్యా! అంతా॥మేలు॥

కష్టకాలము తొలగిపోయెను
గంధిసంకల్పంపు బలమున
పుష్టితుష్టియు జగతిపొంపిరి
పోవునికమీదన్ నిద్దుర పోకుడికమీదన్ కావున ॥మేలు॥

ఒక్కకులమే కులములన్నియు
ఒక్కమతమే మతములన్నియు
ఒక్కబలమే బలములన్నీ, ఒ
హో! వినండయ్యా! భేదము లుండబోవయ్యా!
కావున మేలుకొండయ్యా అంతా॥మేలు॥

మనదిదేశము మనది రాజ్యము
మనమె పాలకులము సమస్తము
మనదె! మనమే మనకు మేళ్ల నమర్చుకోవలయున్
నేర్పలవర్చుకోవలయున్ కావున ॥మేలు॥

సర్వజిచ్ఛ్రావణ చతుర్దశి
పర్వదినమిది యధిక బహుళము
పూర్వమిటు రాలేదు. మఱి యిక
ముందు రాబోదు కావున
మేలుకొండయ్యా! అంతా మేలుకొండయ్యా!



---

పట్టపగలింటి యెండకు బిట్టు జడిసి
వెలికిఁ దలచూప కొడలిలో మలఁగియుండె
నీడసైతము తెరువరీ! నీవు విడక
బాట నడచెదు విశ్రాంతిఁ బడయవేల?

ఆర్తకులముల కడగండ్ల కడపి సమ్మ
దములు వొందింప నిర్వురే తగినవారు
సర్వమంగళాధిపుఁ డైన శర్వుఁ డొకఁడు
శాలివాహనుఁ డను మహిజాని యొకఁడు

[ గాథాసప్తశతిలోని రెండు గాథలకు అనువాదము. వే. ప్ర. ]

# మహర్షి వేటూరి

-శార్వరి

భగవంతుడు ఉన్నాడా, లేడా?
ఉన్నాడు అనేవారు ఆస్తికులు
లేడు అనేవారు నాస్తికులు
ఉన్నాడో, లేడో మనకెందుకు అనేవారు
బౌద్ధులు
ఉన్నాడో, లేడో తెలుసుకుందాం అని ప్రయ
త్నించేవారు జ్ఞానులు, యోగులు.
భగవంతుడు లేడు అనడం పాపంకాదు.
ఉన్నాడన్నంత మాత్రాన పుణ్యము రాదు.
అసలు పాపపుణ్యాలు ఉన్నాయా? అనుమానమే
స్వర్గనరకాలు ఉన్నాయా? అదీ సందేహమే
పాపపుణ్యాలు, స్వర్గనరకాలు మానవుడు
కల్పించుకున్నవి, మానవమేధ సృష్టించినవి.

భగవంతుని ఉనికిని తెలుసుకొనడానికి తపస్సు చేసినవారు భగవత్ప్రీతిని చేరుకుంటారు. అమరులు, మృత్యుంజయులు అవుతారు-కావాలి.

భగవంతుడు నిర్గుణుడుకదా! నిర్గుణ పరమాత్మకు రూపకల్పన చేసి, నామకరణం చేసుకున్నది మనమే.

మనం సృష్టించి, రూపకల్పన చేసుకున్న దేవుడికి ఒక దేవాలయం నిర్మించి, అందులో భగవంతుని బంధించి పాపం కట్టుకున్నదీ మనమే. జైలులో పెట్టినవారికైనా కాస్తంతగాలీ వెలుతురు వస్తుందిగానీ, మనం పూజించి, అర్చనలు చేసి, హారతులు పట్టే దేవుడికి, తలుపులు బిగించాక ఊపిరికూడా ఆడదు.

మనం బందీనిచేసిన భగవంతుడు మనల్ని రక్షించాలని, మనకు వరాలు ఇవ్వాలని ఆశిస్తాం. మనల్ని రక్షించవలసిన దేవుడికి మనం ఆంక్షలు విధించడం ఏమిటి? గుళ్లలో, గోపురాలలో బంధించడం ఏమిటి? ఒక్క దేవాలయంలోనైనా తలుపులు తెరచి ఉంచుతారా? పెద్ద తాళాలు తగిలిస్తారు, భగవంతుడు పారిపోతాడనా!

తనను తాను రక్షించుకోలేని అశక్తుడనా దేవుడు ఈ ఆర్భాటాలు, ఈ పూజారులు, ధర్మకర్తలు? పూజారులు చెప్పినట్లు వినేవాడు, అడిగినప్పుడు వరాలిచ్చేవాడు భగవంతుడా?

తిరుపతి వేంకటేశ్వరుడు పెద్ద దేవుడుగదా, ఆ స్వామి దేవాలయం తలుపులైనా, ఎల్లప్పుడూ తెరచి ఉంచరేం! ఆయనగారు పద్మావతీదేవితో సరస సల్లాపాలు ఆడడానికి ఏకాంతంకల్పించి, పవ్వళింపు సేవలు చేస్తారా! ఔరా! భగవంతుడికికూడా రోజూ సంసార తాపత్రయాలేనా!

ఈ ప్రస్తావం అప్రస్తుతం కాదు. ఎందుచేత నంటే బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఉన్నది తిరుపతిలో. వారు ప్రచారంచేసింది యోగం.

తిరుమలపైన, శ్రీ వేంకటేశ్వరస్వామివారి దేవాలయంలోని నేలమాళిగలలో నిక్షిప్తమైవున్న

అన్నమాచార్య కీర్తనలున్న రాగిరేకుల్ని పరిశోధించిన మహాత్ముడు శ్రీ శాస్త్రిగారు. శ్రీవేంకటేశ్వరస్వామిముందు అంజలి ఘటించి నిలబడినా, ఆత్మలో నమస్కరించింది తన గురుదేవుడు మాస్టర్ సి.వి.వి.గారికే. "నీవేతప్ప నితః పరం బెరుగ" అన్నంతగా మాస్టర్‌గారికి ఆత్మసమర్పణ చేసుకున్న ధీశాలి ఆయన.

ఒకసారి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తిరుపతినుండి మద్రాసు వచ్చారు పనిమీద. రాయపేటలో కాబోలు ఒక చోట దిగారు. శ్రీ శాస్త్రిగారు వచ్చారంటే ఆయన శిష్యులు, సాహిత్యాభిమానులు, యోగ మిత్రులు ఆయన దర్శనానికి వచ్చేవారు. ఒకసారి అలా వచ్చినవారితో కలిసి బయటకు వెళుతుండగా గదికి తాళం వేయలేదు.

"గురువుగారు! గదికి తాళం వేయడం మరచిపోయాం" అన్నాడు ఓ శిష్యుడు.

దానికి శ్రీ శాస్త్రిగారు నవ్వి "తాళంచెవి కుంభకోణంలో మరచి వచ్చానురా మాస్టరుగారి చేతికి అందించాను" అన్నారు.

ఆ శిష్యుడికి అర్థంకాలేదు. వెంటనే శాస్త్రిగారే అన్నారు, "లోపల మాస్టరుగారు ఉన్నారులే! ఆయన ఉన్నంత కాలం భయంలేదు పదపోదాం" అన్నారు.

అసలు విషయం ఏమిటంటే శ్రీశాస్త్రిగారు కుంభకోణంలో మాస్టర్ సీ.వి.వి. గారి వద్ద ఉపదేశం పొందిన తర్వాత వారిని ఇహలోక బంధనాలు బాధించలేదు. దేనిపైన వ్యామోహం ఉండేదికాదు. సంసారపక్షంగా జీవయాత్ర సాగిస్తున్నా, ఉద్యోగం చేస్తున్నా తాను నిమిత్తమాత్రుడిని అనుకునేవారు. అందుకే గదికి తాళం వేయడం ఆయనకుఅలవాటు లేదు. శ్రీ శాస్త్రిగారికి గురుదేవులపై గల నమ్మకం అపూర్వం.

కాషాయంబరాలు ధరించి, సన్యాసులం అని చెప్పుకునేవారు కూడా, డబ్బుకు, సుఖాలకు, భోగాలకు ప్రాముఖ్యత నిచ్చే రోజులలో శ్రీ శాస్త్రిగారి వంటివారు సంసారులుగా ఉంటూ, నిజమైన 'సన్యాస' జీవితాన్ని గడిపారు! అలాటి జీవితం గడపడం మాస్టర్ యోగసాధకులకే సాధ్యమేమో!

శ్రీ శాస్త్రిగారి వ్యక్తిత్వాన్ని అంచనా వేయడం మనవల్ల కాని పని. ఆయన సాహితీవేత్తగా, పరిశోధకుడుగా చేసిన కృషి ఒక ఎత్తు, మాస్టర్ యోగిగా చేసిన సాధన, చేసినచికిత్సలు ఒక ఎత్తు. ఆయనకు సాహిత్య రంగంలో ఎందరు శిష్యులు, అభిమానులు ఉన్నారో అంతకు మించిన సంఖ్యలో యోగ మార్గంలో శిష్యులు, అభిమానులు ఉన్నారు. ఆయన మహామనీషి, కాలాతీత వ్యక్తి. ఆయన మృత్యుంజయుడు అక్షరాల.

శ్రీ శాస్త్రిగారి జీవితంలో, మాస్టర్ సీ.వి.వి. గారిని ఆశ్రయించడం ఒక మలుపు. మనకు శుష్క వేదాంతులు, కపట సన్యాసులు, గడ్డాలు, మీసాలు పెంచుకొని తిరిగే బైరాగులు కనిపిస్తారు. వారిలో ఆధ్యాత్మికత అసలు ఉండదని కాదు. ఉండవలసిన తీరులో, విజ్ఞులు మెచ్చే రీతిలో ఉండదు. సంస్కృతాంధ్రాలలో మహాపండితులైన శ్రీ శాస్త్రిగారిని ఆకర్షించగలిగారు మాస్టర్ సీ.వి.వి.

అప్పట్లో శ్రీ శాస్త్రిగారు తీవ్ర అనారోగ్యంతో బాధపడుతుండేవారు. తింటే అరిగేదికాదు. చివరకు నీళ్లు తాగినా జీర్ణం కాదనే భయం ఉండేది. 'అట్టే కాలం జీవించలే'నని భావించేవారు. అలాంటి స్థితిలో ఒకసహోద్యోగి కుంభకోణం మాస్టరుగార్ని గురించి చెప్పాడు. శ్రీ శాస్త్రిగారు వెంటనే కుంభకోణం వెళ్ళారు. మాస్టరుగారు శ్రీ శాస్త్రిగారిని తన పంక్తిని కూర్చోపెట్టుకొని, షడ్రసోపేతంగా, ఆవకాయతో సహా భోజనం పెట్టారట. "అయ్యో ఇవన్నితినలేనే, తింటే అరగవే" అని భయపడుతుండగా మాస్టరు

గారు ఆయన మనస్సును గ్రహించి "ఈరోజు నుండి నీకా బెంగ అవసరంలేదు. నీ జబ్బు కుదిరింది. ఇంక రోజూ, పుష్టిగా, కోరినవన్నీ తినవచ్చు" అన్నారు. మాస్టరుగారు సంకల్ప మాత్రంతోనే శాస్త్రిగారిని స్వస్థుల్ని చేశారు. అప్పుడే శాస్త్రిగారు ఆయనకు ఆత్మసమర్పణ కావించుకున్నారు.

అలవికాని జబ్బు అనుకున్నదానిని గురువుగారు ఏ చికిత్సా చేయకుండా కుదర్చడంతో ఆయన్ని వదలిరాలేక మాస్టర్‌గారి పాదాలపైబడి ఏడ్చేశారట. అవును, కన్నీటితోపాదాల్ని అభిషేకించిన ప్రియ శిష్యుడు శ్రీ శాస్త్రిగారు.

కుంభకోణంలో వున్న మాస్టరుగారు ఆంధ్ర దేశంలోని పలువురు మేధావుల్ని తన యోగశక్తితో ఆకర్షించారు. అలాంటి వారిలో శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, శ్రీ మైనంపాటి నరసింహంగారు, శ్రీ పోతరాజు నరసింహంగారు ముఖ్యులు. ముగ్గురు మూడు కోణాల నుండి సహకరించారు. శ్రీ ఎం. ఎన్. గారు ఒంగోలులో యోగ కేంద్రం ఏర్పరచి, వందలాది శిష్యులను తయారు చేశారు. శ్రీ శాస్త్రిగారు తిరుపతిలో కుదురుకొని వేలాది మందికి రోగచికిత్స చేశారు. శ్రీ పి. ఎన్. గారు ఉద్యోగరీత్యా మద్రాసులో వుండి, యోగ జిజ్ఞాసతో, తాత్త్విక విచారణ ప్రారంభించారు. వీరు ముగ్గురి వలనా, తెలుగువారికి 'మాస్టర్ యోగ' పరిచయం కలిగింది.

ఆకలి గొన్న వానికి అన్నంపెట్టడం పుణ్యం. బాధలో నున్నవానికి ఉపశమనం కలిగించడం అంటే పుణ్యం. అడిగిన వానికి 'యోగ మార్గం' చెప్పడం ధర్మం.

శ్రీ శాస్త్రిగారు అందరివలె యోగసాధన చేసినా, మాస్టరుగారి అనుగ్రహం వల్ల వారికి 'చికిత్సా' విధానం అలవడ్డది. తాను ఏ కారణంగా గురు పాదాల్ని ఆశ్రయించారో శ్రీ శాస్త్రిగారు, తన జీవితాన్ని యోగాన్ని అందుకే వినియోగించారు. తర్వాత— రోగ బాధితుల్ని చూస్తే ఆయన గుండె ద్రవించేది. ఎటువంటి జటిలమైన రోగాన్ని కానీ యోగశక్తితో నయం చేసేవారు. చికిత్స పొందిన వారు తర్వాత ఆయన శిష్యులై మాస్టర్ యోగ సాధన ప్రారంభించే వారు.

నేను మొట్టమొదటిసారిగా శ్రీ శాస్త్రిగారిని గురించి విన్నది 1960లో- విజయవాడ, ఆంధ్రప్రభలో సబ్-ఎడిటర్‌గా పనిచేస్తున్న రోజులు. నేను అప్పుడు 'గాస్ట్రిక్ ట్రబుల్'తో బాధపడుతుండే వాణ్ణి. ఒక మిత్రుడు యాదాలాపంగా చెప్పాడు శ్రీ శాస్త్రిగారిని గురించి. 'తిరుపతిలో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారని ఒక యోగి ఉన్నారు, ఆయన ఎలాంటి జబ్బులనైనా నయంచేస్తారు, తిరుపతి వేంకటేశ్వరస్వామివారి దర్శనానికి వెళ్ళినవారు శ్రీ శాస్త్రిగారిని స్మరించి దర్శించుకోకుండా రారు. అంతటి మహనీయుడు' అని అప్పటికి శాస్త్రిగారు భౌతికంవిడిచి పదేళ్లు దాటినా వారినెరిగి వారి మహిమ ననుభవించిన వారికి, వారి సన్నిధి సదా ప్రత్యక్షంగానే ఉండేదని తెలుసుకున్నాను. కానీ నేను తిరుపతి వెళ్ళడంమాత్రం జరగలేదు.

ఆ తర్వాత పదేళ్ళకు అంటే 1970లో శ్రీ శాస్త్రిగారిని గురించి డాక్టర్ గాలి బాలసుందరరావు గారు వివరించారు. అప్పటికి నేను మాస్టర్ యోగంలో ఉపదేశంపొంది, సాధన చేస్తున్నాను. డాక్టరు బాలసుందరరావుగారు శ్రీ శాస్త్రిగారివద్ద ఉపదేశం పొందకపోయినా, ఆయన్ని తన గురువుగా భావించే వారు. యోగసాధనలో మెలకువలు, రహస్యాలు శ్రీ శాస్త్రిగారి వద్దనే తెలుసుకున్నారు.

అప్పుడే "ప్రజ్ఞా ప్రభాకరం" చదివాను. శ్రీ శాస్త్రిగారి శిష్యుడు శ్రీ కొత్త రామకోటయ్యగారు రాసిన గ్రంథం "ప్రభాకర ప్రవచనాలు" కూడా చదివాను. అది. శ్రీ టి. ఎస్. శంకరఅయ్యర్,

శ్రీ శాస్త్రిగారి శిష్యులైన వారే మరొకరు శ్రీ శంకరయ్యర్‌గారు అనేక విషయాలు చెప్పేవారు శాస్త్రిగారినిగురించి.

శ్రీ శాస్త్రిగారి చికిత్సా విధానం గురించి రెండు ఉదాహరణలు: ఒకసారి శ్రీ శాస్త్రిగారి అబ్బాయికి జ్వరం వచ్చింది. ఆ అబ్బాయికోసం ప్రేయర్ చేద్దాము అనుకుంటుండగా, ఎవరోవచ్చి, తమ అబ్బాయికి జ్వరంగా వుందని, ట్రీట్‌మెంట్ ఇమ్మని అడిగారు. శ్రీ శాస్త్రిగారు వెంటనే లేచి, ఆ వచ్చిన వ్యక్తివెంట వెళ్ళి, వారి అబ్బాయికి చికిత్స చేసివచ్చి, ఆతర్వాత తన కుమారునికి చికిత్స చేశారట.

ముందు చికిత్స ఇతరులకు చేయాలనీ, తర్వాతనే తన ఇంట్లోవారికి చేయాలని చెప్పారు శ్రీ శాస్త్రిగారు. మరొకటి: చికిత్సకోసం వెళ్ళినప్పుడు సాధారణంగా నడిచే వెళ్ళేవారట. ఒకవేళ ఏ రిక్షాపైన ఐనా వెళ్ళవలసివస్తే, ఆ రిక్షాఖర్చు తానుపెట్టుకునేవారు. 'చికిత్స' మిషపైన 'రోగి'తరపు వారిడబ్బు ఖర్చుపెట్టించడం తప్పు అనేవారు.

ఒకసారి ఓ చిత్రమైన కేసు వచ్చింది. గోదావరి ప్రాంతంనుండి కొత్తగా పెళ్ళయిన దంపతులు శ్రీ శాస్త్రిగారి దర్శనానికి వచ్చారు. ఆ ఇల్లాలికి ఇరవై ఏళ్ళు. పచ్చని పసిమి, మంచి అందగత్తె. అయితే ఆమెకు గ్రహబాధ. దయ్యం పట్టి పీడిస్తోంది. ఎన్ని భూతవైద్యాలు చేయించినా తగ్గలేదుట. ఆ గృహస్థు మొదటిభార్య చనిపోయి, దయ్యమై, రెండవభార్యను పట్టి పీడిస్తోందని చెప్పారు. శ్రీ శాస్త్రిగారు ప్రేయరులో కూర్చోగానే ఆ అమ్మాయిని గాలి ఆవహించి, ఊగడం ప్రారంభించింది. మామూలు భూతవైద్యులవలె శ్రీ శాస్త్రిగారు ఆమెను వేపమండలతో కొట్టలేదు. ముగ్గులువేసి, దానిలోకి రమ్మని అడగలేదు. దయ్యం పట్టి, అల్లరిచేస్తున్న అమ్మాయిని కన్నతండ్రివలె ప్రేమగా బుజ్జగించి లాలించారు. "ఏం అమ్మా! ఎవరునువ్వు! ఏమిటా పిచ్చిపని! ఎందుకు వేధిస్తావ్" అని బ్రతిమలాడగా చెప్పింది-

"తను ఆయన భార్యనని, తన కోర్కెలు ఏవీ తీరలేదని, ఇప్పుడు చిన్నభార్యను ఆవహించి తన కోర్కెలు తీర్చుకుంటున్నా"నని.

శ్రీ శాస్త్రిగారు మందలించారు "అదికాదు తల్లీ నీ కోర్కెలు తీరాలంటే, మళ్లీ జన్మించు. పెద్దదానివైనాక పెళ్లిచేసుకో. అది మంచిది. గానీ దయ్యమై తీర్చుకునే కోరికలవల్ల తృప్తి ఉండదు" అని.

ఆ తర్వాత ఆవిడ ఆ చిన్న భార్యకు బిడ్డగా జన్మించింది. సుఖాంతం అయింది కథ.

శ్రీ శాస్త్రిగారి చికిత్సా విధానం అలా వుండేది.

మరొకసారి కాళ్లు, చేతులు పడిపోయి, నడవలేని స్థితిలో వున్న ఓ కుర్రవాణ్ణి అతని తలిదండ్రులు శాస్త్రిగారి ఇంటికి తీసుకు వచ్చారు, అప్పటికే అయిదారు సంవత్సరాలుగా ఆ కుర్రవాని స్థితి, అంటే ఎన్ని మందులు ఇప్పించినా, గుణం లేదు. ఇద్దరు మనుషులు చేతుల్తో తీసుకురావలసి వచ్చేది. కుర్రవాణ్ని బయట వరండాలో కూర్చోబెట్టి పెద్దవారు లోపలికి వెళ్లి శ్రీ శాస్త్రిగారికి విన్నవించుకున్నారు. అప్పుడు శాస్త్రిగారు ప్రేయర్ చేసుకొని లేస్తున్నారు. ఆయన అన్నారు "వెళ్లి అబ్బాయిని మాస్టరుగారుపిలుస్తున్నారు రమ్మనిచెప్పండి. మీరెవరు సాయం చేయ నవసరంలేదు తానే వస్తాడు" అని.

వారు అలాగే వెళ్లి చెప్పారు. పావు గంటలో ఆ కుర్రవాడు నెమ్మదిగా గోడ పట్టుకునిలేచి, అతి ప్రయాసతో లోపలకు నడిచివచ్చాడు. ఆ తర్వాత చికిత్స జరిగింది. అతను స్వస్థుడైనాడు.

ఇలాగా శ్రీ శాస్త్రిగారి 'యోగ చికిత్స' గురించి చెప్పడం సాగిస్తే బృహద్గ్రంథం అవుతుంది. మరొక్క సంఘటనతో ఈ వ్యాసం ముగిస్తాను.

కీ.శే॥ శ్రీ తిమ్మావఝుల కోదండ రామయ్య గారు, అప్పట్లో శ్రీ శాస్త్రిగారి ఇంట్లోనే వుండి, చదువుకుంటుండేవారు. నేను మద్రాసులో ఉన్నంత కాలం శ్రీ కోదండరామయ్యగారు వచ్చినప్పుడల్లా మా ఇంటికి ప్రేయర్ కోసం రావడం అలవాటు. అప్పుడు చెప్పా రీవిషయం.

తిరుపతిలో శ్రీ శాస్త్రిగారింట వుండే రోజులలో ఒకసారి విపరీతంగా కడుపునొప్పి వచ్చి, నాలుగు రోజులు శ్రీ శాస్త్రిగారికి కనిపించలేదట. అయిదవ రోజున శ్రీ శాస్త్రిగారు అడిగారు 'ఏమిరా! రాముడు రావడం లేదు' అని. ఆయన భయపడుతూనే చెప్పారుట.

"ఇప్పుడుతగ్గిందా?" అంటే 'ఉహు' అన్నారు.

"అయితే అలా వెల్లకిలా పడుకుని, కళ్లు మూసుకో" అని కోదండ రామయ్యగారి పొట్ట పైన తన కాలుపెట్టి నొక్కారుట. అంతేమళ్లీ ఆయనకు ఆ నొప్పిరాలేదు.

శ్రీ కోదండ రామయ్యగారిలో ఒక విశేషం ఆయన శ్రీ శాస్త్రిగారి ప్రక్కన ప్రేయర్‌కు కూర్చున్నా, ఎప్పుడు పూర్తి మంత్రాన్ని ఉచ్చరించ లేదుట. 'మాస్టర్ సీ. వి. వి.' అనే లోపలే ఆయనకు విస్మృతి కలిగి, ఒక రకమైన ధ్యాన సమాధిలో వెళ్లిపోయి, తనస్థితిని మరచిపోయేవారు. మా ఇంటికి వచ్చినప్పుడు అలాగే జరుగుతుండేది. నేనే అడిగాను "మాస్టరుగారినో, శ్రీ శాస్త్రిగారినో ప్రార్థించక పోయారా! ఇలాంటి విస్మృతి లేకుండా పోతుంది" అని. "ఎందుకు? ఇప్పుడు బాగానే వుందిగా! శ్రీ శాస్త్రిగారు ఉన్నప్పుడు ఇలాగే జరిగింది. వారికి తెలుసు- అవసరం లేకనే వదిలేసి ఉంటారు. అవసరం వుంటే వారే 'రెక్టిఫై' చేసే వారు" అని తృప్తిపడ్డారేగాని, తన గురువు గారిని ఇది చేయండి, అని అడగ సాహసించ లేదు. ఆయన ప్రేయర్‌లో కూర్చుంటే ఓ గంటకు గానీ లేవరు.

ఇలా శాస్త్రిగారి అనుభవాలు చెప్పుకుంటూపోతే ఎన్నో... తెలుగు దేశం గర్వించదగిన మహర్షి మన శాస్త్రిగారు. ఆయన మాస్టరుగారి ప్రతినిధి.



---

క॥ అందక పొందక విడబడి
చిందులు ద్రొక్కెడి మనస్సుఁ జేకొనిసరిగా
నందముగా నడవంగల
చందమునన్ దిద్దుకొనవె సద్గురుమూర్తీ !

వే. ప్ర.

---

# నా రచనలు

-వేటూరి ప్రభాకరశాస్త్రి

[ గురుదేవులు తమ రచనల్లో ముఖ్యమైన వాటిని గురించి - తాము వ్రాసిన వాటినీ, వ్రాయవలసిన వాటినీ ఉట్టంకిస్తూ — స్వహస్తంతో వ్రాసి ఉంచుకొన్న విశేషాలివి. ఒక విధంగా శ్రీ ప్రభాకర పరిశోధక మండలివారి కృషికి దోహదం చేసిన 'ప్రభాకర వాఙ్మయ సూచి' ఇది. —సం॥ ]

1. నన్నయ భట్టు - పావులూరి మల్లనకవి (గణిత కర్త) చరిత్రలను గూర్చి గొప్ప చర్చ 1910లో (శ్రీరామేశం పంతులుగారు ఎఱుగుదురు). కం. వీ. పంతులుగారు విధిలేక, 1917లో సంస్కరించిన కవుల చరిత్ర 1 భాగమున నావాదము నంగీకరించి తమ తప్పు దిద్దుకొన్నారు. కం.వీ. గారికి ఈ సంస్కరణమున కె.వి లక్ష్మణరావుగారు, నేను అమిత సాహాయ్యము చేసితిమి. పీఠికలో వారు మమ్ము పేర్కొనిరి.

2. 'ప్రభావతీ ప్రద్యుమ్నము' ఆంధ్ర ప్రశస్త ప్రబంధ వ్యాఖ్యానమును గూర్చి (పురాణపండ మల్లయ శాస్త్రిగారిది) 10 వ్యాసములకు పైగా ఆ ప్రబంధ స్వారస్యము వెల్లడించుచు కృష్ణా పత్రికలో వ్రాసినాను.

3. 'తెలుగులో వచన కావ్యములు' అను పేరున, తెల్గు ఎకాడమీ జర్నల్ 1 వాల్యూంలో గొప్ప వ్యాసం వ్రాసినాను. పలువురు దానిని ఆధారపఱుచుకొని వచన రచనా విమర్శములు వ్రాసిరి.

4. 'నన్నిచోడ కవిని గూర్చి' ఎకాడమీ జర్నల్‌లో గొప్పవిమర్శవ్యాసము.

5. మను చరిత్రలోని 'రెంటికిం జెడిన రేవడు'- అను పదము గూర్చి.

6. 'రాజ మహేంద్రవరము - సారంగధరుడు'— గొప్ప విమర్శవ్యాసములు (ఆంధ్ర పత్రిక).

7. 'కొలచల మల్లినాథసూరి' పంచకావ్య వ్యాఖ్యాతను గూర్చి ఎవరూ ఎఱుగనిది - చరిత్రమును గూర్చి, వంశమును గూర్చి, ఆయన గ్రంథముల గూర్చి విమర్శ - (ఆంధ్ర పత్రిక సంవత్సరాదిసంచిక).

8. నన్నయకు పూర్వపు తెల్గు ఛందస్సు - (రాజనరేంద్ర పట్టాభిషేక సంచిక)

9. శ్రీకాకుళ పుణ్య క్షేత్రము (ఆంధ్ర పత్రిక).

10. సాతవాహనులు, జయంతి పత్రిక — ఈ వ్యాసమును ఆంధ్ర హిస్టారికల్ జర్నల్ వారు ఇంగ్లీషులోకి మార్చి ప్రకటించిరి.

11. బాలభాష - [తెల్గుబాలెడ్సును] గూర్చి - 'కళ' అనే గొప్ప విలువ గల జర్నల్‌లో గొప్ప వ్యాసము.
మఱిన్ని [బాలెడ్సును గూర్చి] కృష్ణా పత్రిక, భారతి, ఆంధ్ర పత్రికలలో అనేక వ్యాసములు వ్రాసినాను!
కృష్ణాపత్రికవారు సంక్రాంతి సంచికలో వాటిని చేర్చి ప్రకటించిరి.

12. 'వేమన దేశకాలములు' ను గూర్చి తప్పుగా ఇదివఱకున్న తీరులను సంస్కరించుచు విలువ గల వ్యాసము ఆంధ్ర పత్రిక, సంవత్సరాది సంచికలో వ్రాసినాను.

13. 'తెల్గు దేశపు సంస్కృత కవులు' అను పేర అనేక వ్యాసములు 'సరస్వతి' అనే మాస పత్రికలో ప్రకటించినాను.

14. 'శాసనవిశేషములు' అనుపేశ 'త్రిలింగ' అనే వార పత్రికలో కొన్ని వ్యాసములు వ్రాసినాను.

15. శివయోగ సారావతరణిక అని ప్రాచీనాంధ్ర గ్రంథమునుగూర్చి విలువగల వ్యాసము.

16. ఆంధ్ర లిపి సంస్కారమునుగూర్చి-

17. అరసున్నను గూర్చి-

18 ఆంధ్ర భాషావతారమునుగూర్చి-

19. తెలుగున ప్రథమావిభక్తి 'ండు' ఎట్లు పుట్టినది?

20. బసవపురాణ పీఠిక, సంస్కారము, ఎడిషన్-

21. ఉద్భటారాధ్య చరిత్ర :- తెనాలి రామలింగడు రామకృష్ణుడు ఒకడేఅని నిరూపించుట, అపూర్వ గ్రంథమును సంపాదించి పీఠికతో ప్రకటించుట.

22. శివతత్త్వసారము - నన్నయ కించుక తర్వాతి వాడయిన పండితారాధ్యుని గ్రంథము సంపాదించి కె.వి. లక్ష్మణరావుగారిచే ప్రకటింప జేసితిని. దాని పీఠికలో వారు దీనిని పేర్కొనిరి.

23. చారుచర్య - తిక్కనకాలపు అపూర్వాంధ్ర గ్రంథము. ఎవరూ ఎఱుగరు. నేను దీని నార్జించి ముక్త్యాల ప్రభువులచే ముద్రింప జేసితిని. నేనే సంస్కరించి పీఠిక వ్రాసితిని.

24. నాసికేతోపాఖ్యానము:- శ్రీనాథుని బావమఱది గ్రంథము. దీని యునికిని గుర్తించి తొలుత లోకమునకు దెలిపినవాడను నేనే. నేనే దీనిని శ్రీ ముక్త్యాల ప్రభువులకు సంస్కరించి యిచ్చి ముద్రింపించితిని.

25. మద్రాసులో శృంగారగ్రంథమాలా ప్రకాశకులు ప్రకటించిన గ్రంథములన్నీ నేను చక్కజూచి ప్రకటింపజేసినవే.

26. బసవపురాణము:- ప్రాచీనాంధ్ర ద్విపద కావ్యము. శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికొఱకు నేనే సంస్కరించి 'ఆంధ్ర గ్రంథమాల'లో ప్రకటించితిని.

27. ఉత్తర హరివంశము:- పీఠికతో వావిళ్ళవారిచే ప్రకటింపచేసితిని. నేనే పీఠిక వ్రాసితిని.

28. ప్రబంధరత్నావళి :- తెలుగుకవిత పుట్టిననాటి నుండి కృష్ణదేవరాయలదాక కల కవులలో ఇప్పుడు పేరైన తెలియరాని కవుల గ్రంథములనుండి ప్రాచీనులు సేకరించిన పద్యరత్నముల గని. దీనికి కవి చరిత్ర పరిశీలనముతో గొప్ప పీఠికవ్రాసి ప్రకటించినాను-భాషాచరిత పరిశీలకులందఱు దీని నారాధింతురు (చూ: ఆంధ్ర వాఙ్మయ చరిత్రలు 1. వావిళ్లవారు ప్రకటించినది, 2. వంగూరి సుబ్బారావు గారిది).

29, చాటుపద్య మణిమంజరి:- I, II వాల్యుంలు. మొదటి వాల్యుం 5, 6 ఎడిషన్లు అయినవి.

రెండవ వాల్యుం ఇపుడు ద్వితీయ ముద్రణ మున నున్నది. ఈ గ్రంథములు సర్వాంధ్ర దేశ వ్యాప్తములు.

30. శృంగార శ్రీనాథము:- శ్రీనాథమహాకవి చరిత్ర-కవితావిమర్శము ఇది యూనివర్సిటీ టెక్స్టు అయినది.

31. వినోద విమర్శము, ప్రాచీనాంధ్ర గ్రంథముల లోని రసవంతములగు పద్యములను గూర్చి విమర్శము.

32. క్రీడాభిరామము - గొప్ప పీఠికతో ప్రకటించి తిని. అనర్ఘ గ్రంథము.

33. ప్రొఫెసరు కుప్పుస్వామి శాస్త్రిగారి పరిశీలన మున ఓరియంటల్ లైబ్రరి డిస్క్రిప్టివు కేట లాగు-ఇంచుమించు 20 వాల్యుంలు, తయారు చేసినాను. [ఇప్పటికి ప్రకటిత మయినవి, ప్రెస్సులో ఉన్నవి, ఇప్పుడు ఇక్కడ చూపు చున్నాను....]

34. సంస్కృతమున

(బోధాయనుని కృతి) భగవదజ్జుకము ప్రహసనమును సంస్కృత పీఠికతో నేనే ఉద్ధరించి తొలుత ప్రకటించినాను. దీని పీఠికలోని అపూర్వ విషయములు, బ్రిటిషు మ్యూజియం ప్రైస్ ప్రెసిడెంటు, బార్నెటు దొరగారి ఓరియంటల్ బులిటిన్‌లో స్వీకరింపబడినవి.

నీతి ద్విషష్టిక:- సుందర పాండ్యుడను కవి 5 శతాబ్దివాడు రచించిన నీతి గ్రంథము, నేనే గుర్తించి పీఠికతో ప్రకటించితిని. దీని పీఠిక చాల విలువ గలది.

35. నాటకములు

ప్రతిమా నాటకము

భగవదజ్జుకము

మధ్యమ వ్యాయోగము

కర్ణభారము

మత్తవిలాసము.

36. వచన గ్రంథములు

నీతినిధి

వేంకటేశ్వర వచనములు [ముద్రణమున నున్నది.]

తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర.

37. షార్ట్ స్టోరీస్.

కృష్ణా పత్రిక, ఆంధ్ర భారతి, భారతి, సరస్వతి, ఆనంద వాహిని, అనే పత్రికల లోను జర్నల్‌లలోను అనేక పద్య రచనలు, షార్టు స్టోరీస్ ప్రకటించినాను. మాదిరికి కొన్ని (షార్ట్ స్టోరీస్) కలికి - చిలుక, కరుణకము, సతీ పరాభవము, పల్లెటూరి బావ, మా మేనత్త, కాకి పగ.

38 పద్య రచనలు

అలవాటు, కపోతకథ, కడుపుతీపు, మూన్నాళ్ల ముచ్చట, దివ్యదర్శనము, చిన్ననాటి చేష్టలు, విశ్వాసము.

నడిమింటి మంగళేశ్వర శాస్త్రిగారు

చెళ్లపిళ్ల వెంకట శాస్త్రిగారు

అను ప్రఖ్యాత విద్వాంసులను గూర్చి వ్యాసములు వ్రాసినాను.

ఆంధ్ర వ్యాకరణ విశేషములను గూర్చి

అనేక వ్యాసములు వ్రాసినాను.

అవీయివీ-

గ్రంథ గ్రంథులు-

తేటతెలుగు-

శ్రీనాథుడు-

ఆంధ్ర ప్రజాసామాన్యమున ఆంధ్ర కావ్యముల పలుకుబడి -
యక్షగానములు -
మొయిలు రాయబారము పీఠిక -

అచ్చు వే య వ ల సి న పు స్త క ము లు :-
[25-12-42నాడు నోటుబుక్కులో గుర్తించుకొన్న విషయము]
కాశీఖండము
నీలగిరియాత్రా చరిత్ర
కాటమరాజు కథ
కేయూరబాహు చరిత్ర
కవిలోక చింతామణి
సులక్షణసారము
నైషధ పారిజాతీయము
భీమఖండము.

నా తాలూకు-

పద్యకృతులన్నీ - ఒక వాల్యుంగా
నాటకాలన్నీ - ,,
కథలన్నీ - ,,
వ్యాసములు :
చరిత్ర - ,,
శాసనములు - ,,
వాఙ్మయము - ,,
భాషాచరిత్ర - ,,
సాహిత్యచర్చ - ,,
శృంగార శ్రీనాథము I, II భాగములు
ఉత్తర హరివంశ వ్యాఖ్య
నాగానంద నాటకము
పారిజాతాపహరణ నాటకము.

వ్రా య వ ల సిన వ్యా స ము లు :

గ్రామనామములగూర్చి, నదులు, కొండలు
రాజప్రాసాదములు
భూలోకమల్లుడు-భువనాశ్రయము (అభిలషితా)
వీరభద్రారెడ్డి - త్రైలోక్యవిజయము
కృష్ణరాయలు - భువనవిజయము
మలయకూటము
కొండవీటి వేమారెడ్డి - గృహరాజసౌధము
రఘునాథరాయలు
కాకతీయులు
చంద్రగుప్తునిది - సుగాంగము
ముత్యాలశాల, మోతీమహల్....

ర చిం ప వ ల సి న క థ లు :

1. కొత్తకోడలు
2. పోస్టుమేన్
3. తత్త్రానందస్వామి
4. లుబ్ధగాథ
5. సీమచదువు
6. పెండ్లిముచ్చట
7. పులివేట
8. విద్యార్థి
9. పల్లెటూరు, పట్టణము
10. రైతు
11. బాలకుల పలుకులు
12. కడుపుతీపు
13. మాతాత తాత (మరాటి వెంకటభట్టు).



# ఆదర్శ పురుషుడు - అమృత కల్పుడు

-గొట్టిపాటి బ్రహ్మయ్య

[ గురుదేవుల 15వ వర్ధంతిసభ 1965 ఆగస్టు 29 నాడు హైదరాబాదు నగరంలో ప్రముఖుల సమక్షాన శ్రద్ధాభక్తులతో నిర్వహింపబడింది; పలువురు శ్రీవారి పవిత్ర స్మృతికి అంజలి ఘటిస్తూ తమ అనుభవాలు జ్ఞాపకాలు వివరించి వారి కీర్తిమూర్తిని ఆవిష్కరించారు. ఆ సందర్భంలో అలనాటి 'ఆంధ్రజనత' ప్రముఖుల వ్యాసాల్ని ప్రకటించింది. నేటి కా సభలు జరిగే 15 ఏండ్లు నిండినవి. ఈ ముప్పయ్యొకటవ ప్రభాకర వర్ధంతి సందర్భంగా 'మణిమంజరి' పాఠకుల నిమిత్తమై ఆంధ్రజనతను సంభావించి ఆ వ్యాసాల నిందులో ప్రచురిస్తున్నాము. సం॥ ]

పూజ్యులు శ్రీ ప్రభాకర శాస్త్రిగారు కారణ జన్ములు. వారి జీవితమొక చిత్రవిచిత్ర సమ్మేళనం. నైష్ఠికమైన శ్రోత్రియ కుటుంబంలో జన్మించి మహా సంస్కర్తగా మానవతా వాదిగా జీవించి తనువు చాలించారు. కవి, పండితుడు అయివుండి మహా పురాతత్వ శాస్త్ర పరిశోధకుడుగా, ఆధ్యాత్మిక వేత్తగా సార్ధక జన్ములు అయినారు. దక్షిణకాశి అని ప్రసిద్ధిచెందిన పెదకళ్ళేపల్లి పూజ్య శ్రీ శాస్త్రి గారి జన్మస్థలం. అక్కడ శివకేశవులు ఆరాధ్యులుగా ఉత్సవాలు అనాదిగా జరగడంకద్దు, అద్వైతానికి ఆ పుణ్యస్థలం అనాదిగా సంకేతికం. లలితకళలకు ఆ వూరు పుట్టినిల్లు. ఆంధ్ర దేశంలో సంగీత విద్వాంసులకు ఆది గురువైన శ్రీ సుసర్ల దక్షిణా మూర్తి శాస్త్రిగారి జన్మస్థలం. నాదస్వర వాద్యానికి గురుకులం. అటువంటి సీమలో శ్రీ శాస్త్రిగారు జన్మించారు. వీరి తండ్రిగారు స్వర్గీయ వేటూరి సుందర శాస్త్రిగారు సాహిత్యంలోను, ఆయుర్వేదం లోను ప్రసిద్ధులు. అన్నగారు సంస్కృత సాహితీ వేత్త శ్రీ వెంకటశివ శాస్త్రిగారు. తండ్రిగారు శివ క్షేత్రమైన కళ్లేపల్లిని గూర్చి 'కదళీపుర మాహాత్మ్యము' అనే గంథం రచించారు. తండ్రిగారి సాహిత్య ప్రతిభ వీరికి జన్మతః కలిగింది.

దీనికి తోడు కవిత్వాన్ని ఒక ఉద్యమంగా ప్రభవింపజేసిన శ్రీ తిరుపతి వేంకటకవుల ప్రథమశ్రేణి శిష్యులు వీరు. తిరుపతికవుల గురుత్వం, ఉద్దండులైన శాస్త్రిగారివంటి శిష్యత్వం ఇవి జన పదాలలో చాటుకథలుగా చెప్పుకునే రోజులవి. మేము అప్పటికి చిన్నవాళ్లం.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారు కేవల భావావేశ పరవశులైన కవిమాత్రమే కాదు– ఉద్దండుడైన పండితుడు మాత్రమే కాదు- మహాప్రతిభ గల పురాతత్వ పరిశోధకుడు. తెలుగుదేశంలో మన చరిత్ర, స్థల

మాహాత్మ్యాలు, శాసన కథలు, గాథలు ఎన్నో ఉద్ధరించిన ఉపకారులు. తెలుగుదేశ చరిత్ర కారులలో ఒకరు. సాహిత్యంలోనేకాకపరిశోధనలోనూ ప్రామాణికమైన సేవ చేసినవారు.

మావూరికి ఆయన మేనల్లుడు, ఆల్లుడు అవ్వడం చేత చిన్ననాటి నుంచీ వారితో నాకు పరిచయం వున్నది.

ఆయన గ్రాంథికంలో పుట్టిపెరిగి చక్కగా వ్రాయగలిగిన వారైనా వ్యావహారిక భాషలో గ్రంథ రచన చేసి ఆదర్శప్రాయంగా ప్రజాసముదాయం చదువుకుని ఆనందించేటట్లు చేసిన మహనీయులు. కామధేనువు కథ, తంజావూరి ఆంధ్ర రాజుల చరిత్ర వంటి వారి గ్రంథాలు వ్యావహారికంలో తేట తెలుగులో పెద్దలకు, పిన్నలకు వెన్నతో పెట్టినట్లు రచించారు. ఇల్లాగే వీరి గురువర్యులు శ్రీ చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు కూడా చివరి రోజుల్లో వ్యావహారిక భాషలో కొన్ని గ్రంథాలు రచించారు.

బహుముఖమైన ప్రతిభతో సర్వతోముఖమైన వికాసం కలిగిన శ్రీ శాస్త్రిగారు ఒక వ్యక్తి అనడం కంటె ఒక సంస్థ అనడం సముచితం. ఆయన ఆధ్యాత్మిక వేత్త. తపస్వి.

వారి షష్ఠ్యంతి మిత్రులు జరుపుతున్నందుకు, 'ఆంధ్ర జనత' ప్రత్యేకంగా వారిని గూర్చి సంచిక ప్రచురిస్తున్నందుకు నేను వ్యక్తిగతంగా ఎంతో సంతోషిస్తున్నాను. ఇది శ్లాఘనీయం. సముచితం. దీనితోపాటు వారి అముద్రిత రచనల్ని వీరు వెలుగులోనికి తీసుకు రావలసిందిగా కోరుతున్నాను.

శ్రీ శాస్త్రిగారిని నేను చిన్ననాటినుండి ఎరిగినవాడను కావడంచేత నా స్మృతిపథంలో వారి జ్ఞాపకాలెన్నో స్పష్టంగా కనిపిస్తున్నాయి. మా గ్రామస్థులు శ్రీ పిశుపాటి వెంకటరామశాస్త్రిగారితో కలసి తిరుపతి వెంకటకవులవద్ద చదువుకొనడమేకాక జంట కవులుగాకూడ వ్యవహరించారు. ఇది చాలామందికి నేటివారికి తెలియకపోవచ్చును. శ్రీ వెంకటరామ శాస్త్రిగారు చిన్నతనంలోనే దివంగతులు కావడం వల్ల వారి ప్రసిద్ధి ప్రాచుర్యం పొందలేదు. అటు తర్వాత వారి సోదరినే వివాహమాడారు. శ్రీ శాస్త్రి గారి సతీమణి మహాలక్ష్మమ్మగారు, నేను చిన్నప్పుడు ఒకే బళ్ళో చదువుకున్నాము. శ్రీ శాస్త్రిగారి తరువాత శ్రీ వేలూరి శివరామ శాస్త్రిగారితో కలసి శతావధానాలు చేసిన సంగతి కూడా చాల మందికి యిప్పటి వారికి తెలియ దనుకుంటాను.

మా ఘంటశాల వచ్చినప్పుడల్లా మేము అప్పటి కుర్రకారంతా వారితోనే కాలక్షేపం చేసేవాళ్ళం. 'కంటకశైల' అనే మూల నామధేయం ఘంటశాలగా మారిందని ఎరుగ జెప్పినవారు నాడు శ్రీశాస్త్రిగారే. ఇక ఘంటశాలలో ఏ నాణెం దొరికినా దానికొక చరిత్ర, చరిత్ర ప్రసిద్ధి వుంటుందని వారి విశ్వాసం. మావూరు వచ్చినప్పుడు తల వంచుకునే నడిచేవారు. ఎక్కడ ఏ చారిత్రిక వస్తువు కనుపిస్తుందో, ఏ నాణెం కానవస్తుందోననే భావంతో నడిచేవారు. ఊరి వెలుపల లంజదిబ్బల కేమి, స్థూపశిలలను చూడడానికేమి మేము ఆయన వెంట వెళ్ళేవాళ్ళం.

శుద్ధ శ్రోత్రియులై జన్మించి అలాగే కొంత వరకు పెరిగి ఆ రోజుల్లోనే బ్రాహ్మణులలో శాఖాంతర వివాహం జరిపిన ఘనత వీరికి దక్కింది. అదొక ఆదర్శంగా అనేకులు అనుసరించడం జరిగింది. శుద్ధ శోత్రియత్వం నుంచి గాంధి మహాత్ముని ప్రభావంతో ఒక విచిత్ర సమ్మేళనంగా ప్రభవించి బౌద్ధ మతమన్నా, కుల, మత రహితము సంప్రదాయ సహితము అయిన "సెక్యులర్" జీవిత మన్నా ఎంతో ప్రేమించి అలా సర్వులకు ఆదర్శ ప్రాయంగా జీవించారు. బౌద్ధ మతమంటే

ఆయనకు గల అభిమానం నేను ప్రత్యక్షంగా ఎరుగుదును.

మా దివిసీమ పల్లెపట్ల అందచందాలు, ప్రేమాభిమానాలు, కన్నులకు గట్టేటట్లు "కడుపుతీపి" వంటి ఖండ కావ్యాలలో వారు వ్రాశారు. వారి యోగ విద్యా విషయంలో మేము కూడా కొన్నాళ్ళు వున్నాము. స్వర్గీయ ఉన్నవ లక్ష్మీ నారాయణ పంతులుగారు శ్రీ శాస్త్రిగారికి యోగ విషయంలో శిష్యులు. వారి ద్వారా ఆ యోగ పరిచయం మాకు కలిగింది.

తెలుగు జాతికి మరపురాని సేవచేసి, ఆదర్శప్రాయమైన జీవితం గడిపి మధురమైన స్మృతిని మాత్రం మిగిల్చి వారు వెళ్ళిపోయి పదిహేనేళ్ళు గడిచింది. వారి పవిత్రస్మృతికి నా జోహారులు.





శ్రీ ప్రభాకర పరిశోధక మండలి ప్రథమ వార్షిక సమావేశము (1951) ముక్త్యాల.

పై వరుస (ఎడమ నుండి కుడికి)

శ్రీయుతులు కొత్త రామకోటయ్య; నేతి సుబ్రహ్మణ్యం; విశ్వనాథ సత్యనారాయణ; గద్దె గోపాల కృష్ణయ్య; కొల్లి వెంకట రమణయ్య.

మధ్య వరుస (ఎడమనుండి) వేటూరి శంకరశాస్త్రి; వేటూరి సుందరమూర్తి; తిమ్మావఝుల కోదండ రామయ్య; వెన్నెలకంటి మునిస్వామి; సింగరాజు సచ్చిదానందం.

క్రింది వరుస (ఎడమనుండి)

కొల్లివెంకట నరసింహం; వేటూరి సుందర శాస్త్రి; ఉదయగిరి శ్రీనివాసాచార్యులు; పోచిరాజు శేషగిరిరావు; రాణి సూర్యనారాయణ; వేటూరి ఆనందమూర్తి. [చూ. పుట 110 ]

# శ్రీ ప్రభాకర పరిశోధక మండలి ప్రథమవార్షిక సమావేశము

## ముక్త్యాల

నాటి సమావేశాల మినిట్సు

(28-5-1952 – 29-5-1952)

శ్రీ ప్రభాకర పరిశోధకమండలి ప్రథమవార్షిక సమావేశము 28-5-1952, 29-5-1952 తారీఖులలో ముక్త్యాలలో జరిగింది. మహాకవి, కవిసామ్రాట్ బ్రహ్మశ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి యాధ్యక్ష్యతన 29-5-1952 గురువారమునాడు ఈ క్రిందితీర్మానము లేకగ్రీవముగానామోదింపబడినవి.

1. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'మధుర కవిత'లను గూర్చి వివిధ పత్రికలలో వ్రాసిన వ్యాసములనెల్ల సేకరించి యొక క్రమమునఁగూర్చి 'మధురకవితలు' అను పేర నొక గ్రంథమును ముద్రించి 1952 ఆగష్టు 29వ తేదినాఁటికి జరుగు శ్రీ ప్రభాకరశాస్త్రిగారి ద్వితీయ వర్ధంతినాటికి బ్రకటింపజేయవలయునని తీర్మానింపఁబడినది.

2. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వివిధ పత్రికలలో రచించిన సాహిత్యవిషయక వ్యాసములను కొన్నింటిని కాలక్రమానుసారముగా కూర్చి 'సింహావలోకనము' అను పేర వెంటనే ముద్రించి శ్రీ శాస్త్రిగారి ద్వితీయ వర్ధంతినాఁడు ప్రకటింప జేయవలయునని తీర్మానింపఁబడినది.

3. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు రచించిన యొక గ్రంథమును ముద్రించుట కగు వ్యయమును భరింతునని నెల్లూరు వాస్తవ్యులు సుప్రసిద్ధ న్యాయవాదులు నగు కనుపర్తి లక్ష్మీనారాయణరావు బి.ఏ.బి.యల్ గారు మండలివారికి వ్రాసిన యుత్తరమును పర్యాలోచించి వారి సహాయమును పరిగ్రహించుటకును, వారి యౌదార్యమును ప్రశంసించుచు, కృతజ్ఞత తెలుపుటకును తీర్మానింపఁబడినది.

4. తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధనాలయమున శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఆంధ్రభాషా పరిశోధకులుగా నుద్యోగించు చుండినప్పుడు నాచన సోమన రచించిన యుత్తర హరివంశమునకు వ్యాఖ్యానము రచించియుండిరి. ఆ గ్రంథమునకై యనేకులు శ్రీ ప్రభాకర పరిశోధకమండలివారి కుత్తరములు వ్రాయుచుండుటచే నా వ్యాఖ్యానమును త్వరలో ముద్రింప జేయవలయునని శ్రీ వెంకటేశ్వర ప్రాచ్యవిద్యా పరిశోధనాలయాధికారులను తిరుపతి దేవస్థానాధికారులను కోరుటకు తీర్మానింపఁబడినది.

5. శ్రీ ప్రభాకర శాస్త్రిగారికడ యోగచికిత్సను పొంది యారోగ్య లాభము వడసిన రోగులయు శిష్యులయు ననుభూతులను వారే వ్రాసిన వానిని సేకరించి 'ప్రజ్ఞాప్రభాకరము-ద్వితీయ సంపుటము' అనుపేర పయివర్షాంత సమావేశములోపల ననఁగా ద్వితీయవార్షిక సమావేశములోపల ముద్రింపఁజేయఁ దీర్మానింపఁబడినది.

6. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు సాహిత్యగోష్ఠీ ప్రసంగ సమయములయం దప్పుడప్పుడు తెలుపుచుండిన సాహిత్య విషయముల నపూర్వములయిన వానిని వారి శిష్యులయు, మిత్రులయు, తోడ్పాటుతో సేకరించుటకు తచ్ఛిష్యులయు మిత్రులయు తోడ్పాటు నర్థించుటకును, వానిని సేకరించి గ్రంథరూపమునఁ దీర్చుటకును దీర్మానింపఁ బడినది.

7. శ్రీ ప్రభాకరశాస్త్రిగారి ద్వితీయ వర్ధంతి సమావేశము 29-8-1952 తేదీ తిరుపతిలో జరపు నటుల తీర్మానింపబడినది.

(సం) విశ్వనాథ సత్యనారాయణ (అధ్యక్షులు)

(సం) వే. శంకరశాస్త్రి (కార్యదర్శి) ✻

# జిజ్ఞాసువు

- వేటూరి ప్రభాకరశాస్త్రి

[ "నలువదియేండ్లు నిండె జననంబును దొట్టి" అన్న ఆరంభంవల్ల ఈ పద్యాలను గురుదేవులు 1940 సం॥ తమ జన్మదినాన్ని పురస్కరించుకొని వ్రాసుకొన్నట్లు తెలుస్తున్నది. ఇట్టి భావ పరంపర "పదేండ్ల వయసు రాకముందే...." తమలో కలుగుతుండిన వైనాన్ని "ప్రజ్ఞా ప్రభాకరం" - బాల్య స్మృతులు - ప్రకరణంలో శ్రీవారు వివరించి ఉన్నారు - సం॥]

చ॥ నలువది యేండ్లు నిండె జననంబును దొట్టి యొనర్చినట్టి త
ప్పులు దలపోయఁగా మనసు పొక్కెడునక్కట! జీవితంబు చీ
కుల నెలవయ్యె ధర్మము నగోచరమయ్యెను శాంతి సౌఖ్యముల్
కలలను గాంచుటయ్యె నెటుకాఁగలదో యిఁకమీఁద నీశ్వరా!

మ॥ వెడమాయమ్ములె కాని యిప్పటికి నీ విశ్వప్రపంచంబునం
బొడగాన్పింపక యుంటి వెల్లెడ భయంబుల్ దుఃఖముల్ మీఱెడున్
జడుఁడన్ జిత్తము వేనవేల్విధములన్ సంక్షోభముం జెందె దుం
దుడుకుం బాపి భవత్స్వరూపము నెదన్ దోపింపవే యీశ్వరా!

ఉ॥ సృష్టికి నెల్ల మానవు విశిష్టునిఁ జేసితి వంతకంటెఁ బై
సృష్టి యొనర్ప వింతకు; సరే; మనుజత్వమునన్ నికృష్టముతో
త్కృష్టత లుంచి యజ్ఞత గదించి విభేదమువెంచి కష్టముల్
నష్టము లప్పగించి దొరలంబడఁ ద్రోసెదవేమి యీశ్వరా:

ఉ॥ చూచెదఁ జూచెదన్ వెలికి శూన్య మనంత మహాంతరాళమే
గోచరమౌను దానికొక గొప్ప మహావరణమ్ము గ్రమ్మలోఁ
జూచెదఁ జూచెదన్ బరమ సూక్ష్మముగాఁ బరమాణు బిందువే
గోచరమౌను దానికిని కొండుక యావరణమ్మె క్రమ్మెడున్.

శా॥ అజ్ఞానావరణంబు దీని నెటు పాయంద్రోయఁగా నేర్తునో
జిజ్ఞాసైకరసంబుగా నెపుడు నాచిత్తంబు వర్తించునో
సుజ్ఞానర్త సుఖస్వరూపుఁడగునిన్ జూడంగ నెట్లబ్బునో!
ఓ జ్ఞానాత్మక! ఓ సుఖాత్మక! విభూ! ఓ నిత్య సత్యాత్మకా:

చ॥ తలఁతు స్మరింతుఁ బుట్టువును దాఁటి గతంబు నెఱుంగ నయ్యెదన్
నిలుతు గ్రహింతు నింక మరణించుట దాఁటి యెఱుంగ నయ్యెదన్
వలతును సత్యమున్ సుఖము వాంఛ యొనర్తును దెల్విఁగోరుదున్
గిలగిలలాడుదున్ ఫలమొకింతయు లేద యిదేమి యీశ్వరా!



# స్మృతి పథంలో

(క్షేత్రయ అక్షరాక్షరమును పరమ ప్రమాణమే.)

**— వేటూరి ప్రభాకరశాస్త్రి**

[ 1944 సం॥ మార్చి 5, ఆదివారం ఆంధ్రపత్రికలో ప్రకటించబడిన ఈ వ్యాసంలో గురుదేవులు తాము మద్రాసు చేరిన తొలి దినాలలో అక్కడుండిన సాంస్కృతిక వాతావరణాన్ని తామనుభవించిన సాహిత్య గోష్ఠిని విశదీకరించారు— సం. ]

1907 సంవత్సరమున మదరాసులో నేను శ్రీ పనప్పాకం అనంతాచార్యులుగారి వాత్సల్యమునకు పాల్పడినాను. పండిత గోపాలాచార్లుగారు నన్ను వారి కెఱుకపఱిచినారు. వారికి శ్రీనివాసాచార్యులు గారని బి.ఎ. బి.ఎల్. కుమారుడు. ఆయన తెల్గు కవిత నేర్చినవాఁడు. తండ్రి అనంతాచార్యులు గారు, విద్యావినోద, విశారద బిరుదాంకితుఁడు. అంతకు పూర్వము ఒకప్రక్క భాష్యమయ్యం గారుంటే ఇంకోప్రక్క వీరు అన్నంత ప్రఖ్యాతి గలవారు అనంతాచార్యులుగారు వక్కీలువృత్తిలో. ఆయన ఒకతూరి కాంగ్రెసు ప్రసిడెంటు. తన పేరు 'అనంతాచార్లు' అని దస్కతు చేసేవారు. ఎందుకంటే, అది తెలుగుపలుకుబడిగుర్తు అని ఆయన అనగానే నేను విన్నాను. ఆయన పలుకుబడి చొప్పుననే గోపాలాచార్యులుగారుకూడ 'చార్లు' అని దస్కతు చేసేవారు. అనంతాచార్లుగారికి గోపాలాచార్లుగారిమీద చాల ప్రీతి. అనంతాచార్లుగారికి తెలుగువారంటే చాలా ప్రీతి. విద్వాన్ అభినవ పండితరాయ బిరుదాంకితులగు మాడభూషి వెంకటాచార్యులుగారికీ - అనంతాచార్యులుగారికీ చాలా మైత్రి. వెంకటాచార్యులుగారు అనంతాచార్యులుగారి ప్రేరణమున భరతాభ్యుదయము, హంససందేశము, పుష్పబాణ విలాసము మొదలయిన గ్రంథములు రచించినారు. అనంతాచార్యులుగా రెప్పుడూ ఆంధ్ర పండితగోష్ఠిలో ఉండేవారు. నేను మద్రాసు వెళ్ళిన తర్వాత వారు వైకుంఠవాసు లయ్యేటంతవఱకూ వారానికి నాలుగైదు రోజులయినా నేను వారియింటికి వెళ్ళేవాఁడను. భారతమంటే వారికి పరమప్రీతి. భారతమునుగూర్చి వా రింగ్లీషులో ఒక పుస్తకము రచించినారు. నన్ను దగ్గరపెట్టుకొని తిక్కన భారతము పద్యములనుగూర్చి చిన్ననాటినుండీ పండితగోష్ఠిలో వారు విన్న విశేషములు మొదలయినవి నాతో చెప్పుతూ, నాచే ఆయా పట్టుల కర్థము చెప్పిస్తూ నేను చెప్పినవానిలో గుణవంతములుగా తోచినవాటికి మెచ్చుకొంటూ వాటిని కుమారునికీ గోపాలాచార్లుగారికీ అప్పుడప్పుడు చెప్పుతూ నాకు చాలా ప్రోత్సాహము గొల్పుతూ ఉండేవారు. ఇంగ్లీషు నాకు నేర్పగోరి కొన్ని పుస్తకములను కొని ఇచ్చినారు. నన్ను తమ యింటినుండి తిరువల్లిక్కేణి బీచిదాకా కోచిలో తోడ్కొనివస్తూ ఇంగ్లీషు నేర్పుతూ ఉండేవారు. షేక్స్పియరు ఒథెల్లో వారు తెలిగించిరి. అప్పుడు అందులో మంచి

పట్టులు కొన్ని నాచే పద్యరూపముగా మార్పించిరి. కాని దాని ముద్రణము జరగకముందే వారు గతించిరి. అది యేమయ్యెనో! వారి కుమారుడు శ్రీనివాసాచార్యులుగారు పుట్టిననాఁడు వారియింట మాడభూషి వెంకటాచార్యులుగా రుండిరట! తదాది ఆ కుమారుని పుట్టినదినపు బండుగునాడు ఏటేటా ఒక్కొక తెలుగుపండితుని భోజనమునకు బిలిచి సత్కరించుట యలవాటట! నేను మద్రాసు వెళ్ళిన యావత్సరమున నన్ను భోజనమునకు రమ్మనిరి. అప్పటికి నేను వైష్ణవులయింట భుజించి యెఱుగను. దాక్షిణాత్యుల భోజనపద్ధతి యసలే యెఱుగను. వెఱచితిని. ఆయనయు వారి ధర్మపత్నియు నన్ను బుజ్జగించి, తప్పక రాఁగోరిరి. నా కప్పటికి పందొమ్మిదేండ్లవయసు. మర్నాడు తెల్లవారగానే బండి పంపి నన్ను రప్పించుకొనిరి. అభ్యంగ స్నానము చేయించి క్రొత్తవస్త్రము లిచ్చి తాల్పించిరి. మడికట్టుకొనవలెనని తంటాలు పడితిని కాని క్రొత్తవస్త్రములు మడియే, దాక్షిణాత్య పద్ధతిని వేఱే మడిబట్ట అక్కర లేదనిరి. చీకాకు పడితిని. పట్టుబట్ట కట్టుకొందు నంటిని. సాగలేదు. భోజనము కుపక్రమించితిమి. అన్నము చాల కొంచెముగా ఇతర పదార్థము లేవేవో విస్తరినిండుగా నుండెను. వారు తమ భోజనప్రక్రియ ననుసరింపుమనిరి. ఘృతప్లుతి. తెలుగువారికి నేయెక్కువ కావలెనని; ఎట్లో అధికభోజన శ్రమమునకు పాల్పడితిని. రెండుగంటలవేళ మరల నేదో లఘ్వాహారము. ఆనాడే 'నేంద్రము' అని పేరుగల మలయాళపు టనటిపంటిని నే నెఱిగినది. కోచిమీద నింటికి పంపిరి. మర్నాడు నేను వారింటికి వెళ్ల లేదు. అనారోగ్యముకలిగెనేమో అలవాటులేని భోజనపు తీరువలన నని దంపతులు నన్ను మూడవనాటి ప్రొద్దుట చూడవచ్చిరి. నేను కంగారుపడితిని. తదాది వారితోను, వారి పుత్రులతోను, వారికుటుంబములోని వాడనుగానే వర్తిల్లెడివాడను. అనంతాచార్యులుగారు శ్రీ చిన్నయ సూరిగారి నెఱుగుదురు. గాజుల లక్ష్మీనరసుసెట్టిగారి ప్రాపున చిన్నయసూరిగారు గొప్ప గౌరవము గలిగియుండెడి వారనియు, ఆగుల్ఫము తెల్లని యంగరకా తాల్చి వినిర్మలాకృతితో తేజస్వంతులై చిన్నయసూరిగారు లక్ష్మీనరసుసెట్టిగారి యింట నొక గదిలో నెల్లప్పుడును ప్రాచీన తాళపత్ర గ్రంథపరిశీలన జరపుచుండువారనియు, ప్రతిదినము, కొన్ని యపూర్వాంశములను భాషావిషయమున గుర్తించినగాని వారు భోజనమునకు లేచెడివారుకా రట యనియు, తెల్గననే కాక సంస్కృతమునను వారు గొప్ప పండితులని యానాటి ప్రౌఢవిద్వాంసులందఱు వారినెంతో గౌరవించెడివారనియు, తెలుగుభాషలో, ఆకాలమున, దక్షిణదేశమున, సాత్తని వైష్ణవులే మహావిద్వాంసులుగా నుండెడివా రనియు, చిన్నయసూరిగారి వంటి విద్వాంసు లింక నెందఱో సాత్తనివైష్ణవు లానాడు వర్ధిల్లి రనియు అనంతాచార్యులుగా రనెడివారు. చిన్నయసూరిగారి మేనల్లుడు కాబోలును మన వాళయ్యగారు అనంతాచార్యులు గారికి మిత్రులు. అనంతాచార్యులు గారి మంజువాణీవిజయమును, మనవాళయ్య గారు సంస్కరించిరట. అనంతాచార్యులు గారు మదరాసులో నుండునపుడు (వారు వై స్రాయి కౌన్సిలు మెంబరుగా కలకత్తాలో కొన్నాళ్లుండిరి) ప్రతి యాదివారము మదరాసులోని యాంధ్ర పండితులు వారి యింటికివచ్చి విద్యాగోష్ఠి నెఱపెడివారట. ఒకనాడు శబ్ద రత్నాకరకారులను కొక్కొండ వెంకటరత్నము పంతులుగా రాక్షేపించిరట, "మీ నిఘంటువున క్షేత్రయ పదములను గూడ ప్రమాణముగా గ్రహించిరి 'రాతాయ' (యె అనుటకు) పోయ (పోయెన్ అనుటకు) అని యాతని పదములలో ప్రయోగములు కూడ మీకు పరిగ్రాహ్యము లయినపుడు మీ నిఘంటువునకు ప్రామాణ్యము సిద్ధింపదు". అని సీతారామాచార్యులుగారు వేశ్యాభినయాద్యభిరుచి హెచ్చుగా

గలవారట! క్షేత్రయ పదములను వేశ్యలభినయించుట, వారభినందించుట, పరిపాటియట! "క్షేత్రయ ప్రామాణికుడయిన సత్కవి కాకపోతే, ఆంధ్రమున నిక సత్కవి యుండడు. క్షేత్రయ రచనము అక్షరాక్షరమును పరమ ప్రమాణమే. పోయ, ఆయ, ఇత్యాదులు పంచతంత్రకారుడును ప్రయోగించినాడు. మీకు క్షేత్రయ రచనము గ్రాహ్యము కాకపోవచ్చును. లోకమున సహృదయత యంతరించి పోదు. నా నిఘంటువు నాదరించు వారుండక పోరు." అనిరట! అనంతాచార్యులుగారును వేశ్యాభినయరసికులు. వారెందఱనో వేశ్యలను క్షేత్రయ పదముల నభినయించు వారినిగా జేసిరట! పండిత గోపాలాచార్యుల గారి మేడ మీద నాయేడు నవరాత్రులలో గానసభలు జరిగినవి. ఆ సభలకు అనంతాచార్యులుగారు ప్రసిడెంటు- తొమ్మిది నాళ్లను స్త్రీలే గాయనులు - పురుషుల పాట లందు లేవు. ఆ కచ్చేరీలకు, పొన్నూరి నుండి ఆంధ్ర గాయక రత్నము రామసుబ్బయ్య గారును వచ్చి యుండిరి. కాని వారి పాటకచ్చేరీ లేదు. అనంతాచార్యులు గారు నన్ను రామసుబ్బయ గారిని తమ కుమారుని, ఆ కచ్చేరీలకు తోడ్కొని పొయెడివారు. మాకు టిక్కెట్టు లేదు. తొమ్మిది రోజుల పాటకచ్చేరీలలోనూ, క్షేత్రయ పదములను గొందఱు వేశ్యలచేఁబాడించిరి. ఒక వేశ్య క్షేత్రయ పదమును సాభినయముగా పాడెను. నాకు క్షేత్రయ పదముల గానాభినయ ఘనత నాటికి నేటికి కూడ నపరిచితమే. కాని కొన్ని నెలల క్రింద, శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు, సీతారామాచార్యులు గారుప్రస్తుతించినట్టుగానే, క్షేత్రయనుప్రస్తుతించిరి! సీతారామాచార్యులుగా రన్న విషయమును శర్మగా రెఱిగియుండ రనుకొంటాను. క్షేత్రయ ఘనతను తార్కాణించుటకై యిది పేర్కొన్నాను.

అనంతాచార్యులు గారికి జయంతి కామేశము గారని, గంజాము, విశాఖపట్టణము జిల్లాలకు, అద్వితీయుడయిన వక్కీలు, సహాధ్యాయి. ఆయన మద్రాసులో చదువుకొనే టప్పుడు అనంతాచార్యులు గారి యింట నుండెడివారట! ఇద్దఱును ప్రాణమిత్రులు. కామేశము గారును కవిత నేర్చినవారు. వారి శతకములను అనంతాచార్యులుగా రచ్చు వేయించిరి. అనంతాచార్యులుగారు చెప్పినవి కొన్ని, నేను గంజాము విశాఖపట్టణము జిల్లాలలో గ్రామ వృద్ధుల వల్ల విన్నవి కొన్ని జయంతికామేశము పంతులు గారి కథలు:-

ఒక వ్యాజ్యము తరపున అనంతాచార్యులు గారు వకీలుగా విశాఖపట్టణమో, బరంపురమో వెళ్లిరట! అదే తొలితూరి వారా దేశమున కరుగుట! బాల సఖుఁడగు కామేశము పంతులుగారింటనే వారుండిరి. దాక్షిణాత్యులు బహిర్దేశమునకు వెళ్లునపుడు చెంబు వెంటఁ గొనిపోవునలవాటుండదు. కావున అనంతాచార్యులుగారానాడు సాయంకాల మూరివెలుపల కరిగి అక్కడ నొక ముసలియాడుది కానరాగా, "ఇక్కడ నెక్కడైనా ఒక గుంటను చూపుతావా, పోవలెను" అని అడిగిరట! ఆ ముసలిది 'నీ జిమ్మడ! నీకేమి పోగాలము వచ్చినదో, నన్ను గుంటను చూపుమంటావా' అని తిట్టుచు మొగాన మెటికలు విఱుచుచు తొలగిపోయెనట! అవమానముఁజెంది అనంతాచార్యులుగా రింటికి వచ్చిరి, కాని కామేశముగారితో దీనిని జెప్పలేదు. వ్యవహారము ముగిసినతర్వాత ప్రయాణమునాఁడు కామేశము పంతులుగారి తండ్రిగారు అనంతాచార్యులుగారిని సంభావించుటలో నిట్లనిరట. "అయ్యా, మా గుంటఁడు మీ సహవాసముచేత నీమాత్రము వ్యాప్తిలోనికి రాఁగలిగినాఁడు". అనంతాచార్యులుగారి మనసు అన్యత్రఉన్నట్టు కన్పట్టెను. బదులు సరిగా చెప్పలేదు. 'ఏమో యోచించుచుంటిరే' అని వారనిరి. తనకు జరిగిన పరాభవము చెప్పిరట! అందఱు నవ్విరి.

అపరగౌతములని ప్రసిద్ధిచెందిన శ్రీ పాద రామశాస్త్రులవారు వీరి సహాయముచే బొబ్బిలి యందు వేదాంత శాస్త్రాభ్యాసము నొనరించిరట!

శ్రీ కామేశముపంతులుగారు నిరతాన్న దానప్రతులు. ఒబ్బట్లతో జరిగిన యొకనాటి సంతర్పణమున, వంటవాఁడు సాయంకాల మింటికిఁబోవుచు పెద్ద పళ్లెరమునిండుగా ఒబ్బట్లను బెట్టుకొని పోయినాఁడట! కామేశముపంతులుగారి తల్లి దానిని చూచెను. రాత్రి కుమారునిదగ్గరకు వచ్చి 'నాయనా! నీయన్న ప్రదానములకు, సంతర్పణలకు సంతోషమే కాని దొంగతనముల క్రింద కూడ సొమ్ము నాశనమగుట చూడలేకున్నాను. నీ వేమీ విచారించవుకదా!' అనెను. కుమారు 'డేమిటి అది' అని అడిగెను. "నేఁడు వంటవాడు కొన్నివందలు ఒబ్బట్లు పళ్ళెమునిండుగా పెట్టుకొని ఎత్తుకొని పోయినాడు. సంతర్పణలో పదిమంది భోజనము చేసిన తృప్తిగాని యిటువంటిదికూడ జరుగుచున్నచో నిబ్బరించుట కష్టముగాదా" అనెను. అది విని పంతులుగారు 'సరే, అమ్మా! ప్రొద్దున రానీ, వానిని చీవాట్లు పెట్టుదును. నీవు విచారపడకు' మన్నాఁడు. ఉదయము వీధియరుగుమీద పంతులుగారు పలుదోముకొనుచు వంటవానిరాక చూచి తల్లిని పిలచి తల్లియెదుట వానిని విచారించిరి. 'ఏమిరా! నిన్న సాయంకాలము ఒబ్బట్ల పళ్ళెము పట్టుకొని పోయినావట! నిజమేనా' అని. అతఁడు ఇంట్లో పిల్లల కని తీసుకొనివెళ్ళినా ననెను. 'పనికిమాలిన వాడా, నీకేమి బుద్ధిలేదా! పొడియొబ్బట్లు తింటే కడుపునొప్పి వస్తుందని యెరగవా, శీఘ్రముగా లోపలికిపోయి జారీచెంబునిండా నేయి తీసుకుపో. వెంటనే పో. ఈలోగా పసిపిల్లలు ఇంటిదగ్గర తింటారేమో! ఆపైన బాధపడతారు.' అని చీవాట్లు పెట్టి నేతిజారీ యిచ్చి వెంటనే యింటికిఁ బంపిరి' 'అమ్మా! సంతర్పణచేయుట సంతోషమే నంటివి గదా! ఇదేమనుకొన్నావు? పెంటమీద పారవేయడమనుకొన్నావా? మరి యెప్పుడు నిట్టివానినిగూర్చి విచారము పెట్టుకొనకు. నీ చేతనైతే నీవుకూడా ఎవరికైన నింత పెట్టుచుండుము. గృహనిర్వాహభారము నామీద నున్నది. నీ కెందుకులే యీ చింత' అని మందలించిరట!

కామేశముపంతులుగారు మంచి భోజనపుష్టి కలవారు. గుమాస్తాచేత చదివించుటేకాని రికార్డు సాధారణముగా వారు స్వయముగా చూచుట ఉండేది కాదట! పెద్ద చావడిలో రికార్డు వింటూ ఈమూల నుండి ఆమూలకు పచార్లు చేస్తూ దండెములకు రెండు చక్రకేళీ యరఁటిపండ్ల గెలలు ప్రేలుచుండ నిటు వచ్చినపు డీ గెలలోని దొకపండు అటు పోయినప్పు డా గెలలోని దొకపండు ఆరగించుచు రెండు గెలలను గడతేర్చుట నొకనాఁడొక పెద్ద మనుష్యుఁడు చూచి యచ్చెరువు చెందినాడట.

శ్రీ కామేశముపంతులుగా రొకనాఁడు భక్ష్య భోజ్యములతో విందారగించి, బరంపురమునుండి శ్రీకాకుళమునకుఁ గాబోలును మేనాసవారీమీద ప్రయాణమై వచ్చుచుండిరట! త్రోవలో, ఎండలో వారికి హెచ్చుగా దప్పి పుట్టెను. అది యడవిపట్టుగా నుండెను. మంచినీరు కానరాలేదు. సంకట పడుచున్నారు. త్రోవలో నెదురుగా నొక బ్రాహ్మణుఁడు కానవచ్చెను. ఆయనను పిల్చి 'ఎవ్వరవు? ఎక్కడికి వెళ్లుచున్నా'వని పంతులుగా రడిగిరి. 'అయ్యా! మాది ఫలాని గ్రామము. నాకుమారునికి ఉపనయనము జరుగవలసియున్నది. నేను బీదవాఁడను. కామేశంపంతులుగారను మహాధర్మాత్ములు బరంపురంలో నున్నారని విన్నాను. వారేమైన సహాయము చేయుదురేమో! దానితో నుపనయనము జరుపకొందమని యాచింపఁబోవుచున్నాను' అనెను. 'వెళ్లదువుగాని, నేను మిక్కిలి దప్పిగొని యున్నాను. ఈ చెంబునిండ మంచితీర్థము తెచ్చిపెట్టగలవా? పుణ్యము కల్గును.' అని పంతులుగా రనిరట! ఆ బ్రాహ్మణుడుఁ డాసవారీ బోయలను, బంట్రోతు

లను, వారి ప్రాభవమును చూచి ఎవరో గొప్ప యుద్యోగి యనుకొని వారిదగ్గఱనున్న పెద్దచెంబును తీసికొనిపోయి ఆచుట్టుపట్టుల నెక్కడనో ఉన్న బావి నుండి చెంబునిండుగా తియ్యని చల్లని మంచినీరు కొనివచ్చి యిచ్చెనట! పంతులుగారా చెంబెడునీరు త్రాగి తృప్తిచెంది 'బ్రాహ్మణుఁడా! బ్రదికించితి వయ్యా! కాని పాపము నీవువెళ్లి లాభములేదు. కామేశంపంతులు గ్రామమున నిప్పుడు లేడు. మరల నింకొకతూరి పోయి చూతువుకాని, యీ సారికి దీనిని తీసికొని పొమ్మని చెప్పి సవారీలో తలగడ క్రింద రాశిగాఁబోసి యున్న రూపాయల నాపెద్ద చెంబునిండ నింపి చేతి కిచ్చి 'నీవిచ్చిన మంచినీటి విలువ దీనికంటె హెచ్చుసుమా! కొనిపొమ్మ' అని రట! బ్రాహ్మణుఁడు ఆశ్చర్యము పొందెను. ఆ చెంబులోని రూపాయలు అయిదారు వందలకు తక్కువ యుండవట! పరమానందభరితుఁడై బ్రాహ్మణుఁడు "వెదకఁబోయిన తీగ కాలఁదగిలెను. మీరే కామేశం పంతులుగారు! మహానుభావా! మహా దాతవయ్యా" అని కైవారముచేయుచు తనగ్రామము నకు వెళ్లెను.

అనంతాచార్యులుగారు చెప్పగా విన్న యీక్రింది వృత్తాంతమును, మాడభూషి వెంకటాచార్యులుగారికి సంబంధించిన దానిని, చాటుపద్యమణిమంజరిలో ప్రకటించినాను.

'అనంతాచార్యులుగారి దగ్గఱ కొకప్పుడవలి ప్తుఁ డగు నొక యరవదేశపు విద్వాంసుఁడు వచ్చి స్వర చితములయిన శ్లోకములను జదువుచు, వివరించుచుఁ బ్రశంసించుకొనుచు నుండగా వేంకటాచార్యులవారు వినుచుండిరి. పదిశ్లోకము లయినవి. ఆత్మౌత్కృష్ట్య ప్రశంసాపరాయణుఁడుగా నున్న యా పండితునితో 'నయ్యా, యీశ్లోకములు పిన్ననాఁడు మా నాయన గారు నాకుఁజెప్పిరి. ప్రాచీనకవి కృతులయిన యీ శ్లోకముల ననంతాచార్యులుగా రెఱుగరుగదా యని యాత్మీయములుగాఁ జదువనారంభించితిరా?' యని యడ్డు పలికిరట! కుపితుఁడై వెడనవ్వునవ్వి యాయ రవదేశపుఁ బండితుఁడు వేంకటాచార్యులుగారి నెఱుఁ గక 'యేదీ నీకువచ్చునేని చదువుము. రచించినవాఁ డను నేనే యిక్కడనుండగా నాతోనే యిట్లు పలికెద వేమయ్యా? ఎవ్వర వీవు?' అని తుటారించెనట! ఇదిగో చదువుచున్నానని వేంకటాచార్యులుగా రన్నిం టిని నేకసంథాగ్రహణమున నప్పగించిరి. వెల్లఁ బోయి యా పండితుఁడు వేడుకొనెనట! మీ మహా త్మ్యము నెఱుగనైతిని, మన్నింపుఁడని—"



# శ్రీనివాస నిర్యాణము

( మిత్ర నిర్వేదము )

**-వేటూరి ప్రభాకరశాస్త్రి**

[ గురుదేవుల మిత్ర బృందంలో శ్రీనివాసా చార్యులు ప్రముఖులు. వీరు పనప్పాకం అనంతా చార్యులుగారి కుమారులు. మిత్రుని మృతికి చింతిస్తూ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసిన పద్యాలివి. 1911 సం॥ నవంబరు 24వ తేదీ కృష్ణా పత్రికలో ప్రచురింప బడ్డాయి - సం ]

శా॥ వాచాగోచర శక్తి యుక్తుఁడు పనప్పాకాన్వయుం డయ్యనం
తాచార్యుం డిరువర్షముల్ కడచె స్వర్గా ధ్యాసియై, నేఁడు ధ
ర్మాచారజ్ఞుఁడు కావ్యకర్త, తనయుం డవ్వారికిన్ శ్రీనివా
సాచార్యుండు గతించెఁ దాతపరిచర్యాసక్తిదత్సన్నిధిన్.

చ॥ అఱువది యేండ్ల వగ్గు తనయైకపరాయణ కన్నతల్లియున్
బరమ పతివ్రతామణి యపారగుణాకర ధర్మపత్నియున్
మఱియు ననేక బాంధవులు మ్రాన్పడ మై విడి స్వర్గలోకపుం
దెరువును బట్టి యేగితె! సుధీజన సత్తమ మిత్ర రత్నమా!

శా॥ ఓలిన్ రేలుఁబవళ్లు నిన్విడక యాయుర్వేద మార్తాండ గో
పాలాచార్యులు మిత్ర సత్తముఁడు నీ ప్రాణంబు రక్షింప ని
ర్వేలప్రజ్ఞల ధారవోసియును వ్యర్థీభూతుఁడయ్యెంగటా
కాలం బొక్కఁడ కీడ్వ నెవ్వరికి శక్యంబౌ నివారింపఁగన్?

శా॥ ప్రారంభించితిఁ బెక్కు గ్రంథములు నిర్వర్తింపలేవైతి దే
హారోగ్యంబు లభింపదయ్యె నని నీవడ్డపు వాకు9వ్వ "వ్యా
పారోత్సాహము లేక వ్యాకుల తకుం బాలైతి రే" యందు నీ
ఘోరవ్యాధి గ్రహింపనున్నదని కన్గో లేక మిత్రోత్తమా.

ఉ॥ కన్నుల నీరు క్రమ్మ మెయి కంపము నొందు మనంబు గ్రుడ్డిదై
మిన్నును మన్ను గానక తమిస్రము నిండిన చందమందు న
న్నన్న! భవద్వికుంఠపద యాత్రఁ దలంచిన మాత్ర మాకు, నిం
క న్నినుఁబోఁటి మేటి చెలికాఁడు లభింపఁడు మిత్ర రత్నమా.

ఉ॥ దూరమునంద కన్గొని యెదుర్కొని కైఁగయి సేర్చి లోనికిం
జేరిచి యాసనం బొసగి సేమము నారసి 'క్రొత్త పద్దెముల్
కూరిచినం బఠింపు'మని కోరి పఠింప ముదంబు నెందు బం
గారము వంటి మిత్రము పొకాలెనుబో పలుమాట లేటికిన్.

శా॥ ఆమోదాశ్రులు కన్నులం దొరుగ రాగాలాపముల్ సల్పుచున్
స్వామీ! కేశవ! పార్థసారథి! రమేశా! యంచు మైపొంగి నీ
నామ ధ్యానము సల్పుచుండెడు ప్రసన్న గ్రామణిన్ నీ మహా
ధామంబిచ్చి యనుగ్రహింపఁగదె భక్తత్రాణ! నారాయణా!

(కృష్ణా పత్రిక. 1911 - సం॥ నవంబరు 24వ తేదీ - పు.4.)



# నాడీ గ్రంథములు

—వేటూరి ప్రభాకరశాస్త్రి

నేడు జోస్యమనిన బరిహాసము చేయువారు పెక్కుఱు. విశ్వసించువారు కొలదిమంది. శాస్త్ర మప్రామాణికమా? శాస్త్రజ్ఞుల విజ్ఞానము కొఱవడెనా? ఏల ఇట్లు విశ్వాసము ప్రబలవలయు ననునది విచారణీయము. ఈ శాస్త్రమునం దనేకగ్రంథములున్నవి. కొన్ని ముద్రితములు. కొన్ని యింకను లోకమున కెఱుగరాక నిగూఢముగ గూడ నున్నవి. సామాన్యముగా నిప్పుడు జోస్యము చెప్పువారు జాతకుని స్థితిగతులనుబట్టి, తాము చూచిన సామాన్యగ్రంథములనుబట్టి జనన కాలమునకు బది పదునైదు నిముషము లిటునటుగా నున్న యనిశ్చిత కాలమునుబట్టి గ్రుడ్డివాటుగా నేవో ఫలములను జెప్పుచుందురు. కొన్ని తగులును — కొన్ని తప్పును—తగిలిన వానిని బట్టి యద్దిరా శాస్త్రమని విశ్వసించు నల్పసంఖ్యాకులు తనివినందుచుందురు. వాస్తవమున కిట్టి జోస్యము లేకుండుటే మేలు. జ్యోతిషికుడు రెండేండ్లకు మీద గొప్ప మేలుకలుగునని చెప్పగా నిప్పటినుండియు నుర్రటలూరి, పదువురితోఁ జెప్పుకొని, కడకది కలుగక దుఃఖించుట, కీడు కల్గునని చెప్పగా నిప్పటి నుండియు, కుమిలి, కృశించి, చెడి కడకదిరాక, కన్ను లొట్టవోయినట్టగుట తప్ప నిట్టి జోస్యము వలన లాభములేదు. శాస్త్రముయొక్క సామర్థ్యము గాని, జ్యోతిష్యుల ప్రజ్ఞగాని, యింతతోనే యున్న యెడల విశ్వసింపమియే శ్రేయము.

కడచిన యెనిమిది మాసములు నేను దక్షిణదేశమున నుండి యీ శాస్త్రమున నత్యద్భుత గ్రంథములను జూచితిని—ఆశ్చర్య పోయితిని. వానిని గూర్చి యాంధ్రదేశమువా రెక్కువగా నెరుగరు. ఆంధ్రదేశమున నా గ్రంథములు లేవనవచ్చును. వాని ప్రచారములేదు. ఈ గ్రంథములను 'నాడీగ్రంథము' లనియెదరు. బహునాడులున్నవి—కొన్ని సంస్కృత భాషలో నున్నవి. కొన్ని ద్రమిళభాషలో నున్నవి. శుక్రనాడి, చంద్రనాడి, బ్రహ్మనాడి, ధ్రువనాడి, అగస్త్యనాడి, విశ్వామిత్రనాడి, సుబ్రహ్మణ్యనాడి మొదలగునవి. ఇందుఁగొన్ని గ్రంథములు, ఒక పురుషుడు సరిగా నొకపురుషాయుష జీవితకాలమెల్ల వ్రాసినఁగాని ప్రత్యంతరము సాధింపరానంత పెద్ద గ్రంథములు. సామాన్యముగా నివి ముద్రింపరానివి. జ్యోతిశ్శాస్త్రమున కప్రామాణ్యమును వాదించు బుద్ధిమంతులెల్లరు నీ గ్రంథముల యద్భుతోత్తరత్వమును జక్కగాఁ బరికింతురుగాక—

నేను చూచిన రెండుమూఁడు నాడీగ్రంథముల వింత లెఱిఁగింతును. తంజావూరిలో నుత్తరవీధిలో 'అగస్త్యనాడి' యను గ్రంథ మొక శూద్రునికడ నున్నది. అరవ (పాట్టు) పద్యములు, అఱువది డెబ్బది తాటియాకుఁగట్టలలో నున్నది. ఈ గ్రంథము చూచుటకు జాతక మక్కరలేదు. జననకాల మక్కరలేదు. రేఖలనుబట్టి సర్వము గుర్తింపఁబడును.

జాతకఫలము కోరువాని హస్తమును నాడీగ్రంథము గల యా శూద్రుడు పరికించును. ఒక రేఖను గుర్తించి దానిపేరు మాత్రము వ్రాసిపెట్టుకొని, నాల్గు మూడు దినములు కడచిరమ్మనును. ఈలోగా నాతాటియాకుఁ గట్టలలో వెదకి యారేఖకు రావలసిన జాతకము నెత్తును. అందు, ఆ జాతకుని జన్మ సంవత్సరము, మాసము, తిథి, నక్షత్రము, గడియలు, జన్మలగ్నము, గ్రహస్థితి సర్వము వచ్చును. జాతకము కోరువాడు ముందు తనయొద్ద దాచియుంచికొనిన జాతక చక్రము, జన్మకాలము, సరిజూచుకోవచ్చును. జన్మకాలము కొంచెము తప్పుగా నుండిన, వెనుకటి జాతకమును దీనిని బట్టి దిద్దుకోఁదగినట్లుండును. ఆశ్చర్యకరము కదా! పదపడి అయిదేండ్ల కొకతూరిగా, జన్మకాలమునుండి, యవసానకాలమువరకు, జాతకఫలములు చెప్పును - సమష్టిమీద, జాతకుని స్థితిగతులను చెప్పును-ఈ చెప్పుటలో నేదియును నా పుస్తక స్వామి స్వకల్పిత ముండదు. ఆ తాటియాకుఁ బుస్తకములోని పద్యములనే మనకు వేఱ వ్రాసియిచ్చును. ఈ ఫలములు, జాతకుని యనుభవమునకు నెంతమాత్రమును తప్పియుండవు - కాని, యయిదేండ్ల కొకతూరి చెప్పుటచే, లేశలేశ విషయములు, సూటిసూటిగా, గుదిరి నట్టుండదు- ఉపనయనము జరుగుననుటలో, మొదటి యయిదు సంవత్సరముల ఫలముల చెప్పి, రెండవ యయిదింటిలోనగు నన్నచో నేమి యబ్బురము కల్గును? స్త్రీ, పురుషత్వములు, బ్రాహ్మణాది జాతి స్థితులు, ఉద్యోగాదికములు నేమాత్రమును తప్పిపోక సరిగా వచ్చును. కాని యీ గ్రంథమున కోరిన ప్రతి పురుషుని జాతకము లభించుటలేదట. కొందఱకు దొరకును, గొందఱకు దొరకదు. ఈ గ్రంథమును నేను స్వయముగా జూచితిని - ఒక మిత్రునకు పై విధమున సరిగా సమకూరెను - ఆశ్చర్యము కలిగెను - నాకుఁ జూడఁగోరితిని. 10 దినములు వెదకెను. దొరకలేదు-తొలుత ఒకరూపాయి అడ్వాన్సు తీసుకొని రేఖ పరిశీలించును - పుస్తకమున లభింపకపోయెనా రూపాయి తిరిగియిచ్చును. లభించెనా మరి నాల్గురూపాయ లిచ్చునెడల వ్రాసియిచ్చును.

తొలుత నీ గ్రంథము నా కత్యాశ్చర్యము గలిగించెను గాని దీని తలదన్నిన యుత్కృష్ట గ్రంథములు మఱికొన్ని చూచినతర్వాత నిది యబ్బురముగాఁ దోపలేదు - తంజావూరులోనే, పశ్చిమ వీధిలో స్వామి నాథయ్యర్ అను నొక బ్రాహ్మణుడు ధనికుఁడున్నాఁడు. జ్యోతిషమున మంచి పండితుఁడు. ఈ శాస్త్రమున పరిశ్రమమునకై వేలకొలఁది వెచ్చించెనట! ఆయన కాశిక నాడి నుండి తన జాతకపత్రమును కొనితెచ్చుకొన్నాడు, అరవపాటలు (పద్యాలు). ఆయన తండ్రిపేరు, ఆయనపేరు, వారిపేరుకూడా నా పద్యములందున్నది. ఇప్పటి కాయనకు నల్బది యేండ్లుండును. నేటివరకు నాడీపత్రమున జెప్పిన ప్రకారమే నడచుచున్నదట! ఆయన యా నాడీగ్రంథ స్వామిచే తన జాతకమును జూపించుకోగా తండ్రి పేరు, తనపేరు తనదిగనే సరివచ్చెను. ఈ నా జాతకము నీకిక నెందుకు బనికివచ్చును? కొంత యెక్కువ సొమ్మిచ్చెదను, నా కీ తాళపత్రమునే విక్రయించమని కోరి బలవంతపరచి, యెక్కువ సొమ్మిచ్చుకొని తెచ్చుకొన్నాఁడు. ఆ పత్రము నేను చూచితిని - శ్రీతాళపత్రముపై మిక్కిలి సన్నని యరవలిపితో నున్నది - అరువది బందులపై పడియున్నది. తిరువాలూరు, మధుర, పుదుచ్చేరి మొదలగు స్థలములలో నిట్టి నాడులు మరి కొన్ని యున్నవి. సంస్కృతమున శుక్రనాడి, ధ్రువనాడి మొదలగునవి యున్నవి. అందు ధ్రువ నాడి నేను చూచితిని - ఈ నాడి సత్యాచార్య ప్రణీతము - సత్యాచార్యుడు వరాహమిహిరునిచేఁ బేర్కొనబడినాడట! భట్టోత్పలుడు పేర్కొన్నాడు.

ఈ గ్రంథమున జాతకము పరిశీలించుటకు జన్మదేశము, జన్మకాలము కావలయును. భరతఖండమునకు బహిర్భూతమగు నేదేశమునకు నీ నాడి యుపయోగపడదట! దేశకాలములనుబట్టి కొంత వరిగణనము సలిపి స్ఫుటపరచుకొని, యే లగ్నమో, ఎక్కడ చూడవలయునో వెదకి యెత్తి నాడీగ్రంథ స్వామి చదువును. అందు ముందు జాతకుని జాతకచర్య మొత్తముమీద ఇంచుమించుగా నేబది శ్లోకములలో జెప్పబడును. పిదప జన్మకాలము మొదలుగా ప్రతి సంవత్సరపు వృత్తాంతమును బేర్కొ-బడును. అవసానకాలమువరకు నిట్లు వ్రాయబడును. ఈ చెప్పుటలో లేశలేశమును విస్పష్టముగా, నిస్సంశయముగా, తూ, చా తప్పకుండ జరిగినట్లు చెప్పబడును. స్త్రీయో, పురుషుడో, ఏ జాతియో, జన్మదేశ మెట్టిదో, పితృవంశ చరిత్ర మెట్టిదో, మాతృవంశ చరిత్ర మెట్టిదో, అన్నదమ్మ లక్క-చెలియండ్రు నెందరో, ఎందరు పెద్దలో, ఎందరు పిన్నలో, ఎందరు చచ్చిరో, ఎట్లు చచ్చిరో, జాతకుని స్థితిగతు లెట్టివో, భార్యా కులశీలము లెట్టివో ఈవిధముగా సమష్టిమీద ముందుచెప్పి తర్వాత పుట్టిన సంవత్సర వృత్తాంతము మొదటగానే యేయేట నేమేమి జరిగినది తెల్పును. ప్రస్తుతకాలపు టుద్యోగములు, రైళ్లు, తంతి, ఫోటోగ్రాఫ్, ఎలక్ట్రిసిటి, మొదలగు వాని విషయములుగూడ నందు స్పష్టముగా నున్నవి. తపాలు, ఇంజనీరింగ్, పోలీస్, ఫారెస్టు, ఎడ్యుకేషనల్ మొదలగు నుద్యోగ వ్యవహారమున్నది. పరీక్ష తప్పుట, ప్యాసౌట మొదలగున వున్నవి. అవి యేమి ఇవి యేమి? యేవియేవి నడచుచున్నవో అవి ఇవి యెల్లనున్నవి. ఉదాహరణముగా నొక్క- జాతకముతీరు తెల్పుదును. ఒకడు జన్మించిన తొమ్మిదవ దినమున దండ్రి గతించెను. ఆ దుఃఖముతో తల్లినాడే సూతకబడి చనిపోయెను. ఈ విషయమున్నది. 5వ యేట దత్తుడయ్యెను. ఉన్నది. ఉపనయనాదికము ఏయేయేట నెట్టెట్టు జరిగెనో ఉన్నది. ఎన్ని క్లాసులు ప్రమోషన్ అయ్యెనో ఉన్నది. 'విద్యాశాలేసు పండితః' అని యుండును. రెండేండ్లు యఫ్యేలో మొదటి వత్సరం 'విద్యాభివృద్ధి' యనును. రెండవయేట "విద్యాశాలేసు పండితః" అనును. బి.యే. పాసగుట, బియల్ చదువుట, తప్పుట, ప్యాసగుట, ప్లీడరీచేయుట, లేక ఉద్యోగము చేయుట ఏయేయేట నెట్టెట్టు జరిగెనో, ఎక్క-డెక్క-డకు మారెనో, ఏమేమి జీతము హెచ్చెనో అన్నియునుండును. పదునెన్మిదవయేట బెండ్లి జరిగెను. నాటికి నాతని భార్యకు పదివత్సరములు. అతని జాతకమున పదునెన్మిదవయేట బెండ్లి చెప్పబడును. భార్యకులశీలరూపాదిస్థితులు తెల్పబడును. అక్క-డనుండి క్రమముగా నేయేయేట గర్భాధానాదులు జరిగెనో ఎప్పుడెప్పుడు సంతాన మెట్టెట్టు కలిగెనో ఏదియేది గతించెనో సరిగా దెలుపబడును. ఇట్టివాని భార్య జాతకము పరిశీలింతుమేని—సరిగా నామెకు పదియవ వత్సరమున వివాహము చెప్పబడును. అప్పుడు భర్త కులశీల స్వరూపాదులు తెల్పఁబడును. అది భర్త జాతకముతో సరిపోవును. అందలి విషయములే యిందును నుండును. నాడు మొదలు, భర్తకును భార్యకును సమానమగు, గర్భాదాన సంతానోత్పత్త్యాదులు, భర్త జాతకముతో సరిపోవుచు, నద్భుతముగా వర్ణితమయి యుండును. భార్య కిర్వదవయేట కలరా వచ్చెననుకొందము. భర్త జాతకమున నిర్వదియెన్మిదవయేట భార్యకు కలరా వచ్చినట్టు వ్రాయఁబడును. ఇట్టి యద్భుత విషయములకు దృష్టాంతములు చూపిన తీరదు. ఒక కేరళదేశీయుని జాతకము చూడఁబడెను. అందు 'కేరళీయాను సారతః' అని, యాదేశ వ్యవహారమును బట్టి కల్గెడు కులాచార నిబంధములు వాని చరిత్రము సరిగాఁ దెల్పబడెను. పూర్వజన్మ వృత్తాంతము గూడఁ గొందరకు దెల్పఁబడును. ఇట్టి విషయము

లాశ్చర్యావహములు. ఒక్క విశేషము ఒక్క స్థలమున నిముషమునకు నాల్గు భిన్నజాతకములు పొసఁగ వచ్చునఁట. అనగా, నిర్వదినాల్గు సెకండ్ల కాలమునకు, ఒక్కొక్క జాతకము యేర్పడును. ఇంత సుసూక్ష్మముగా జన్మకాల పరిజ్ఞానము సామాన్యముగా సుదుర్జ్ఞేయము. 4, 3 నిముషములకు హెచ్చు తగ్గును. కాబట్టి సరియగు జాతకము రాదు కొన్ని పదివత్సరములు సరిపోయి తర్వాత భేదించును—కొన్ని యిర్వదేండ్లు సరిపోయి భేదించును—కొన్ని ముప్పదేండ్లు సరిపోవును—అనగా, నిజమగు జన్మకాలమునకు, పదేండ్లు సరిపోయిన కాలము కంటె నిర్వదేండ్లు సరిపోయిన జాతకము చేరువది. ముప్పదేండ్లు సరిపోయినది, అంతకంటె చేరువదియగును. ఏమాత్రము భేదించినను తనదిగా విశ్వసింపరాదు. పదకొండవయేట జరిగిన తండ్రి మృతి, పండ్రెడవయేట జెప్పబడియెనా, అది తనది కాదని త్రోసివేయవలసినదే. ఈ విధముగా, నిప్పుడు జాతకుడు తానేయేట జాతకమును జూపించుకొనుచున్నాఁడో అంతవఱకు సరిపోయిన జాతకములను గనుగొనవలెను. అవి రెండు నిముషములు వెనుక, రెండు నిముషములు ముందు, దానిచ్చిన కాలమునకుగా నుండును. వానిని వ్రాసిపెట్టుకొనినచో, అక్రమకాలపువి, కొన్నాళ్లకు కొంచెము భేధించి తప్పిపోవును— సరియగు కాలపుది నిలచును. కాని 1 2 నిముషములు భేదముగల జాతకములు, ఏవో కొన్ని విషయములలో కొంత హెచ్చు తగ్గును గాని, తక్కిన సర్వము సరిగానే ఉండును. జ్యోతిశ్శాస్త్రమున కప్రామాణ్యము వాదించు బుద్ధిశాలురీగ్రంథము విషయము తెలిసికొన గుతూహలము గొంతురు కాక—ఈ గ్రంథము, ఏబదిరెండు సంపుటములు గలది—దీనిని ఏడెనమండ్రుగురు కలసి కాపీచేసిన నగునేమోగాని ఒక్కడు ఒకతరములో సామాన్యముగా వ్రాయనేఁరడు. ఈ గ్రంథము "శేషాచార్యులు" అను వైష్ణవుని కడనున్నది. ఆయన యిప్పుడు తిరువల్లిక్కేణిలో నున్నాఁడు — సి. పి. రామస్వామి అయ్యరు, ప్రభృతులగు మహోన్నతుల జాతకములఁ జూచుచున్నాడు. ఏదోయొక నాడీ గ్రంథము మన యాంధ్రమండలమున జగ్గయ్యపేటలో గూడ నున్నట్లు వినవచ్చెను. అదియును, ధ్రువనాడివలెనే లేశలేశ విషయములను స్పష్టముగా దెల్పునట! ఈ గ్రంథములు అలోకసామాన్యమైన దివ్యచక్షుస్సుతో నెవ్వరో మహానుభావులు లోకానుగ్రహకాంక్షచే రచియించి యుంచిరేగాని, శాస్త్రము పరిగణనము సలిపి సమకూర్చినవి కావని పెక్కురు తలఁచుచున్నారు.

అత్యాశ్చర్యమును గలిగించు నిట్టి మహోత్కృష్ట గ్రంథము లింతవఱకు నైరోపాదేశీయుల కంటఁబడినట్టు కానరాదు. భరతఖండమున నున్న ప్రాచీన సంస్కృత గ్రంథములను సర్వమును గాలించి, ఏయే దేశమున నేయేస్థలమున నేయే పుస్తకశాలయున్నదో, అక్కడ నేయే గ్రంథములున్నవో యెఱిగి, యనన్యసాధ్యమయిన తీరున, 'క్యాటలాగు'ను బ్రచురించుచున్న జర్మను దేశీయుల 'కేటలాగ్సు కేటలాగోరం'లో నీ నాడీగ్రంథముల ప్రశంస గానరాదు. భరతఖండమున గూడ నీ నాడీ గ్రంథములు దక్షిణదేశముననే కానవచ్చుచున్నట్లున్నవి. ఈ గ్రంథములు గలవారు, వాని మూలమున ధనార్జనము చేయుచున్న వారగుటచే నితరులకు వెల్లడింపరైరి. కావున, నెక్కడివక్కడనే శిథిలమయినవి కాగా మిగిలియున్న కొన్ని గ్రంథము లిప్పుడు బయటికి వచ్చుచున్నవి. నా యీ వ్యాస మనేకులకు అవిశ్వాసార్హముగాఁ దోపవచ్చును. కొంత వ్యయ ప్రయాసములకుఁ బాల్పడి వారందలి సత్యాసత్యలను నిర్ధారింపఁ జూతురుగాక!

(కృష్ణాపత్రిక 1917, అక్టోబరు 6 వ తేది)



# లక్ష్మీ పార్వతీ సంవాదము

వేటూరి సుందరశాస్త్రి గారి రచనలు



[ గురుపాదుల జనకులైన శ్రీ వేటూరి సుందర శాస్త్రిగారి గేయ రచన లిట్టివి వేటూరి వారి యింట పలువురు విని పాడి నేర్చు కొని ప్రచారమునకు దెచ్చినవే. సం. ]

1. కాళికాంబ! నీ కాంతుని కంఠము
కాటుక నలుపేమమ్మా?

2. కమలాలయ! నీ కాంతుని కాయము
కాటుక మేఘము గదె కొమ్మా!

3. ధరధర సుత! నీ ధవునకు ఉరమున
హారము లహిగణమే మమ్మా?

4. శరధిసుతా! నీ వరుడు రగముపై
శయనించును గద ఓయమ్మా!

5. భవు డనవరతము పైశాచములతొ
పర్యటనము గదె యో కొమ్మా!

6. పద్మాలయ! నీ పతి పసితనమున
పసులగాచుటే పనియమ్మా

7. ముద్దియ! నీ పతి గద్దరితనమున
యెద్దునెక్కుటే పనియమ్మా?

8. ముద్దుగుమ్మ! నీ మొగుడుర్విని బొల్లి
గద్ద నెక్కు-టే గతికొమ్మా!

9. గట్టు పట్టి! ముక్కంటి వేల్పు వెలి
గట్టునుండుటే పని యమ్మా?

10. చుట్టువాలు చేబట్టేటి దిట్టరి
గట్టుమోయుటే గతి కొమ్మా?

11. చెలియా! వలిమలయల్లుడు వేలుపు
కాలువ తలదాల్చెనె కొమ్మా!

12. కలశోదధి సుత! గంగాంబను కుడి
కాలదాల్చు టే పనియమ్మా

13. కనక నగముచే గల్గియు కపాల
భిక్షాటన మే గతి కొమ్మా?

14. శ్రీధరుడై బలికడ మూడడుగులు
క్షితిదానము గొనుటేమమ్మా

15. కాలోరగ గతి గాలెడు హాలా
హల పానంబే గతి కొమ్మా!

16. క్షీరజలధికన్యా సుర విషకుచ
దుగ్ధమె గతి గదెయోకొమ్మా

17. కదళిపురీ కాకోదరేశ్వరుని
కాయము సగమిదె గై కొమ్మా

18. ఘనవేటూరి జోగయ సుత సుందర
కవి గాచుటకిది తరియమ్మా!

19. మనమిరుపుర మత్యను కూలత యా
యన ఘునిగాచు దమిదెకొమ్మా.



# శ్రీ కాకా భుజండరు మహర్షి

—వావిలికొలను వేంకటరమణారావు, బి.ఎ., బి.ఎల్.

[ స్వర్గీయ వావిలికొలను వేంకటరమణరావుగారు మాస్టర్ C. V. V. గారి శిష్యులు, గురుదేవులకు మిత్రులు. వీరు మాస్టర్ యోగమును గూర్చియు, తమ అనుభవములను గూర్చియు తెలుగునందును ఇంగ్లీషునందును పెక్కు వ్యాసములు వ్రాసిరి. వీరి తెలుగు వ్యాసములు కొన్ని 'ఆంధ్రవాణి'(1945) యందు ప్రకటితములైనవి. వానిలో ఒకటి ఈ వ్యాసము—— సం ]

దక్షిణ హిందూ దేశములో వన్నెకెక్కిన మహర్షులలో శ్రీ కాకా భుజండరు ఒకడు. ప్రళయాంతములో 21 కాకులలో ప్రాణముతో నిలిచినది కాక భుజండరు ఒకరే. ప్రళయములో సృష్టికి కావలసిన ఓజములన్నియు ఒక అమృత కలశము నందుంచ బడినవి. ప్రవాహ మంతటను వ్యాపించిన తరువాత ఆ అమృత కలశమును మూసి త్రాడుతో కట్టి నీటి మీద నుంచమని సలహానిచ్చిరి. ఆ అమృత కలశము చాలకాలము నీటి మీద కొట్టుకొని పోయి పోయి వరదలు తగ్గిన తర్వాత ఇప్పుడు కుంభకోణమని పిలువబడు ప్రదేశమున భూమికి తగిలెను. అట్లు తగిలిన తర్వాత దారము తెగి అమృత మంతయు క్రింద దొర్లిపోయెను. అది యొక చిన్నకొలనుగా ఏర్పడినది. ప్రస్తుతము మహామఖము కొలను అచ్చోటనే ఏర్పడినట్లు స్థల పురాణము వలన తెలియుచున్నది. అది ఒక కోణాకారముగ (V) పడినందున యీ స్థలము కుంభకోణ మనబడు చున్నది. బృహస్పతి గ్రహము 12 సం॥లకు ఒకతూరి సింహరాశి ప్రవేశించినపుడు గంగానది, బ్రహ్మపుత్రానది, సింధూ మొదలగు పుణ్యనదుల యొక్క ఊటలు యీ కొలనులో దేరునట. ఇదియే గడచిన "మాసీ మహోత్సవము." ఆ పుణ్య దినమున యీ కొలనులో జలకమాడిన వార్కి ఉత్తమపదవి వచ్చునని, పాపములు నశించునని పురాణకథనము.

ఇట్టి మహాస్థలములో శ్రీ కాకా భుజండరు ఇప్పుడు మానవ జన్మమెత్తి బ్రహ్మదర్శనముకు వేచియున్నట్లు తెలియు చున్నది.

వీరు గత జన్మాంతరములో "కాకా భుజండ నాడి" యను యొక గొప్పనాడి గ్రంథమును రచించినట్లు తెలియు చున్నది. ఇది కలియుగము ప్రారంభమున వ్రాయబడినట్లు తెలియుచున్నది. అరవభాషలో వ్రాయబడి పద్య రూపమున నున్నది శ్రీ కాకా భుజండ వశిష్ఠ సంవాదము, (ఇతను 8వ వశిష్టుడట) జాతక పూరితమైనను యోగ విషయములను గురించియే వ్రాయబడి యున్నది.

శ్రీ కాకా భుజండరు ఒక మహాయోగి. అతను పూర్వ జన్మములో బ్రహ్మ దర్శనము కోరెను. అయితే వారి మార్గములో ఒక వజ్రకుడ్య మడ్డుపడి విఫలుడయ్యెను. అప్పుడచటనే విలపించుచునుండిన తరుణములో "కలియుగ ప్రథమ భాగములో 28 వ

చతుర్యుగములో బ్రహ్మ అవతరించునని. వారి దర్శనము అపుడు చేయనగు" ననియు నొక ధ్వని వినబడెను. కావేరి తీరమున నున్న భగవాన్ ఘట్టము దాపుననున్న కామకోటి పీఠము ఎదురుగా బ్రహ్మము మానుషాకృతిగా జన్మించుననియు విన బడెను. అటుపై శ్రీ కాకా భుజండరు తన తపస్సు వదలి పై వినిన తరుణమునకు వేచియుండెను. తన మిత్రుడైన 8వ వశిష్టుడు కూడ సమయము కనిపెట్టి యుండి వారిరువురును బ్రహ్మము అవతరించిన తరువాత జనించి వారికి సకాలములో శిష్యులైరి. ఈ నాడి వలన సృష్టికి కారణభూతుడైన యాది పురుషుడు కుంభకోణములో 4-8-1868 సం॥న జన్మించిరి. 1910 సం॥ మే నెలలో "భృక్తరహిత తారక రాజ యోగమును"ను తన మిత్రులకు ఉపదేశింప ప్రారంభించిరి. అట్లు 12 సం॥లు వరకు తన యోగ విధానములను శిష్యకోటికి బోధించుచు వచ్చిరి. మే నెల 1922 సం॥లో తన యోగశక్తి వలన దేహమును త్యజించి యదృశ్యులైరి. వారి యోగ పరిపక్వము వలన తిరిగి మనుష్యాకృతిని బొందుదురు. ఇది యంతయు నీ నాడి మూలముననే తెలియుచున్నది. ఈనాడి, బ్రహ్మమే తనకు చెప్పినట్లున్నూ కాకాభుజండరు వ్రాసినట్లున్నూ నాడి వలన విశదమగు చున్నది.

ఈ నాడి యొక అద్భుతమైన గ్రంథరాజము. నూతనముగా కనిపెట్టబడిన ప్లూటో గ్రహము కూడ దీనిలో "బ్రహ్మసూరి" అని పేర్కొనబడి యున్నది. ఈ ఋషి ఖగోళ శాస్త్రములో జ్యోతిశ్శాస్త్రములో మిక్కిలి ప్రవీణుడు. ఈ నాడివల్లనే ఇపుడు కలియుగ సంధికాలమని తెలియు చున్నది. శ్వేత వరాహ కల్పము మారి బ్రహ్మకల్పముగ నగును. వైవస్వతమనువు అంతరించి సూర్య సావర్ణిమనువు ప్రారంభింప నున్నది. దీనిలో సాయనాంశములు ఒకానొకచోట వ్రాయబడి యున్నవి. గత 21-3-1926 ది నాటికి ఆయనాంశములు 22-44 అనిన్ని సం॥ము 1-కి 50"-12" వృద్ధి యనియు ఈ గ్రంథము వలన మనకు తెలియు చున్నది. ఈ నాడిలో విషయము లనేకములున్నవి. కాలక్రమమున అవి యన్నియు వ్రాయ నుద్దేశించి యున్నాము. విషయము అరవభాషలో నుండుట వలన చదువరులకు రుచించునో రుచించదో యను సంశయము వలన ఆ పద్యములను వ్రాయలేదు. అయిన జ్ఞానసంపాదనమునకు స్వభాషాభిమానము అడ్డురాగూడదు. కావున తరువాయి వ్యాసములలో అరవ పద్యములను వాటి తర్జుమాతో సహా వ్రాయ నుద్దేశించి యున్నాము. ఈ బ్రహ్మాంశములో అవతరించిన మహాపురుషుని గురించి తాళపత్రములలో వ్రాయబడిన మరి రెండు నాడులున్నవి. వినాయక నాడి అనునది అరవగ్రంథము 'ధ్రువనాడి' యనునది సంస్కృత గ్రంథము. ధ్రువనాడి గ్రంథకర్త సత్యాచార్యులు. ఇప్పటికి 1100 సం॥ముల పూర్వము అనగా కీ. శ. ౧వ శతాబ్దములోని వాడు. ఈ రెండు గ్రంథములు జ్యోతిష శాస్త్రము ననుసరించి జాతకముల ఫలా ఫలములను తెలుపును. ఈ మహా పురుషుని జాతకమును మా మిత్రుడు శ్రీ బ్రహ్మాండము కుటుంబరావు గారు (బాపట్ల — గుంటూరు జిల్లా) తెనుగు అక్షరములతో ధ్రువనాడి ననుసరించి ముద్రించి యున్నారు.

(21-4-1945 ఆంధ్రవాణి)



## ప్రముఖులిద్దరితో ...
## మోచర్లవారితోనూ దీపాలవారితోనూ

# ముఖాముఖి

—డా॥ వేటూరి ఆనందమూర్తి

మొన్నీమధ్య నెల్లూరు వెళ్ళినపుడు పెద్దలిద్దర్ని- మోచర్లవారినీ, దీపాలవారినీ దర్శించాను. అభివాదనము అర్పించిన పిదప 'మణిమంజరి' ప్రస్తావన తెచ్చి అచ్చవుతున్న పత్రికకాపీ అందించాను. ప్రభాకర సంస్మరణతో పులకించిన మోచర్ల రామకృష్ణయ్యపంతులుగారు మణిమంజరిని కళ్ళకద్దుకుని "ఇవాళ నృసింహజయంతి (17-5-81). ఈ దినం ఒక పుణ్యపురుషుని స్మరణచేసుకోగల్గడం నాసుకృతంగా భావిస్తున్నాను" అంటూ ఒక గంట సేపు తమ అనుభూతి విశేషాల్ని వాచా వివరించారు. నావెంట ఆనాడు టేపురికార్డర్ లేని కారణాన మనస్సులోనే వాటిని ముద్రించుకున్నాను.

మోచర్లవారు: "నా జీవితంమీద మరపురాని మరువలేని ముద్రవేసినవారిలో ప్రముఖులు ప్రభాకరశాస్త్రిగారే. నా ఇరవయ్యోయేట ఏవో పద్యాలు వ్రాసి గన్నవరపు సుబ్బరామయ్యగారికి ప్రకటనార్థం ఇచ్చాను. ఆ సందర్భంలో ఒకసారి ఆఫీసుకి వెళ్ళి విచారించగా అవి అచ్చవుతున్నాయని చెప్పారు. ఆనందంతో నేను తిరిగివస్తుండగా ప్రత్యేకం నన్ను పిలిచి సుబ్బరామయ్యగారు 'వారే ప్రభాకరశాస్త్రులవారు' అంటూ పరిచయముచేసి నాకా మహాపురుషుని దర్శనభాగ్యం కలిగించారు. శ్రీవారిని చూడగానే నాలో ఏదో చైతన్యస్పందన కలిగింది. 'నువ్వేనా ఆ పద్యాలు రాసింది? చాలా బాగున్నాయి నాయనా' అని వారనడంతో మరి నా ఆనందానికి అవధులు లేకపోయినాయి. 'ప్రభాకర శాస్త్రిగారే మెచ్చుకొన్నతర్వాత నా కవితకు వేరే సర్టిఫికెటెందుకు! ధన్యాత్ముణ్ణి' అనుకున్నాను. వారి వాత్సల్యాభిమానాలవల్లనే కవితారచనలో నాకా మాత్రం ప్రేరణ కలిగింది. నాకు ఛందస్సు అదీ నేర్పిన మా చిన్ననాటి గురువులు కవితకు దూరమైపోయినా నేనామాత్రం వ్రాయగల్గినానంటే అది వారి అనుగ్రహం వల్లనే. మాకు ఆయన ఆరాధ్య పురుషుడు. నా 'ఆత్మబోధ' రచన ఆవిష్కరించే సందర్భంలో నేను తిరుపతికి వెళ్ళి వారిని స్వయంగా ఆహ్వానించాను. ఆయన దయతో అంగీకరించి వచ్చారు. ఇక్కడ కె. యల్. నారాయణరావు గారింట్లో బసచేశారు. ఆనాటి సభలో వారు అస్మదాదులకెంతో ఉద్బోధ కలిగించారు. అలాగే దేశికులవారి రచనకు నేను చేసిన అనువాదాన్ని మెచ్చుకుని తొలిపలుకు వ్రాసియిచ్చారుకూడా.

శాస్త్రులవారి సాన్నిధ్యమే మహాభాగ్యం. వారితో భాషించగల్గడం భాగ్యవిశేషమే. వారి ఒక్కొక్క వాక్యం ఎంతో అనుభవాన్ని, విజ్ఞానాన్ని ఆత్మవికాసాన్ని పిండిపోసేదిగా ఉండేది. 'ప్రపం

చంలో ఎన్నెన్నో భాషలూ, ఆయా భాషల్లో ఎంతెంతో సారస్వతమూ వెలువడ్డాయిగాని ఏ భాష లోనూ ఎక్కడాలేని అపూర్వ సన్నివేశం కాళిదాసు కుమారసంభవం' అన్నారు శాస్త్రిలువా రొకసారి. ప్రపంచ సారస్వతంలోనే ఆయన కుమారసంభవాని కొక ప్రత్యేకత ఉందని వారి అభిప్రాయం. వారితో భాషించడమే ఎంతో విజ్ఞానదాయకంగా ఉండేది. వారి ఉపన్యాసాలు విజ్ఞానకోశాలుగా ఉండేవి. కావలిలో ఒక పర్యాయం శ్రీనాథ జయంతి సభ జరిగింది. నేను దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు మరి నలుగురైదుగురం కలిసి ఆ సభలకు ఇక్కడినుండి వెళ్ళినాము. ఏమి అద్భుతమైన ఉపన్యాసం! విషయం వారు చెబుతుంటే ఏదో ప్రిపేర్డ్ టెక్ట్సులోంచి పేరాలుపేరాలు తిరగేస్తున్నట్లే! అట్లా ఉండేది వారి ప్రజ్ఞాధార. శ్రీనాథుడిమీద వారికిగల అధికారం అట్టిది.

ప్రసంగవశాన విషయం శ్రీనాథుడిమీద నించి చాటు పద్యమణిమంజరి మీదికి, అటునుండి దీపాల వారి మీదికి మరలింది.

'పిచ్చయ్యశాస్త్రిగారిని కలిస్తే మీకింకా చాలా విశేషాలు చెప్పగలరు. నాకిప్పుడు 77. ఆయన నా కంటే పదేళ్లు సీనియర్' అన్నారు.

అప్పుడే నేను దీపాలవారింటినుండి వస్తున్న వైనమూ, నగరంలో ఏదో సాహిత్యసభలో పాల్గొన బోయి వారు ఇంటివద్దలేకుంటే మణిమంజరి కాపీని వారింట విడిచి మర్నాడు కలుస్తానని చెప్పివచ్చిన వైనము మోచర్లవారికి తెలియజేశాను. దీపాలవారి సాహిత్యాభిరుచీ కృషీ అంతటి మహనీయములుకను కనే ఎనభైమూడేళ్ల ముదిమినీ లెక్కచేయకుండా సభల్లో పాల్గొంటూ ఉండడమూ, వట్టి పాల్గొనడమే కాక వాదానికి దిగినపుడు ఎదురులేని విధంగా ఈ నాటికీ 'శ్రీనాథుడు-శృంగారి'(యే!) లాటి విమర్శ గ్రంథాలు వెలయించడమూ చేయగల్గుతూ ఉన్నారు గదా అనుకున్నాను. ఆ క్షణాన మోచర్లవారి హృదయఫలకం మీదనూ ఈ భావాలే చదువుకుని తృప్తిపడి ఈ పెద్దలిద్దర్నీ కలకాలం పరమేశ్వరుడు చల్లగా చూడాలని ప్రార్థించుకున్నాను.

మోచర్లవారింతలో 'ఒక హ్యూమరస్ సిచు వేషన్' అంటూ యీ విషయం తెలియజేశారు.

"తాళపత్ర గ్రంథాల సేకరణకి, చాటుపద్యాల సేకరణకీ ప్రభాకరశాస్త్రిలవారు ఈ ప్రాంతాలలో పర్యటనలు చేసినపుడు చాలా సందర్భాలలో పిచ్చయ్యశాస్త్రిగారూ వెంట ఉండేవారు. ఒకసారి వారిద్దరూ ఇక్కడికి సమీపంలోని ఒక గ్రామానికి వెళ్లారు. ఒక సంపన్నులయింట బస చేశారు. ఎవరో బ్రాహ్మలింట ఏర్పాటు చేయగా భోజనాదికా లయాయి. రాత్రి బసచేసిన వారియింటి బయట అరుగులమీద పడుకున్నారు. ఒకరాత్రివేళ అక్కడి గృహస్థు తాలూకూవా శ్లైవరితోనో పరిచయమున్న వారెవరో కాబోలు ఒక స్త్రీ పొరపాటున ప్రభా కరశాస్త్రిలవారు పరున్న తావునకువచ్చి కప్పుకొన్న దుప్పటీ లాగబోయిందట. 'ఎవరది' అని ఆయన లేచి గదమాయించే వేళకు ఆ మనిషి తన తప్పిదం తెలుసుకుని వెనకడుగులువేసుకుంటూ చీకటిలో జారు కున్నదిట. మర్నాడుదయం 'ఏమయ్యా పిచ్చయ్య శాస్త్రీ! ఇలాటి అసందర్భపు చోటుకి తీసుకువచ్చా వేమిటి?' అన్నారట శాస్త్రిలవారు. సంగతివిని పిచ్చయశాస్త్రిగారూ సంకటపడ్డారట. ఆ (అ)సంద ర్భాన్ని పిచ్చయశాస్త్రిగారే నాకు చెప్పారు". ఇంకా జ్ఞాపకం చేసుకుని చెప్పవలసిన విషయాలు ఎన్నో ఉన్నాయన్నారు. అనుకొన్న ప్రకారం మర్నాడు నేను వారిని దర్శించిఉంటే మరికొన్ని విషయాలు ముచ్చటించిఉందురు. అప్పుడు నా కా అవకాశం కలుగలేదు. సెలవుతీసుకొని వచ్చేముందు మోచర్లవారితో అన్నాను. "మహాత్ముని గురించి నాయనగారు చేసిన రేడియోప్రసంగాన్ని ప్రశం

సిస్తూ అప్పట్లో చాలా లేఖలు వచ్చినాయి. ఆ వ్యాసాన్ని ఆంగ్లంలోకి తర్జుమా చేయించాలన్న ఆనాటి మీ లేఖలోని సూచన ముప్పైయేళ్ళ తర్వాతనైనా మా యీ 'మణిమంజరి' మూలాన నిర్వాహణ చెందినందుకు మాకు తృప్తిగాఉన్నది"అని.

'ఈశ్వరసంకల్పము! చాలా మంచిపని చేస్తున్నారు మీరు. పత్రికలో ప్రతి అక్షరము తీరికగా చదువుకుంటాను రేపు' అన్నారు. అప్పటికే చీకటి పడింది. అత్తితోట అగ్రహారం వీధినుండి ఇంటికిచేరి నాటి సమావేశాన్ని కాగితంమీద నెమరుకి తెచ్చుకున్నాను.

రెండురోజులతర్వాత అనుకొన్న ప్రకారం ఉస్మాన్‌సాహెబు పేటకు వెళ్ళాను దీపాలవారి దర్శనార్థం. ఉదయం అనుష్ఠానాదులు ముగించుకొని తీరికగా కూచుని నే నిచ్చివచ్చిన 'మణిమంజరి' తిలకిస్తున్నారు. నన్ను చూడగానే వాత్సల్యంతో పలకరించి "చాలా ముఖ్యమైన పనీ విలువైనపనీ చేస్తున్నారు మీరూ, పరిశోధకమండలి సభ్యులూను. మణిమంజరి పుటలు తిరగవేస్తుంటే ఒకలోకం నుండి ఇంకోలోకంలోకి వెళ్లుతున్నట్లుంది. చంద్రశేఖరశాస్త్రిగారి వ్యాసం ఎట్లాటి వ్యాసం! ఎన్నెన్ని సంగతులున్నాయి అందులో..., ప్రభాకరశాస్త్రిగారే నాకు మార్గదర్శకులు. శాస్త్రిగారిని స్మరించుకోనిదే నాకు దినంగడవదు. నా దురదృష్టంవలన ఆయన స్వయంగా రాసి సంతకం చేసిచ్చిన చాటుపద్య మణిమంజరి రెండుభాగాలూ క్రీడాభిరామం ఇప్పుడు నావద్ద లేవు. ఎవరో ఇటీవల కాజేశారు. మరి వారికి దానివిలువ ఏమి తెలిసి తీసుకుపోయారో ఏమిచేసుకుంటారో! ఐదారు నెలల క్రితంవరకూ ఉండేవి నావద్ద. 'శ్రీనాథుడు-శృంగారి' అని ఒక పుస్తకం ప్రకటించాను ఈమధ్య. అప్పుడు వాటి అవసరం నాకు మరీ అనిపించింది. శృంగార శ్రీనాథంలో ఏనాడో వారు చారిత్రక సత్యాలను శోధించి శ్రీనాథుడు శృంగారి అని నిరూపించారు. ఎందరు కాదని ప్రతికూలవాదం చేసినా ఆ చారిత్రక సత్యం మారబోదు. అందుకే సందర్భం వస్తే ఆ సత్యాన్ని తిరిగి చాటడానికే నేనీ గ్రంథం రాశాను. (అని నాకో కాపీ బహూకరించారు. కృతజ్ఞతతో స్వీకరించి పత్రికలో రివ్యూచేయిస్తానన్నాను) "శాస్త్రిగారట్లా వ్రాసి శ్రీనాథునకేదో అగౌరవం కల్గించారనుకోడం వట్టి భ్రమ. శాస్త్రిగారికన్నా శ్రీనాథుని గౌరవించినవారు, శ్రీనాథుని సాహిత్యగౌరవాన్ని ఆవిష్కరించినవారు వేరొకరెవరట?" అన్నారు.

తర్వాత యోగం విషయం ప్రస్తావిస్తూ "శాస్త్రిగారు ప్రతిష్ఠకోసము, పదవులకోసము ఎన్నడూ ప్రాకులాడలేదు. యోగమార్గాన జీవితాన్నంతా పరోపకారార్థమే వ్యయించారు. నేను వారితో సన్నిహితంగా ఉండినా అప్పట్లో నాకు వారనుసరించిన యోగమార్గాన్ని అనుసరించే యోగం లేకపోయింది. ఆ ప్రాప్తం లేదంతే. మొన్నటివరకూ బాబా మార్గమూ నా విషయంలో అంతే. ఎవ్వరి కెప్పటికేది ప్రాప్తమో అది జరుగుతుంది." అంటూ దీపాలవారు మూడ్‌లోకి వెళ్లి 'నా కోరికమీద తమ చిన్ననాటి జీవిత విశేషాలను అనేకం చెప్పుకొచ్చారు. (వాటి విషయం మరో సందర్భంలో మనవి చేస్తాను). ముఖ్యంగా చాటుపద్యాల సేకరణ మీది అభిమానంతో ముడివడి సాగిన వారి సాహిత్యజీవితానికి, అప్పటి నెల్లూరి సాహిత్య వాతావరణానికి సంబంధించిన విశేషాలవి!

చాటుపద్య రత్నాకరం అచ్చువేసే సందర్భంలో వారు మద్రాసు వెళ్లడం, వావిళ్లవారితో పరిచయం, ప్రభాకరశాస్త్రిగారిని దర్శించడం ప్రస్తావిస్తూ "నేను ప్రభాకరశాస్త్రిగారి అనుయాయిని. ఆయనే నాకు ఆదర్శం. నాకు వారియెడ గురుభావం, ఆయనకు నాయెడ సోదరభావం. శాస్త్రిగారు తాళపత్ర గ్రంథా

లను సేకరించే సందర్భాలలో చాలాసార్లు నేనుకూడా వెంట ఉన్నాను. మడమలూరు వెళ్లినప్పుడే ఒకసారి చాటుపద్య మణిమంజరి సంతకంచేసి నాకు బహూకరించారు. అదే నేడు పోయింది. ఒకసారి తాళ పత్ర గ్రంథాలకోసం టూరు వచ్చినపుడు నెల్లూరులో ఆయలూరివారి సత్రంలో బస చేశారు. అమ్మగారు కూడా వచ్చారు అప్పుడు. ఆయన నాకు కబురు పంపించారు. "కొత్త ఆవకాయ జాడీనిండా ఉంది. అది అయిపోయేదాకా నువ్వూ ఇక్కడే భోజనానికి వస్తూ ఉండాలి" అని! కలుసుకోవడం నిజంగా ఆవకాయ కోసమా? అది వారి ప్రేమాభిమానాలకి సూచన. వారి సాంగత్యం వలన నేనెంతో ఉత్తేజాన్ని ప్రోత్సాహాన్ని పొందాను. ఒకసారి ఆ సత్రంలో ఉన్నప్పుడే అమ్మగారి చేతికి తేలు కుట్టింది. ఆమె చాలా బాధపడిపోతున్నారు. శాస్త్రి గారు ఆమెకు ఉపచారాలు చేస్తున్నా బాధ తగ్గడం లేదు. చివరికి విషం మీది కెక్కకుండా తన జంధెం ఆమె వేలికి చుట్టిపట్టుకున్నారు. ఆమె బాధతో ఊగిపోతుంటే ఈయనా బాధపడుతూ జంధెపు బంధం ఉండడం వలన ఆమె ఊగినప్పుడల్లా ఈయనా ఊగవలసి వచ్చింది. కొంతసేపు అయిన తర్వాత నేను— "అయ్యా! ఇంతకూ తేలుకుట్టింది మీకా? అమ్మగారికా?" అని అడిగేశాను. అమ్మగారికి అంతబాధలోను నవ్వు వచ్చేసింది. ఆయనా నవ్వేశారు." అని దీపాలవారు అప్పటి ఎనెక్డోటుని గుర్తుచేసుకున్నారు.

ఇతరుల బాధను చూచి తపించి వారి కాబాధ తగ్గాలనే ఆరాటంతో అసలు బాధపడే వారికన్నాకూడా ఎక్కువగా బాధపడి ఊగిపోయే పితృపాదుల చిత్త వృత్తి నిరూపణ కీ ఎపిసోడ్ ఒకచక్కని సంకేతం గదా అనిపించింది నాకు. ఆమాటే దీపాలవారితో అంటే వారూ సంపూర్ణంగా ఏకీభవిస్తూ ముందుకు సాగిపోయారు. "అది అంతే. నాకా చనువు స్వాతంత్ర్యం వారిదగ్గర ఉండేవి. వారికీ నేనంటే ఎంతో ప్రియం. నేను బాగా చదువుతానని నా చేత పద్యాలూ అవీ చదివించేవారు. ఒకసారి 'బహురత్నద్యుతి మేదురోదరదరీ' పద్యం చదివాను. ఆయన చాలా ఆనందం పొంది "పిచ్చయ్యశాస్త్రీ! నీవలె పద్యం చదివే నేర్పే నాకుంటే తెలుగు సాహిత్యలోకాన్ని ఊపిపారేసే వాణ్ణి కదూ!" అన్నారు. అందుకు నేను "అయ్యా! మీకున్న పాండిత్యమే నాకుంటే నేనూ ఆపని చేసి ఉండక పోదునా?" అన్నాను--నవ్వారు. వారెప్పుడూ ఎదుటివారిలోని గుణాన్ని గ్రహించి తగినవిధంగా ప్రోత్సహించేవారు. దీనికి మరోవృత్తాంతం చెబుతాను. ముక్త్యాలలో బ్రహ్మానందోత్సవాలు జరిగిన సందర్భంలో గొప్ప పండిత పరిషత్తు ఏర్పాటైంది. తెలుగుదేశంలోని పలువురు పండితులూ మేధావులూ అందరూ అప్పుడక్కడ సమావేశమైనారు. గురువులు వెంకటశాస్త్రులవారు కూడ వచ్చినారక్కడ—" అని దీపాల వారంటుండగా వారికి ఒక గ్రూఫ్‌ఫొటో (ఇదే సంచికలో మరొక పుటలో చూడగలరు) సన్నివేశాన్ని గుర్తుకితెచ్చి 'అప్పుడు తీసిందేనను కొంటాను—ఆ గ్రూపులో మీరూ ఉన్నారు నాయన గారి భుజంమీద చేయివేసుకుని అన్నాను. స్మృతికి తెచ్చుకుంటూ దీపాల వారందుకున్నారు.

"అందులో నేనూ ఉన్నానా! ఎప్పటి మాటోఅది. నేనప్పుడు నెల్లూర్లో కాదు, వినుకొండలో ఉండే వాణ్ణి. ఒకరోజు శాస్త్రిగారి వద్దనుంచి జాబువచ్చింది, నన్ను ప్రత్యేకంగా వెంటనే ముక్త్యాలకు బయలుదేరి రమ్మని ఆహ్వానిస్తూ. వారు రమ్మన్ననాటికి నేను ముక్త్యాల చేరవలెనంటే ఇంటినుండి ఒక అమావాస్యనాడు బయలుదేరవలసి ఉంటుంది. మా నాయనగారు 'అమావాస్యనా డెందుకు? తరువాత వెళ్లుదువుగానిలే' అన్నారు. కాని ఎట్లా? నా యిష్టం వచ్చినప్పుడు నేను వెళ్లడానికా ఆయన నన్ను పిలిచింది? అమావాస్య పొద్దులు చూచుకొని నేనిక్కడ బయలుదేరితే ఆయనక్కడ ఉండవద్దూ! కనుక ఈ అమావాస్య ప్రయాణపు పట్టింపులకన్నా వారుసంక

ల్పించినట్లు చేయడమే ఉచితమని తోచింది. అట్లానే చేశాను. నాడే బయలుదేరివెళ్లి నెలరోజు లక్కడ ముక్త్యాలలో గడిపాను. కవి పండిత పరిషత్తు గొప్పగా జరిగి ఘనంగా సన్మానాలూ అవీ జరిగాయి అప్పుడు. వచ్చిన పండితులందరికీ జరీపట్టుబట్టలు సూటపదహార్లు చదివించారు ముక్త్యాల జమీందారులు. అప్పట్లో సూటపదహార్లంటే చాలా పెద్ద సొమ్మే. ఆ సభల్లో ఒకనాడు జమీందారుగారు కోరికమీద శతావధాన విద్యను గూర్చిన ప్రసంగం ఏర్పాటైంది. ప్రభాకరశాస్త్రిలవారు ఆనాడు తామే ఆ ప్రసంగం చేసి ఉండవచ్చును. కాని ఆయన చేయక ఆ అవకాశం నాకిప్పించారు 'పిట్టకొంచెం కూత ఘనం' అని నన్ను పరిచయం చేస్తూ ప్రసంగించమన్నారు. శతావధాన కవిత్వం గురించి ఆనాడు ఒక గంటసేపు పద్యాలు అవీ చదువుతూ ప్రసంగించాను. అందరూ సంతోషించారు. రాజావారు నా ప్రసంగం మెచ్చుకొని ప్రభాకరశాస్త్రిలవారితో అన్నారట 'మీ శిష్యుణ్ణి మా సంస్థానంలో ఉంచండి. విద్వత్కవిగా ఉంచుకొంటాం' అని! ఎందుకు చెబుతున్నానంటే- ఎవరుంటారు చెప్పండి అట్లా పిలిపించి అవకాశాలిప్పించి సన్మానాలందుకొనే సందర్భాలు కల్పించే ఔదార్యం ఎంతమంది కుంటుంది?" అంటూ ఉండగా మధ్యలో ఆపి వివరణకోసం సందర్భవశాన ఈ ప్రస్తావన తెచ్చాను.

"మా బాబాయి శంకరశాస్త్రిగారు అప్పటి యీ పండిత పరిషత్తును గురించి ముఖాముఖీ నాతో చాలా విషయాలు వివరించారు. అవి కొన్ని రేపుచేసి ఉంచాను. ఆయన చెప్పినదాంట్లో కపోత వృత్తాంత మొకటి. మీరు ఔదార్యమనగానే ఆ విషయంగుర్తుకి వచ్చింది. ముక్త్యాల రాజాగారు ఆసందర్భంలో ఏదైనా ఒక విషయాన్ని ఎన్నికచేసి అప్పటికప్పుడు కవితారచనలో పోటీపెట్టి ఒక లఘుకృతిని వ్రాయించాలని కోరారట. అప్పుడు నాయనర్‌గారే రాజాగారి సమక్షంలో భారతంలోని కపోత వృత్తాంతాన్ని ఎన్నికచేసి ఆ పరిషత్తులో పాల్గొన్న కవిపండితుల కా పోటీని గురించి తెలిపారుట. నలుగురైదుగురు కవులు యత్నం చేశారట. అప్పుడు తానూ అక్కడే మా పినతండ్రిగారున్న ఇంటిపంచలో కూచుని ఇచ్చిన మూడుపుటల గడువు లోపల 'కపోతకథ' అనే లఘుకృతిని వ్రాశారట. తక్కినవారెవరో గుర్తులేక చెప్పలేదు కానీ, అప్పటి ఆ పోటీలో తన రచనను చేర్చుకోక తక్కిన నలుగురి రచనలను పరీక్షకులచేత పరిశీలింపించి ప్రకటితమైన బహుమతిని పిఠాపాటి చిదంబరశాస్త్రిగారి రచనకు కాబోలు ఇప్పించడం జరిగిందట. మరి మీరుకూడా అప్పుడక్కడున్నారు కాబట్టి అందులో మీరూ పాల్గొన్నారా? అప్పటి విషయాలేవైనా గుర్తున్నాయా?" అని అడిగాను. ఒక క్షణం గుర్తుకి తెచ్చుకుని "అవును-ఆమాట నిజమే. నేనప్పుడు ప్రయత్నించలేదు. ప్రభాకరశాస్త్రిగారి కపోతకథ అప్పుడు వ్రాసిందే. ఆయన ఒకరోజులో దానిని ముగించిన వైనం మాకు మర్నాడు వినిపించారు." అన్నారు. (ఆ పోటీలో పాల్గొన్న తక్కిన కవులను గూర్చిగాని వారి అప్పటిరచనలను గురించికాని వివరాలు తెలియరాలేదు). ప్రయత్నించిఉంటే దీపాలవారూ ఆనాడు ఆ లఘుకృతిని చెప్పి మెప్పు పొందగలిగేవారే. ఎందుకంటే అప్పటికింకా పిన్ననాడే "సిరిగుణ మెట్టిదో సుకవిశేఖరులార! యెరుంగ కుందురే" వగైరా పద్యాల్ని ఆశువుగా చెప్పిన వైనం ప్రసంగవశాన వారంతకుముందు తెలియజేశారు.* ఆతరువాత ఔదార్యం, ఆశుకవిత, అవధానవిద్య విషయాంతరాలై ప్రభాకరశాస్త్రిగారికి గురుపాదులకు సంబంధించిన మరొక వృత్తాంతం గుర్తుకితెచ్చుకున్నారు దీపాలవారు.

"చెళ్లపిళ్ల వారు పాండవోద్యోగ విజయాలు ఆరంభించి చెబుతున్నారట. ఒకనాడు ఒకఘట్టంలో ప్రభాకరశాస్త్రిగారే దగ్గరుండి వారు చెబుతున్న నాటకరచనని రాస్తున్నారట. గురువులవారు 'అదిగో

ద్వారక' అన్నారట-వీరు వ్రాశారు. 'ఆలమంద లవిగో' అన్నారు. అదీ అయింది. 'అందందు గోరాడు', 'అయ్యయేకోట,' 'అదేయగడ్త', 'అవెరధ్యల్', 'వారవేయాదవుల్' పద్యం ఇట్లా రెండు చరణాలకుపైగా సాగిందట. అప్పుడు ప్రభాకరశాస్త్రిగారు తలెత్తి 'అయ్యా! రచన కాస్త వదులొదులుగా ఉంది. పద్యం కొంచెం బిగిస్తే బాగుంటుంది'. అన్నారట. 'అలాగా! అయితే చివర్న ముడేద్దాములే' అని వెంకటశాస్త్రిలవారు '...ఆలాన దంతావళాభ్యుదయంబై పరమందు రాంతర తురంగోచ్చండమై పర్వెడిన్' అని పద్యం ముగించారట. ఒక్క సమాసచాలనంతో ఆ పద్యాన్ని బిగించి ముగించిన చెళ్ళపిళ్ళవారి ఆశు కవితా ప్రతిభను ప్రశంసిస్తూ 'ఆయన చెబుతుండగా ఆ పద్యాలు రాసేభాగ్యం నాకు కలిగింది' అని ప్రభాకరశాస్త్రిగారు స్వయంగా నాకు చెప్పారు.' అని దీపాలవా రంటూండగా గంట పదకొండు కొట్టింది. నెల్లూరిలో ఆనాడు ఎండ మెండుగా ఉండింది. వారినప్పుడు అధికంగా శ్రమపెట్టడం ఇష్టంకాక కృతజ్ఞతలు చెప్పి నోట్సుకాగితాలు పదిల పరచుకుని 'మరోపర్యాయం కలుస్తా'నంటూ ఇంటికి తిరిగివచ్చేశాను. వచ్చేముందు వారిచ్చిన దీవెనలివి.

"పుత్రులుగా మీరు మీ కర్తవ్యం నిర్వహిస్తు న్నారు. 'మణిమంజరి' మూలంగా మీరు చేస్తున్న కృషి లోకోపకారకమైనది. దానిని మీరు నిర్వి ఘ్నంగా కొనసాగించండి."

అదే మా కర్తవ్యంగా భావిస్తున్నాము.

---

*ముఖాముఖి గుర్తుచేసుకొన్న విషయాలుగల ఈ వ్యాసాన్ని దీపాలవారికీ మోచర్లవారికీ పోస్టులో పంపించాను వారి ఆమోదాన్ని అర్థిస్తూ. వెంటనే బదుళ్ళు వచ్చినవి. మోచర్లవారు "ఇందు వెంట మీరు పంపిన ఇంటర్వ్యూ నేను చదివి మీకడకు పంపుచున్నాను. సరిగా నున్నది." అని వ్రాసిరి. దీపాలవా రిట్లు వ్రాసిరి.

"మీరు పంపిన 'ముఖాముఖి'వ్యాసము చేరినది. ఒకటికి రెండుమారులు చదివినాను. మీ వచన రచనలోని రుచి నన్నట్లు చదివించినది. విడివిడిగా అందందు విన్న వివిధ విషయములకు ఆనుపూర్వి నలవరిచి, ఆవిధముగా వ్యాసరచన సాగించుట అల తిపని కాదు. అదియొక కళ. ఆ కళలో మీరు సిద్ధహస్తులు.

మన ఆనాటి ప్రసంగములో ప్రసక్తము లయిన అన్ని యంశములును మీ వ్యాసములో చక్కగా పొందుపడియున్నవి. మరిరెండు విషయ ములు నా కిటీవల మనసుకు వచ్చినవి.

1. సారంగధరచరిత్రను పరిష్కరించునపు డును, వ్యాఖ్యానించునపుడును నాకు గలిగిన యెన్నో సందేహములను తీర్చి, శ్రీ శాస్త్రిగారు నాకు చేసిన ఉపకారము-అంతా-ఇంతా కాదు. వారు నాకు నిత్యస్మరణీయులు.

2. ఒక పండితగోష్ఠిలో నా కవిత్వమును ప్రస్తావనకు తెచ్చి, "దీపి శాస్త్రికవిత దీపిజాస్తి" అని ప్రశంసించినారు. ఆ ప్రశంస, వారికి నా యెడగల వాత్సల్యాతిశయమునకు తార్కాణము, ఇతరుల గుణలేశములను కొండలుచేసి కొని యాడుట ఆ మృదుహృదయుని స్వభావము. ("దీపిశాస్త్రి కవిత దీపి జాస్తి" అనుటలో గల శబ్దాలంకారము గమనింప దగినది). ఈ రెండు విషయములను చేర్చి మీ వ్యాసమును యథాతథము గనే ముద్రణ కియ్య వచ్చుననినాయభిప్రాయము-"

(నెల్లూరు. 12-7-81)



# ఆస్థానకవికి అభినందనలు

- వేటూరి ప్రభాకరశాస్త్రి

[గురువర్యులు శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారికి ఆస్థానకవి సన్మానం జరిగినవేళ ప్రభాకరశాస్త్రిగారు విజయవాడలో వారిని దర్శించి అభినందనలందిస్తూ చెప్పిన పద్యాలివి–సం]

చ॥ తిరుపతి! నన్నుఁ గన్గొనఁగదే త్రిదివమ్మననుంటి, వేంకటే
శ్వర! సరిగద్దె నిల్పుకొని సల్పుదునిందు కవిత్వగోష్ఠి; నీ
ధర నటె నిల్పుకొమ్మ కవితాప్రభు పీఠిక నన్నుఁదోడుగా
తిరుపతి వేంకటేశ్వర సుధీప్రథయెందు నఖండమే కదా!

[ త్రిదివమున (మనోమయ కోశమున) నున్నవారు ఇహమున (అన్నమయ కోశమున) నున్నవారిని వారి మనోమయకోశముతో (సువర్లోకమున) గూడి వర్తింపవచ్చును. కావి ఊర్ధ్వలోక ప్రజ్ఞ లేనివారు మనోమయ కోశమున జరుగుదాని నిహమున సరిగా గుర్తింపలేరు. మనోమయ కోశస్థు లెడనెడ ఇహమునకు (ఉత్సవ, పర్వ, శుభాశుభ సందర్భములు వారి ప్రేమపాత్రులకు గల్గుచో) నల్పకాలము రా వీలుపడును. కాన యీ యుత్సవ సమయమున తి. శా. సన్నిధి సంభావ్యము. ]

ఉ॥ అంచిత కావ్యకల్పనల నంధ్ర సరస్వతిఁబూన్చి డెంద మ
ర్పించుట నెంచి మిమ్మ నలరించెను బూజల గుండెపైఁ బ్రతి
ష్ఠించుకొనెన్ మహాంధ్ర, మది చెల్లుచునుండఁగ నేఁడు రాచవా
రెంచుట సిద్ధ సాధనమ యిచ్చుట యిచ్చిన దిచ్చుటే సుఁడీ!

చ॥ "ఇనుబదియేండ్ల ప్రాయమున నేని వినోదము గొల్పునేమొ, నా
కెనుబదియేండ్ల ప్రాయమున నెందుల కియ్యది?" యందురే నిదే
మనవి! "ప్రజాప్రభుత్వ మటె మంచి స్వభాషల కేమిపెంచెఁ బే
క్కానుఁ"డను వారి కిప్పుడిదిగోనని చెప్పగఁ జూపఁ జొప్పడెన్.

కం॥ నిండారెఁ గీర్తి యెనుబది
కిండగ్గఱె వయసు, కలిమికిం గొదలే, దీ
పండంబాఱిన మాకవి
గండని, కీపస దనంబు కావలెనేమీ?

కం॥ నిసుగునకున్ నగలిడు టా
నిసుగునకుంగాదు మురియు నెయ్యుర కొఱకే
వెస మద్గురునకు గా దీ
పసదన మఖిలాంధ్ర భూసభాజనమునకే.

శా॥ సంతానమ్మున కప్పఁజెప్పి ముదిమిన్ సంసారభారమ్ము వి
శ్రాంతింజెందును నేర్పుగల్గు పిత, యాచందంబుగా నింక మీ
రంతేవాసులలోన నొక్కరుని దివ్య ప్రజ్ఞఁబాటించి మీ
సంతోషమ్ము వెలార్చి యీ సుకవితా స్థానమ్ము చూపింపరే!

కం॥ అంతేవాసి యనంగా
భ్రాంతి వలవ, దే, సుదూరవాసిని; గురుపా
దాంతేవాసులు, కృతి వి
క్రాంతులు పల్వురుగలర్ జగమ్మెఱుఁగుఁగదా!

ఉ॥ గెల్చితిరట్టె వైరులను, గీష్పతినాఁ గవితాసదస్సులన్
నిల్చితిరట్టె, సత్కృతుల నిల్పితిరట్టె, చిదగ్ని వేలిమిన్
మాల్చుఁ డహంత నీశ్వర సమర్పణగా, నిఁకమీద సద్గురూ!
తాల్చుఁగ నున్నజన్మమున దాని వికారము పోకదయ్యెడున్.

ఉ॥ వచ్చుచుఁబోవుచున్ విజయవాడను మద్గురుఁ జూచుచుండునన్
ముచ్చటనుందు నిందనుక, ముందెటులున్నదొ! యెట్టులుండినన్
బొచ్చెములేదు పక్వఫలముల్ తొడిమల్ విడవో యిహమ్ము వా
రిచ్చిన యీ కవీంద్రపద మీశ్వరునొద్దను సంక్రమించెడున్.

మ॥ దశలేడెన్మిది వెళ్లఁబుచ్చితిరి శబ్దబ్రహ్మనిష్ణాతులై
వశమందున్నవి జ్ఞానపుంగరణముల్ వాక్ప్రాణులున్ వీనితో
ప్రశమంపుందశ వెళ్లఁబుచ్చుఁడు పరబ్రహ్మను సంధాతలై
శిశువుంబోలె సుతల్ సుతుల్ స్నుషలు పోషింపన్ వినోదించుచున్.

[శ్రీచెళ్లపిళ్లవారు ఆస్థానకవి పురస్కృతిపడసిన తరువాత బెజవాడలో అతివైభవంగా వారికి సన్మానం జరిగింది. ఆ సందర్భంగా జరిగిన సన్మానసభలో ప్రభాకరశాస్త్రిగారు గురువర్యుల కవితాప్రతిభను ప్రస్తుతిస్తూ ప్రసంగించారు. ఆ ప్రసంగ పాఠానికిది వారు వ్రాసుకొన్న సూచిక — సం]

I. శాస్త్రిగారి అర్ధాంగి - తిరుపతిశాస్త్రిగారు - చిలకమర్తి - వడ్డాది - త్రిపురాన సూర్యప్రసాద రాయకవి - వ్యాసమూర్తి - రామకృష్ణకవులు - కొప్పరపు కవులు - వావిలికొలను - వీరేశలింగ, దాసు శ్రీరామ, రాయడుశాస్త్రి, శిష్టా నరసింహ, శ్రీపాద లక్ష్మీనరసింహశాస్త్రిగారు, కృష్ణారావు, కృష్ణాపత్రిక, కృష్ణానది, కృష్ణాజిల్లా- శ్రీ శాస్త్రి గారి కీర్తిపతాకను ఎగురవేసినపట్టు - తేటతేటగ మోహన శ్రీరాగ - ఇది మాదృశాంతేవాసి మండలంబుకు మోహన శ్రీరాగ - అప్పయదీక్షితులు - తావళం గండపెండేరాదులు ఎన్నడు తిందునో- ఎన్నడు విందునో....

II (1). పరతత్త్వ(ము) మీ యానందమయ సమయమున తన యానందమయ స్పర్శముతో మనల ననుగ్రహించుగాక!

(2.) ఏ పురుషోత్తముడు చర్మచక్షురగోచరుడై భారతదేశవాసులు, తద్వారా ప్రపంచవాసు లందరూ కూడా, అహింసా సత్యవ్రతములతో అనుభవించే అభ్యుదయముల నన్నింటిని తిలకిస్తూ పైనుండి, అంతరంగముననుండి- అంతర్బహిశ్చ-అన్నట్టు- ఆనంద పుష్పవృష్టిని ఆనందబాష్పవృష్టిని ప్రజలకు కలిగిస్తున్నాడో ఆయనను మరచిపోవడం మన ప్రాణశక్తిని మనం మరచిపోవడమే. నేటి యీ దేశకవులకు కవితా సింహాసన మివ్వడమనే అభ్యుదయము ఆ మహనీయుని దివ్యతపోఫలితమే. నేటి మినిష్టర్లు వగైరాలు.

3. కవితాసింహాసనం బెజవాడలో లభించడం ఒక విశేష విషయమే. మద్రాసు బొంబై వలె కేంద్రప్రభుత్వ నగరమైతే అరవలకు తిరిచి అయితే మనకు బెజవాడ కాక తప్పదు. ఇందుకు తార్కాణగా ముందు కవితాసింహాసన స్థాపన బెజవాడలో అయింది. కవయః క్రాంతదర్శినః అన్నారు. ఇందుకే కాబోలు మా శాస్త్రిగారు బెజవాడలో సుప్రతిష్ఠితులయి నెలకొన్నది. వ్యక్తావ్యక్తంగా వారికి అందీఅందకుండా ఈ భావం లోలోపొటమరించి వారి నివాసానికి తెచ్చినట్లుంది. రాజమండ్రి తక్కువ ఊరా! గోదావరి తక్కువైనదా! శాస్త్రిగారు బెజవాడ రావడమేమి? కృష్ణాపత్రిక, కృష్ణారావు, కృష్ణాజిల్లా - మా శాస్త్రిగారికి విజయపతాకా ప్రతిష్ఠాపన స్థానాలు - మరి మున్నూరేండ్లకు ముందు అప్పయదీక్షితులవారు. మా శాస్త్రిగారు రుద్రాక్ష తావళం వేసుకుకూర్చుంటే ఆయన జ్ఞాపకానికి వస్తాడు.

III (1) శాస్త్రాణాం విషయస్తావత్ యావన్మంద రసానరాః। రసాస్వాదే ప్రవృత్తేతు నచశాస్త్రం నచ క్రమః॥ వాత్స్యాయనీయే.

(2) టాగోరు 82 సం॥ కాబోలు జీవించెను. సహస్రమాస జీవి (సదాభిషేక).

(3) అప్పయదీక్షితులు - చిదంబర మిదం పురం.

(4) మేము (శివరామాదులు) చదివినన్ని గ్రంథములు వారు చదువలేదు. ఇది మాకు ఘనత గాదు, వారికి లాఘవముగాదు. ప్రత్యుత మాకే లాఘవము. వారికే ఘనత, గౌరవమును. ఏలంటే, ప్రాచీన గ్రంథాలే చదివితే అవే చదివినవే తెలియ

కుండా తలుచుగా దొర్లుతూఉంటై. మా శాస్త్రిలు గారు భాషావిషయంలోగానీ, భావకల్పనా విషయంలోగానీ గాలిలోనుంచే సమకాలపు మానవుల నోళ్ళనుండే భాషను ఇతివృత్తములను సంపాదించడానికి ప్రాచీన గ్రంథాలను చదవకపోవడం ఉపకరించింది. మాకు అపకరించింది. అయితే శాస్త్రిలుగారి మహిమ ప్రస్తరించి ఇందులో కొందరైనా వ్రేళ్ళలెక్కవారిని తనవంటివార్నిగా చేసుకొంది. ఆ పేర్లు పేర్కొడమెందుకు? మీకు ప్రత్యక్షంగానే ఉన్నవి.

(5) స్పర్థ కట్టిపెట్టండి అని కోరితిని. దానికి వారు చెప్పిన బదులు.

(6) నాకు చాలా జాలి. ఎందుకంటే నలబైయేండ్లకు పూర్వపు వెంకటశాస్త్రిగారిని బాగా ఎఱుగున్నవారు చాలామంది ఉండరేమోకదా అని!

(7) వెంకటశాస్త్రిగారి శిష్యుడయి పనికిమాలినవాడనిపించుకొన్న వాడెవ్వడూ లేడు. అలాగే సుసర్ల దక్షిణామూర్తిశాస్త్రిగారూను.

(8) అట్టివాణ్ణి నేనే.



---

గీ॥ పాప సంకల్పములనెల్ల భస్మపఱిచి
శుభ సమృద్ధి గల్పించి విశుద్ధమైన
పదముపయిగోర్కె నెదలోన గుదురుకొలిపి
నన్నుగాపాడుమో గురునాథమూర్తి!

కం॥ తలపులు విశుద్ధములుగా
తలపింపుము పలుకు లమృత ధారలనంగా
పలికింపుము కార్యమ్ముల
సలిపింపుము పరహిత ప్రశస్తమ్ములుగాన్.

వే. ప్ర.

---

# లేఖలు - గురుశిష్య న్యాయ నిర్మాణం

- డా॥ వేటూరి ఆనందమూర్తి

పితృపాదులు ప్రభాకర శాస్త్రిగారూ, వారి గురుపాదులు శతావధానిశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారూ పరస్పరము పెద్దపెద్ద ఉత్తరాలే ఎన్నో సందర్భాలలో వ్రాసుకుంటూ ఉండినట్లు తెలుస్తుంది. కాని ఈ క్రింద ప్రకటిస్తున్న నాలుగైదు లేఖలు తప్పించి తక్కినవేవీ మావద్ద నేడు లేవు. అవి ఏమైనవో! ఇరవయ్యో శతాబ్ది తొలి దశకంలో విశేషంగా ప్రజల దృష్టి నాకర్షించినట్టి అవధాన విద్యకి సంబంధించిన అట్టి సాహిత్య లేఖలు కొన్ని మాత్రమే "గీరతము" "గుంటూరు సీమ" మొదలైన గ్రంథాలలోనూ, అప్పటి తెలుగు దేశపు పత్రికల్లోనూ అచ్చుపడి కానవస్తున్నవి. తక్కిన వెన్ని రూపుమాసి పోయినవో!

[illegible]

[illegible]

1 3-7-49

(చివరి రోజుల్లో చెళ్లపిళ్లవారి దస్తూరీ తెలియడాని కీ లేఖ చూడదగును. చూ. పుట 142)

"అచ్చానేక మహర్షి నిర్మిత మహార్హాచార నిర్మాణముల్", అని పితృపాదుల చేత కీర్తింప బడిన ఆ 'గురుశిష్య న్యాయ' నిర్మాణాన్ని నేటి కాలమున 'మూలోచ్ఛేదము' కాకుండ కాపాడు కోవడానికి యత్నించిన సమదృష్టి వీరిది. దానిని కలకాలం అట్లే కొనసాగించి కాపాడుకొనవలసిన కర్తవ్యం మనది.

"వేయేల నాయందు నీకు వుండుకున్న భక్తి ప్రపత్తులకు మంచి తరుణం తటస్థించినది." అని శతావధాని అంతేవాసికి వ్రాసిన పంక్తుల్లో (చూ. పుట 146) అట్టి 'మహర్షి నిర్మిత మహార్హాచార నిర్మాణమే' ధ్వనిస్తోంది.

ఈ లేఖలు గురు శిష్యులిరువురి జీవితాల్లోను (దాదాపు చివరి దశల్లో) సాగిన హృదయ సంవాద రీతిని వెల్లడిస్తున్నవి. ఇవి వట్టి లేఖలు కావు. జన్మ జన్మల సంస్కార రేఖలు.

ఈ పట్టున వీటితోపాటు గురుశిష్య న్యాయాన్ని విస్తరించే పితృపాదుల అముద్రిత రచనలు మరి కొన్నింటిని కూడా జతచేస్తున్నాను. వ్యాఖ్యాన మెందుకు? ఇక చదవండి.

శ్రీమత్పర దేవతాయైనమః

శ్రీరస్తు

చి॥ వేటూరి ప్రభాకరశాస్త్రికి

24-3-44
క్షీరసాగర బిల్డింగ్సు,
గవర్నరుపేట, బెజవాడ.

ఆశీరుభయకుశలోపరి నే నిక్కడనే నియతంగా నున్నాను. ఇది యేదో చిత్రమైన సమస్య. నా జీవితంలో నేను జవాబు చెప్పలేని దిదియే. శా॥ ఏదో వ్యాజమొకండు కారణముగా నీవే నిరూపించి నన్। గోదాతీర నివాసి( బిల్చితివి నీ గోత్రం బిటంబొల్చు(ద్వ। త్పాద ద్వంద్వ రజః పవిత్రితము క్షేత్రంబిద్ది నాకే యమ ।ర్యాదల్ పో(కక యుండ(జూడుమనుచుం బ్రార్థింతు( గామేశ్వరీ[1] ॥౪౪॥

శా॥ ఎన్నాళ్లీగతి నన్ను మన్చెదవు తల్లీ! నీదు క్షేత్రమ్మునం। దున్నన్నీదగు దర్శనమ్మునకు రానోపంగ శక్తుండ(గా। నెన్నండున్ దరినున్న కృష్ణదరికే నేగంగ లేనైతి నీ। నన్నున్నిల్పెడి నీ కృపారసము వర్ణ్యం బంబ! కామేశ్వరీ॥౪౫॥. ఆ యీ పద్యద్వయంవల్ల నా ప్రకృత స్థితిగతులు నీకు తెల్లమే. ఇక నొకటి. వోరంగలు ప్రాంతవాసి యొక యువకవి అమాత్యవంశ్యు(డు రెండేళ్ళ దాదాపునుండి నా మీసముల పద్యము[2] కీ॥శే॥లైన పోతనాదులకు అవమానకరమని యేమేమో నన్ను మాత్రమేకాక (వైదికుడను హేతువున)[3] నన్నయ్యనుగూడ నడ్డమైన చెడుమాటలతో దూఱుచు పెద్ద చాటభారతపు టుత్తరములు వ్రాయుచున్నాడు. మొదట 32 అఱటావుల యుత్తరం వ్రాసి మరల నేమితోచెనో అయిదాఱునెల లూరకుండి మా గ్రామమునకువచ్చి పశ్చాత్తాపముతో క్షమాపణ చెప్పెను. మరల కొన్నాళ్లు పూరుకొని పోతన్న తన్ను ప్రేరేపుచున్నాడని, మరల కొలదిరోజులు మాత్రమే జవాబుకు వాయిదాలువేస్తూ రిజిష్టర్లకు మొదలిడెయె. ఇప్పుడు భావార్ణవ[4] మను పేరుతో అవాకుచవాకులతో నొక పొత్తము 100 పుటలు ప్రచురించెను. అందులో శివరామశాస్త్రిని, నిన్ను,

విశ్వనాథ సత్యనారాయణను, రామస్వామిచౌదరిని, పింగళిని, కాటూరును, ఇంకా నాతో సంబంధమున్న సర్వులను పడదిట్టెను. వైదికులు పాచకులు వీళ్ళు కవులుగా నుండదగదు-"ఆంధ్రభారతి మాయింటి యాఁడుబిడ్డ"[5] అంటూ యేమేమో తిట్టును. నేనేమియు జవాబీయలేదు. పైగా సర్టిఫికెట్టు కూడా (నీవు నన్ను తిట్టినను కవిత్వం తన్మయంగా చెపుతావు అని) యిచ్చాను. ఈయిచ్చుట మావూరు వచ్చినపుడు జరిగినది. బహుశః నీకొక పుస్తకం పంపే యుండు"ననుకొందును,నీ వెఱుగుదువో లేదో యని తెల్పితిని గాని అన్యంకాదు. మీసాల పద్యం గ్రంథము నుండి తొలగించ వలసినదని యీతని కోరిక – యీవత్తూ దాన్ని పురస్కరించుకొని యుండును. కొప్పరపువారి[6] సభఃకరించి రనిన్నీ వారు చాలా గొప్పవా రనిన్నీ కొంత వ్రాయును. నన్నయ భారత భాగం కూడా భారతము నుండి తొలగించాలనిన్నీ ఆ రోజులలో తానే వుంటే ఆ పని చేసేవాడ ననిన్నీ కొంత వ్రాయును. వైదికులు తెలుగు కవిత్వం చెప్పనే రాదని ఆతని ముఖ్యాశయము. శ్రీ అప్పారావుగారికి[7] ఆ యీ విచిత్రాశయములు వినిపింపుము. అమాత్యు లందఱు తనకి తోడు కావలసిందని యొక కోరిక. పింగళి, కాటూరులు అక్బరుకు మానసింగువలె నాకు తోడ్పడి కుల గౌరవానికి భంగం కల్గించిరని కొంత వారలను దూషించెను. నేనే ఉపేక్షించిన విషయంలో నీవు కల్గించుకొంటావని తెల్పలేదు. ఊరక తెల్పితిని.[8] ఇక మఱియొక సంగతి. ఈ యుత్తరం నీ వద్దకు తెచ్చిన యతని తండ్రి నా వద్ద చదివిన శిష్యుడు. పైఁగా భార్యాతరపు చుట్టం కూడాను. ఇతనికి వీలైనంతలో నీ చేతనైన సహాయం చేయుదువు గాక. నా ఆరోగ్యం విషయం. నాకేదో పిచ్చియెత్తినట్లుండును. అలా వుండుట ఉదయం మొదలు 12 రమారమి వఱకే. నల్లమందు వేసుకొని చల్లతో నూకల జావ పుచ్చుకొన్న పిమ్మట పరుండి కవితా రచనాదులు సాగించే వాడను. ఇపుడా శక్తి తగ్గినది. దీనికి నీ వక్కడ నుండి చేసే సాయమున్నచో చేయుదువుగాక[9]. ఆయుర్బల మాత్రంతో నున్నాను. గ్రహింపుము.

వెం॥శా॥ శతావధాని

[లేఖాంతమున ఈ క్రింది అంశమును జతచేసిరి]

సీ॥ పరదేశములు దివ్యతర దేశములుగాఁగ....
పరులు కష్టసుఖమ్ము లరయువారలుగాఁగ
పరసజ్జనావళుల్ పరమబంధులు గాఁగ....

ఆ యీ పద్యార్థము నాయెడ ననువర్తించు చున్నది. ఇప్పటికి భగవతి యితరాపేక్ష లేకుండ ననుగ్రహించు చున్నది. గదిలో మాత్రమే. అంతకన్న నితరత్ర సంచారం తగ్గించి చాలరోజులైనదని నీ వెఱిగినదే- ఈ క్షేత్రమున నున్నాను.

వెం॥ శా॥

శ్రీ మత్సర దేవతాయై నమః

శ్రీరస్తు

క్షీరసాగరం బిల్డింగ్సు
గవర్నరుపేట, బెజవాడ కృ॥జి॥
8-4-44.

చి॥ వేటూరి ప్రభాకరశాస్త్రికి–
ఆశీఃకుశలోపరి

ఆమధ్య నీకేదో వ్రాసినట్లు జ్ఞాపకం. దానిలోనే మీసాల పద్యానికి సంబంధించిన ప్రతి పక్షుల దూషణ (నన్ను మాత్రమేకాదు నావిద్యాకుటుంబాన్ని యావత్తూ) ను గూర్చి తెలిపినట్లు జ్ఞాపకం. నేను సంవత్సరన్నర నుండి యిక్కడనే ఆగినాను — దీనికి అర్థం లేదు.

శా॥ ఏదోవ్యాజ మొకండు కారణముగా నీవే నిరూపించి నన్
గోదాతీర నివాసిఁబిల్చితివి నీ గోత్రం బిటం బొల్చుఁ ద్వ
త్పాదాంభోజరజః పవిత్రితము క్షేత్రం బిద్ది నాకే యమ
ర్యాదల్ శోఁకక యుండఁజూడు మనుచుం బ్రార్థింతుఁ గామేశ్వరీ॥ ఇట్లు॥[10]

జాతకమునకు సన్న్యాసయోగం కలదు. కాని గురు చండాల యోగమున్నది. అందుచే సిద్ధింపలేదు. ఈ విధంగా పరిణమించినట్లు తేలింది. నాకిప్పుడు మానసిక వ్యాధిగలదు. దానికి నీ వక్కడ నుండియే చేయదగు నుపకారమున్నచో చేయ గోరెదను. వెనుక నీవట్లు చేసినట్లు చెప్పితివి. కాన వ్రాసితిని. తత్తదాస్తామ్. ఈ యుత్తరము నీ యొద్దకు తెచ్చిన శాస్త్రిలుగారిని నీ వెఱుగుదువు. వీరిని సత్కరింప గోరినాను.

గ్రహింపుము
వెం॥శా॥ శతావధాని.

 

## C. V. V.

తిరుపతి
19-8-44

శ్రీగురుచరణులకు

వందనములు—ఉభయకుశలోపరి. నిన్ననే 'కవిత్వమూ బ్రాహ్మణత్వమూ' అన్న మీ పుక్కిటి పురాణం చదివి చదివి పొట్ట పగిలేటట్టు నవ్వుకొన్నాను. మీ యారోగ్యం చాలా చక్కబడినదనే అనుకొంటున్నాను. ముప్పైయేళ్ళనాటి మీ ఉపన్యాసాల ధోరణి ఈవ్రాతలో ఉన్నది. మీరు ముప్పైయో నలభైయో యేళ్లు పూర్వానికి వెళ్లినట్టున్నారు మీ యీ వ్రాత తీరునుబట్టి చూస్తే. నాతో మాటయిచ్చినట్టు ఉదయం సాయంకాలం చేయడం మానివేయలేదు గదా?[11] నాకు మాటయిచ్చినది విడువ వలదని ప్రార్థన. మంచి ప్రశాంతి దొరకుతుంది దానివల్ల మీకు. అసలు విషయం. అప్పకవి వ్రాసినదాని గూర్చి మంచిది వెల్లడించదగినది చాలా ఉన్నది. తీరిక చేసుకొని ఎప్పుడైనా వ్రాస్తాను. నీకు తీరికేలేదా అంటారు మీరు నిజముగా తీరికలేదు. మీ దస్తూరీతో మీ యారోగ్యవార్త వినగోరు

తున్నాను. శ్రీ గురుదేవుల దివ్యానుగ్రహమున అందరం క్షేమము. మీ స్కాంద ముద్రణం సాగుతున్నదా? చిత్తగింపుడు.

అంతేవాసి

వే. ప్రభాకరుడు.

కార్డు మీది చిరునామా :

శ్రీ శతావధాని

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు

క్షీరసాగరపు కొట్టలో

గవర్నరు పేట, బెజవాడ.

[ POST CARD ]

9 Ps.

*    *

క్షే మ ం

శ్రీరస్తు

చి॥ వేటూరి ప్రభాకరశాస్త్రికి

క్షీరసాగరం

గవర్నర్పేట

బెజవాడ కృ॥ జి॥

8-9-49

ఆశీరుభయ కుశలోపరి - నీ ఇన్స్యూరు లేఖ 30 (సూత్ర ప్రాయం) యును చేరినవి. సంతసించి ఆశీర్వదించు చున్నాను. సభను గూర్చి[12] నేను యెవరినిగాని అనుత్సాహ పఱచను. నా యావచ్ఛక్తిని వినియోగింతును, పరమేశ్వరిని యాచించు చున్నాను. వృథా కాదు. ఈ నాకు సర్వమ్ము నీ ।బలమే కారణమై ఘటించె జననీ! ప్రార్థింతు నీరీతిగా - కలకాలమ్మును....కామేశ్వరీ॥ నేఁటికి సుమారు 50 యేళ్లనాటి ప్రార్థన! యిఁక నేఁడు - మ॥ ఫలితంబైన శిరమ్ముతో దళితమౌ వక్త్రిమ్ముతో చాల దుర్బలమౌ మేను చలింప నేను సభలో పన్నుండి కార్యక్రమం । బెలమిం జూచుటకేని శక్తినిడుమో యీశాని నా లంఘనంబులు మన్గుడ్పులు నీకు క్రొత్తలే; యథా పూర్వంబ కామే॥౨౩౭॥ శా॥ కౌపీనమ్ము ధరించి ఆ సభకు నేగ న్నన్ను వీక్షించి, "ఓహో! పాఱుండిటు మాఱెనే! వయసుచే నొండొక్కరుండయ్యె వా। గ్వ్యాపారమ్మును మాఱి తీరుననుచున్ గారుణ్య మొప్పారనా। వైపే చూతురు పంపుమమ్మ! సభకున్ వందింతు కామే॥ (వది అభివాదన స్తుత్యోః) శా॥ చెన్న శ్రీపురమందయుండి ధరకున్ శ్రేయంబు గల్గించు సం।పన్నుల్ గేస్తులు పండితుల్ కవులు సామ్రాజ్యమ్ము సర్వమ్మనాఁ। డన్నన్ శ్రీ బెజవాడనుండు భవదీయాద్రీశ్వరోపత్య క న్నన్నున్ జూడఁగ వత్తు రెందఱొ జనుల్ నాతల్లి కామే॥ ౨౩౮॥ శా॥ ఆయుర్దాయము మూడు భాగములు సేయన్ (గ్రహాయువు 120) దాన వస్థర్దు బో। సేయంగా (అనుభవించుటకుఁగా) మిగిలెన్ (40) శరీరము కడున్ జీర్ణించి శుష్కించె శే।షాయుర్దాయము భుక్తమౌట కడుగడ్డై తోఁచు (నెల

క్రిందట యెనుబది ప్రవేశించింది. 120లో 80 పోతే యిక నలభై భుక్తం కావాలన్నమాట) త్వత్సన్నిధి స్థాయింగా నొనరింపు మేటికి నిఁకన్ జాలంబు కామే॥ యిది యిప్పుడు నడుస్తున్న రచన - మణి ద్వీపంలో శ్రీదేవి సభలో నాకు కవుల స్థానం కల్పించవలసినదని నేను జగదీశ్వరిని కోరుటకలదు. ఆ ఘట్టంలోదే యింకొకటి - మ॥ కవి మాత్రుండనుగాను శాబ్దికుఁడ వ్యాఖ్యాతన్ మహా భాష్య ప। ర్యవసానంబు పఠించి నట్టిఁడ విమర్శ గ్రామణి నీన్నీ సభా। భవనస్థుల్ కవు లొప్పి కొన్నయెడ సంభావింపుమో తల్లి యో।శివ సంధాయిని యింత కొండు వరముంజేకోను కామే॥

స్వస్తి

వెం॥ శా॥ శతావధాని.

శ్రీరస్తు చిరంజీవి
వేటూరి ప్రభాకరశాస్త్రి
పండితుడు - సంస్కృత కాలేజీ.
తిరుపతి (పోస్టు)

[ POST CARD ]
9 Ps

*　　　　*

శ్రీమత్పరదేవతాయై

శ్రీరస్తు. చిరంజీవి-వేటూరి ప్రభాకరశాస్త్రికి—

ఆశీఃకుశలోపరి—

ఇపుడు నీ పేర ముఖ్యంగా వ్రాశేదేమనగా? చి॥ తాడేపల్లి సాంబశివ(మూర్తి)శాస్త్రి (త్రిలింగ సంస్కృత కళాశాల ప్రినిసిపాలు) గారిని నీ వెఱిగియే యుందువు. ఆయన సుమారు వత్సరము నుండి, నంజు ప్లీహ అను రెండు జబ్బులతో చిక్కుపడుచున్నారు. శ్రీయుతులు చుండూరి రెడ్డిగారు యెంతచేయవలెనో అంతయుచేసి విసిగి వేసారినారు. కాని యింతవఱకు గుణం కనిపించలేదు. ఆయుర్వేద, ఆంగ్ల. యూనాని వైద్యములకు యెంత ఖర్చుపెట్టవలెనో అంతయు పెట్టినారు. పలువురు డాక్టరులే నీ పేరు చెప్పినారట. నాద్వారా తప్ప నీ ట్రీటుమెంటు (నీ వలన జరిగేది) సాధ్యం కాదని (నిస్పృహస్య తృణం జగత్) తలచి యిప్పుడే (8 గం॥లు రాత్రి) వచ్చినారు. నాకేమీ తోచక దీనిని వ్రాసినాను.

"ప్రాణదానంబు కన్నను వ్రతము కలదె యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార" తొందరలో త్వరలో ముగించాను. డేంజరుగా నుండుటచే నేదో వ్రాసినాను. కర్తవ్యం నీవే నిర్ణయింపవలెను. నీ వాకపరి చూచి అక్కడ నుండు మనెదవో, యిక్కడనుండి కూడ వైద్యాన్ని పుచ్చుకొనిన పని చేయునందువో, నాకు తెలియదు. నేనెన్నడును యిట్టి సిఫారసు నీకు చేయలేదు. భవిష్యత్తులో

కూడా చేస్తానని తోచదు. వేయేల నాయందు నీకు వుండుకున్న భక్తి ప్రపత్తులకు మంచి తరుణం తటస్థించినది.[13] వీలున్నచో ఉపేక్షింపవనే ధైర్యంతో వ్రాసే వోపిక లేకయు దీనిని వ్రాసినాను—నా వోపిక సామాన్యముగా నున్నది-యీయనకు ఉపకరించుట నాకుపకరించుటయే-స్వస్తి-

వెం॥ శా॥ శతావధాని
13-9-49. క్షీరసాగరం
బెజవాడ.

---

పాదసూచికలు :—

1 చెళ్లపిళ్ల వారు 'కామేశ్వరీ' మకుటంతో వేల కొలది పద్యాలు చెప్పి ఎప్పటికప్పుడు తమ జీవి తాన్ని దేవికి నివేదిస్తూ వచ్చారు. తమ ముప్పది సంవత్సరముల ప్రాయమున ఆరంభించిన ఈ శతక రచనను చివరి క్షణం వరకు కొన సాగిస్తూనే ఉండినారు. వారే ఇట్లు వ్రాసికొన్నారు. "నేనెప్పుడైన నేమి 'కామేశ్వరీ' అనెడి మకుటముతో నిప్పటికి సుమారు 15 వందల పద్యాల వఱకు వ్రాసియున్నాడను. అందు మొట్టమొదటిది, కామే శ్వరీ శతకము. ఇది ముప్పది సంవత్సరముల ప్రాయ ములో రచించితిని."- సౌభాగ్యకామేశ్వరీ స్తవము (1941). "కామేశ్వరీ అను మకుటముతో వందలే కాదు వేల పద్యములు వ్రాసితిని. 'కలౌషష్టి' అను వయస్సు దాటిన పిమ్మట నామకుటము సౌభాగ్య పదమును జేర్చుకొన్నది" - సౌభాగ్య కామేశ్వరీ (1943).

లేఖల్లో ఈ పద్యముల ప్రక్కన పద్యసంఖ్యల్ని పేర్కొనడం గుర్తింపదగిన విశేషం.

2. ఆ మీసాల పద్యమిది (చూ. నానారాజసందర్శనము పు. 43, 1908)

"దోసమటంచెరెంగియును దుందుడుకొప్పగఁ
బెంచినార మీ
మీసము రెండు భాషలకు మేమె కవీంద్రులమంచుఁ
దెల్పఁగా
రోసము కల్గినన్ గవివరుల్ మము గెల్వఁడు గెల్చి
రేని యీ
మీసము దీసి మీ పద సమీపములన్ దలలుంచి
మ్రొక్కమే."

సంస్కృతాంధ్రాల్లో తామే తప్ప తమ్మెదిరించే వాళ్లు లేరన్న ధీమాతో చెప్పుకొన్న ఈ మీసాల పద్యం వారికి లోకంమెప్పు లందించినా తర్వాత కొన్ని తంటాలనూ కొనితెచ్చింది. 'తెలుఁగు మీసంబు నిలుపంగఁ దివురుఁడింక' అని కొప్పరపు కవులు సవాళ్లు పలికినపుడు 'మా మీసపు పద్యార్థము మీకు తెలియదు. అది మిమ్ములగూర్చి చెప్పినది కాదు' అంటూ తిరుపతిశాస్త్రిగారు బదులు పలుక వలసి వచ్చింది. వివరాలకు 1911 కృష్ణాపత్రికల్ని తిరగేయవచ్చు. (చూ. 'గుంటూరిసీమ' లేదా నిడుదవోలు వెంకటరావుగారి "కొప్పరపు సోదరకవుల చరిత్ర.")

3. అవధానవిద్య ఆంధ్రదేశాన్ని ఉఱ్ఱూతలూ గించిన ఆ నాళ్లల్లోనే ఆ ఆశుకవుల కవితా స్పర్ధలు కూడా రచ్చకెక్కినవి. (1911 ప్రాంతాలు) క్రమంగా ఆ స్పర్ధలు పొగలు సెగలు చిమ్ముతూ తెగల మీదుగా తిరిగినవి. మన కవితా చరిత్రలోను, సాంఘిక చరిత్రలోను అది ఒక దశ. అప్పట్లో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, తల్లాప్రగడ సూర్య నారాయణరావుగారు మొదలైనవారు కలుగజేసుకొని

అర్థిస్తే ఆ వివాదం కాస్త అణగారింది. సెగలు తగ్గినా పొగలింకా పోలేదన్న సూచనని ఇందులోని కుండలీకరణాలలో మనం గుర్తించవచ్చు.

4. 'భావార్ణవం' అనే ఈ కృతిని చెప్పిన "వొరంగలు ప్రాంతవాసి, యువకవి, అమాత్య వంశ్యుడు" నెల్లుట్ల రామకృష్ణామాత్యుడు. భావావేశమున తిక్కన పోతనాది కవులు తన్నావేశించి పలికినట్లుగా ధట్టించిచెప్పినకవిత యీయనది. 'ఎంత జేసితి మాకోసమీ వమాత్య' అని గతించిన కొప్పరపుకవు లన్నట్లుగా భావించి వారి పక్షము వహించి చెళ్లపిళ్ల వారిపై కత్తిగట్టినట్టుగా కలం పట్టిన కవి యితడు. చిన్న వయసుననే కీర్తిశేషుడైనాడు.

5. "ఇంక నీకైత మావాని నెదరియాడఁ
దమను పుట్టించు బ్రహ్మకుఁ దరముకాదు
పంచెమొడ్డి వచింతు సభంబుఁ బగుల
నాంధ్రభారతి మా యింటి యాడుబిడ్డ.

ఆంధ్రభాషయనిన నరయరదేమొకో
యది నియోగివలన నలరు నంట
ఇల నియోగి యనిన నెఱుఁగలే దేమొకో
ఆంధ్రభాషయనఁగ నతఁడె యంట॥"

భావార్ణవము.

6. పాతసంగతులు గుర్తు చేసుకోడానికి ఇక్కడ కొంత వివరణ అవసరం. కొప్పరపు సోదరకవులు చెన్నపురిలో విజయధ్వజ మెత్తి అవధాన విద్యను ప్రదర్శించినపుడు పలువురి ప్రశంసలందుకొన్నారు. అప్పటి ఆ ప్రశంస లన్నింటిలోకి ప్రభాకరశాస్త్రి గారు చేసిన ప్రశంసకి ఒక ప్రత్యేకత ఉంది. చెన్నపురిలో కొప్పరపువారి ఆశుకవితావధానాది ప్రదర్శనలు తిలకించి విద్వత్సభాముఖాన 'ఆశుకవితోద్యద్రాజ్య పట్టాభిషేకము నందందగినట్టి దిట్టలు'కొప్పరపు కవులని సంభావిస్తూ వారు ఇట్లు వ్రాశారు.

'నాల్కతుద న్నిరంతరము నాట్యము సల్పుట కీ సహోదరుల్
పల్కువెలంది నెట్లు తొలిబాముమన గొల్చిరొ తేట తేనియల్
చిల్కనయట్లు విందొనఁగుఁ జెప్పిన పద్యములెల్ల వహ్వరే
పల్కిన పల్కులన్నియును బద్యము లయ్యెడు నేమి చెప్పుదున్'

ఈ ప్రశంసా పద్యాల్ని ప్రభాకరశాస్త్రిగారు తమ గురుపాదులు చెళ్ళపిళ్లవారి దృష్టికి తీసుకువచ్చారు. ఆ మీదట వారి ప్రశంసలను పురస్కరించుకొని తిరుపతి వెంకటకవులు కొప్పరపు సోదరకవులను అభినందిస్తూ ప్రశంసా నవరత్నాలను (1911 జనవరి 17, మంగళవారం శశిలేఖలో,- చూ. గుంటూరు సీమ పుట 5) ప్రకటించారు. అవి యివి,

'అయ్యా! కొప్పరపుంగవీశ్వరులు మీ యాస్యంబు మేమెప్పుడే
నొయ్యం జూడగలేదు; శిష్యుఁడొకఁ డోహో యంచు మెచ్చెన్మిమున్
వెయ్యార్లియ్యగ శక్తి లేదు కొనుఁడీ వెయ్యాఱులే యంచు మే
మియ్యం జూపిన పద్దెముల్, మనుఁడి మీరెచ్చో నిరాఘాటులై.

ఆరుదగు మీ కవిత్వ మని యా పుఁడు శిష్యుడునైన మా ప్రభా
కరము వచింపఁగా విని యఖండముదంబును బొందినాము బం
దరు దరికేగుదెంచి యును దామటకున్ జను దేర కుంట మీ
దరిసెన మబ్బదయ్యెఁ బరితాపకరంబిది మాకు నెంతయున్

సరిగశతావధానములు చక్కఁగ జేసెడివారు పూర్వమే
వరలిరి నేఁడు లేరనెడి వార్తలు కల్లలుదివ్యవాక్ఝురీ
భర పరిపూరితాద్భుత సభాసదలంకరణప్రచార సుం
దరతర భావభావుక కనద్భవదీయ వధాన సంపదన్.

చనెడి శతావధానమను జాహ్నవి సంద్రము నందు
డిందఁగా
నని జగమాడు నప్పలుకులన్నియు నేటి కబద్ధ
మయ్యెఁది
న్నని కవితాప్రవాహమున నాటక వేషములట్లుగాకమీ
రొనరుచు చున్న దివ్య కవితో దయమన్ ప్రహ్లాద
మద్దుపచ్చుటన్.

ఏమొక కొంతకాల మెదియేనొక తీరు శతావధాన
ముల్
గ్రామములందు 'బల్లెలను రాట్సభలన్
మరి రాజధానులన్
స్వామి కృపా విశేషమున సల్పిన వారము
సల్పుచుంటి మిం
కేమగునో మతేమికొాద వీరవధానులు నుద్భవించు
టన్.

బందరువచ్చి యచ్చటి సభాసదులన్ దనియించి
వారిచేఁ
జందనమో సుమంబొ మతిశక్తికి మించని దేనిగాని
మీ
రంది కృతార్థులన్ సలుపుఁ డయ్యమమున్ మిము
జూచు కోర్కె మా
డెందములందు మిక్కిలిఁ గడిందిగ నందడి చేసె
డిన్ జుఁడీ.

అనఘులు కూపకూర్మముల యట్టొక చోటనె ప్రమ
గ్గిమగ్గి నూ
తన మగు పాడుత్రోవ నవధానము మానము గంగ
గల్పి తా
రన్యతము నూఁతఁగా గొనెడి యర్భకపుంగవు లట్లు
గాక మీ
రొనరుచు మార్గముల్ మదికి హాయని మెచ్చొదఁ
గూర్చెనే జుఁడీ.

మీ నామంబులు మీ యవ
ధానము విని మాయకవులు తలలెత్తక లో
లోన నిఁక నేని సిగ్గును
బూని యొకట నుంద్రుగాత బొమ్మల పోల్కిన్.

శశిలేఖలోనఁ జదివితి
విశదంబయ్యెన్ భవత్ప్రవీణత మీకున్
యశమబ్బుఁగాత భగవ
ద్వశమై యాయువును సిరియు వరలెడిగాతన్

ఇట్లు
తిరుపతి వెంకటేశ్వర కవులు

వీటిని చూచుకొని ప్రశంసా పద్యాలతోనే కొప్పరపు కవులు వారికి ప్రత్యుత్తర మిచ్చారు. ఇవీ శశిలేఖలోనే 1911 ఫిబ్రవరి 1 బుధవారమున అచ్చయినవి. (చూ గుం. సీమ. పు. 10)

"తిరుపతి వేంకటేశ్వర సుధీశ్వరులార! మహేశ్వరీ
కృపా
భర పరిలబ్ధ భవ్యమతి వల్లభతానత సర్వసత్కవీ
శ్వర ధరణీశ్వరార్పిత లసద్రసవత్పదపద్యమండనా
దరణ గుణ ప్రభూత కవితా వనితా మహితానురాగ
సుం
దరతర మూర్తులార!.... ........ ... ........ ...... ....
భూసురో
త్కరమణులార! మిత్ర జనతామరసాకర మిత్రు
లార! సు
స్థిర పరమోపకార గుణ సింధువులార! విధేయు
లైన నో
దర కవులిచ్చు వందన శతంబులివే కరుణన్
గ్రహింపుఁడీ.

ప్రవిమల భవ్యసద్గుణ విభాసురుఁడైన ప్రభాకరాఖ్య
స
త్కవి వరుఁడెట్టొ యస్మదవధానము గన్గొని తెల్పి
నంతనే
సువిలసితాఖి లార్థ పదసుందర పద్యకదంబ కంబు
మా
కవునని మెచ్చిపంపిన దయాళులు మిమ్ము
నుతింప శక్యమే.

ఒరులన్మెచ్చినచోఁ దన
పరువు చెడునటంచు నెంచు పద్ధతి నీర్ష్యా
కరమగు నీ కలివేళన్
బరమామోదమిడె మీ స్వభావంబు భళీ.

సత్కవితా విలాసముపొసంగఁగ నీ మదరాసులో
సుధీ
రోత్కర మాదరింప నిపుడుండియు బందరు చేరి
మిమ్ము సం
పత్కరులం గనుంగొనెడు భాగ్యము గోరుచునుంటి
మింక వి
ద్వత్కవి వర్యులార! భగవంతుఁడు మాకట సంఘ
టించుతన్.

అరనిముసమైనఁ దీరిక
పొరయమిచే నిన్నినాళ్లు బోయెను బ్రత్యు
త్తరమున్ వ్రాయఁగఁ గావునఁ
గరుణ క్షమింపవలె నిది జగన్నుత చరితుల్.

ఇట్లు విధేయులు,
కొప్పరపు
వేంకటసుబ్బరాయఁడు, వేంకటరమణయ్య.

ఇట్లా ఆరంభమైన వీరి పరిచయాలు కాలవశాన ఒకదశలో సుళ్లుతిరిగి తెలుగుజాతినే కల వరపరచిన వేళ పలువురితోపాటు ప్రభాకరశాస్త్రి గారూ ప్రమేయం కల్పించుకొని ఆ కవిపుంగవు లను సమాధానపరుప జాలిన పరువుగల మాటలనే పలికిరిగాని విరుపుమాటల్ని విసరలేదు. "తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యులమంచు చాటి మా గురు వులు వారటంచు ననుకొన్న ప్రభాకరశాస్త్రి ముఖ్యులిప్పరుసున దుర్వివాదములపాలయి దుర్య శమున్" గడించలేదని కొప్పరపుకవులు వీరిని పేర్కొనడమేకాక తమ పరిచయాలకు కారణమైన ప్రభాకరశాస్త్రిగారే తిరిగి ఈ అసందర్భాలను తొల గించి చక్కజేయాలన్న భావంతో 'కీర్తికరా ప్రభా కరా!' అంటూ 4-9-1911 నాడు కొన్ని పద్యాలు వ్రాశారు. అప్పటి సందర్భాలను వివరిస్తున్న లేఖాంశములివి (గుంటూరుసీమ 1913పుట 11, న చూడదగును).

4-9-11వ తేదీ కొప్పరపు సోదరకవులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారికి వ్రాసిన లేఖ లోని అంశములు :

"....మరునటి దినము ఉదయమున వారు (తిరుపతి వేంకటేశ్వరులు) రంగావఝ్ఝుల హను మయ్యగారు అనుప్లీడరుగారి యింట్లోనుండఁగా దర్శనము చేసికొనుటకు వెళ్ళినాను. వెళ్ళి వారిని గురించి నాకుండు సంతోషమును, భక్తిభావమును వెల్లడించుచుఁ గొన్నిపద్యములను చదివి 11 గంట లకు మరల భోజనవేళ యగుటచే శ్రీ ఏకా రామయ్యపంతులుగారింటికి వచ్చినాను...."

(గుంటూరుసీమ, పు. 27)

"....కుర్చీ అచ్చటనే యుండగా కొందరిది వద్దనియు, మరికొందరిది యుండవలెననియు నను కొనుచుండినారు. నేను వారితో "నిన్నటిదినము దిగువ గుర్చీమీద గూరుచుండలేదా వారు సభ చేయు చుండగా నేను వారిప్రక్కన గూరుచుండుట మాత్రము గౌరవమా, నా కెప్పటిచోటనే కుర్చీ వేయించినయెడల గూరుచుండెదను. సభ జూచు టకు వచ్చి యేమేమో అభిప్రాయమెందుల" కని

నేను వారితో జెప్పినాను. 'మొదట వేయుట యెందులకు! తరువాత తీయుట యెందుల'కని నడుమ గలవారు వాగ్వాదము జరుపుకొనుచుండిరి. అప్పుడు నేనే వెళ్ళి క్రిందవేయబడిన కుర్చీమీద గూరుచుండ దలంచుచుంటిని. యీ వాగ్వాదము అవధానము జరిగించు సభాప్రదేశమునగాక ఆ ప్రదేశమునకు వేరుగానుండు మరియొకచోట జరిగినది....ఇంతలో నగ్రాసనాధిపతిగారు...యీ సంగతిని విచారించి కొంత ప్రసంగము జరిపిరి. ఆ ప్రసంగము...యుక్తియుక్తముగా నుండినది. 2000 మంది మహాజనులు కూడిన ఆ సభలో వేంకటశాస్త్రిగారు లేచి ఆ ఆశు కవిత్వము మా కవిత్వమువంటిది కాదు. ఆ శతావధానము మా అవధానమువంటిది కాదు. కావున ఆ శతావధాని మా ప్రక్కను గూరుచుండుటకు మా సరసను నిల్చియుండుటకు దగడని....అందుచే వారికిని మాకును ఆశుకవిత్వావధానముల విషయమయి కొంచము కలహము ప్రాప్తమయినది. ఇందు కొంతభాగము నడుమ నున్నవారి మాహాత్మ్యము. ధర్మపథవర్తులును, మిత్రవరేణ్యులును, న్యాయప్రియులునగు తమకు యథార్థమును విన్నవించుకొనినాము.

ఉ॥ వారిని మేము మమ్ము మరి వారును జూడక
యుండినప్డు వి
స్తారముగాగ స్నేహము నెసంగగజేసిన
బుద్ధిశాలి వో
ధీరవరేణ్య నీనయవిధిన్ గనుతింపగ!
మాకుశక్యమే
కూరిమిబాపి యా నడుమ గొందరుజేరి
మనోవికారముల్
కూరిచి యల్లరిన్‌జరప ఘోరముగా
దలపెట్టియుండి రీ
వైరమసాధ్యమై ప్రబలవచ్చు నటంచును
దోచుచుండె లో
నీరసమింత లేక మదినెంతయు న్యాయ్యమె
గోరుచున్నవి
ద్వారసికుండవంచును హితాగ్రణివంచును
విన్నవించినా
మీరసమెట్లు మారునో గ్రహింపుమి
కీర్తికరా! ప్రభాకరా!

ఇట్లు విధేయులు,
కొప్పరపు వెంకటసుబ్బారాయ,
వెంకటరమణులు.

గుంటూరు, ఏకా రామయ్య గారి యింటిలో. 4-9-11

ఈ సందర్భంలోగుంటూరుసీమ (ఉత్తరరంగము పుట 34,35 1914)లోనేచెళ్ళపిళ్ళవారు ప్రకటించిన ప్రభాకరశాస్త్రిగారి లేఖల్లోని అంశాలు చూడదగినవే.

చెన్నపురి, లైబ్రరీ, గురువారం.

"....నిన్న కొప్పరపుంగవులు నాపేర 8 పేజీల ఉత్తం వ్రాసినారు. వివాద చరిత్రమును వ్రాసినారు తమ దోషము లేశమును లేదనియు వెం॥ శా॥ అన్యాయముగా గర్హించిరనియు, మొదలుగా వ్రాసినారు. దాని వైఖరి చూడగా వివాదము నుండి తప్పించుకొనుట కిష్టపడు చున్నారని దోచు చున్నది. అట్టి ప్రయత్నమున్నచో తప్పక మీరును అంగీకరింప వేడెదను. ఈ వివాద సభలు కార్యకారులు కావు. నడుమవారికి పండువు. పోరాడువారికిర్వురకు శ్రేయము కన్పడదు. ఈ సభలలో తీర్పు తీర్చువారెవరు? ఎట్లు సాగును? లోకోభిన్నరుచిః, తత్రాపి స్వస్వపక్షాభి మానో బలవాన్ బాధతే, వారు 'ఛాలెంజి' ప్రచురించినందుకు, శివరామశాస్త్రి మరల ప్రచురించెను. అంతటనాగిన బాగుండునని నేను తలంతును. నా ప్రార్థన మిదియే....ఏ విధముననైనను తగువు మానుకొనుట బాగు. నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాల్పోకయున్నాను. జవాబు వెంటనే వ్రాయించవలెను...."

వే॥ ప్రభాకరుఁడు.

పోస్టు ముద్ర
4 సెప్టెంబరు 1911 లైబ్రరీ
ఎగ్మూరు. సోమవారం

"....ఈ వివాదమును గూర్చి కొంత వ్రాత చూచిన నాటి రాత్రి 27వ తేది.... మీ కాగితములు వచ్చినవి. ఈ స్థితిలో నున్న నాకు ఒడలు పులక లెత్తెను. మహోత్సాహానందములు కల్గెను. నేను కూడ ఇప్పుడు గుంటూరు రావీలుండిన బాగుం డును..... నౌకరీ వీలులేదు,.... కొవ్వరపుంగవులు ఇక్కడ నవధానము చేయుటలో అష్టావధానము పేరేగాని లక్షణమింతేనియు లేదు. సమస్యలు ముందు చెప్పించుకొనుట....వ్యస్తాక్షరి లేదు....ఒక వేళ వివాద సభలు జరుగునేని.... అష్టావధానము ప్రధానముగా ముందు పరీక్షింప వలసినది. అందు వ్యస్తాక్షరి ముఖ్యతమము. వారి ఆశుధార గొప్పదే కాని.... వేలకొలది పర్యాయములు తిరుగుచున్న మామూలు చక్రమేగాని క్రొత్త రీతిని దిరుగదు. ఈ యూరనిచ్చిన కథ వారు చెప్పనే లేదు. ఇతరం వారి బాటను కొట్టివోసిరి. వారి బాట తప్పించి (సంభవించె నేని) ఆశుకవిత చెప్పింపవలెను. మాలో శివరామ శాస్త్రి కృతార్థతముడు. నాయానంద మతనికిఁ దెల్పుఁడు. మీరా వారితోఁ దులగా వాదింప నేనిచ్చగింపను. గెల్చినవచ్చెడు ప్రతిష్ఠ యెంత? ఇఁక నీ వాదము లేల? మీరు వదలుటయే నా కోరిక. శివరామశాస్త్రియు పలదు. వారెట్టి పాండితి కలవారని,.... నాటి వివాద స్వరూపము, బీజము ఎట్టివి? ఆయూర నిరువాగులను ప్రధాను లెవరు? యావదంశము మీకు వ్యవధి లేకున్నను మనకుఁ బరమ మిత్రులగు బ్రహ్మశ్రీ.... గారిచే నయిన వ్రాయింపుడు.... ఇంకను అచ్చులో నున్న రికార్డు ప్రూఫులయినను వెంటనే పంపుదురు గాక."

వే. ప్ర.

(గుంటూరు సీమ ఉత్తర రంగము పుట. 117 1914)

"ఏ చతురుడు వీరిమెచ్చినను సత్సభస్వాంతము డాఁచియేసుమీ"

(బందరు - 245 గుం. సీమ. ఉత్తర రంగము పుట 117. 1914)

ఇలాగే తిరుపతి వెంకటకవులకు రామకృష్ణ కవు లకు వాదోపవాదాలు చెలరేగినప్పుడుకూడా 'సతీర్థ్య సంప్రార్థన'మన్న పేరుతో చాలా పద్యాలు నాడు స్వధర్మ ప్రకాశిని చతుర్థసంపుటం 7, 8 సంచికల్లో ప్రకటించారు ప్రభాకరశాస్త్రిగారు.

"అచ్చానేక మహర్షి నిర్మిత మహాగ్రాచార నిర్మాణ ముల్
స్వేచ్ఛాచారులు నేఁటి కాలమునయం దెందెందతో విజ్ఞవే
షచ్ఛన్నుల్ పడఁగూల్చ నందు గురుశిష్య న్యాయ నిర్మాణమూ
లోచ్ఛేదమ్మున కీరు పాల్పడితి రొక్కో! రామకృష్ణాహ్వయుల్.

గురువుల్ తిర్పతి వేంకటేశ్వరులు మీకున్ మాకు నిక్కంబు త
త్కరుణాసారమె కారణమ్మరయ విద్యా బీజ మొక్కింత యుం
కురమందన్ మనకెల్ల నిక్కముగ, మాకున్ వారికిన్ శిష్యతా
గురుతల్ లేవను మీ నుడుల్ వినిన నే క్రూరుండు నుం గుందెడున్

'గురుఁడున్ దైవము లేఁడు నేఁడకట! యాంగ్లో విద్యలన్ నేర్చు బా
లుర'కంచున్ వచియించు పండితుని సోల్లుంఠమ్ముగా నొక్క నే

ర్వరి యాంగ్లేయ కలార్థి 'మీ చదువు నేర్పన్ భక్తి
చేకూరునొ
నరయుం'డంచును మిమ్ముఁ జెప్పెనట యయ్యా!
— యింకఁ జాలింపుఁడీ.

ప్రభాకరశాస్త్రిగారికి విద్వాంసులైన పెద్దలయెడ, గురువులయెడ గల భక్తి అపారము. వీరియందు తిరుపతి వెంకటకవుల కుండిన విశ్వాసమూ తత్తుల్య మైనదే. 'నీ వెఱుగుదువో లేదోయని తెల్పితిని కాని అన్యం కాదు' అని గురువర్యులు వ్రాయడం లోని ఆంతర్య మిదే.

7. శ్రీ విస్సా అప్పారావు పంతులుగారు ఆర్వేల నియోగులు. ప్రభాకరశాస్త్రిగారు వెలనాటి వైదికులు. వీరిరువురు వియ్యంకులు. ప్రభాకరశాస్త్రిగారి పెద్ద కుమార్తెను అప్పారావుగారి పెద్దకుమారునకిచ్చి శాఖాభేదాల్నిపాటించకుండా అప్పట్లో జరిపిన వివాహ వార్త పత్రికల్లో అభినందన లందుకొంది. శాఖా విభేదాలు సాంఘికంగా అలజడి కల్గిస్తుండిన ఆ నాళ్లల్లో ఈ మహనీయుల దృక్పథాలెట్టివో తెలుసు కోడాని కీశాఖాంతర వివాహ మొక మచ్చుతునక.

8 ఈ విషయాన్ని 'ఊరక తెల్పితిని' అనడం లోను, 'శ్రీ అప్పారావుగారికి ఆయీ విచిత్రాశ యములు వినిపింపుము' అనడంలోను 'నీవు నన్ను తిట్టినను కవిత్వం తన్మయంగా చెపుతావు' అని రామకృష్ణామాత్యుని మెచ్చడంలోను ఈలేఖాకాలా నికి చెళ్లపిళ్లవారి చిత్తవృత్తిలో కలిగిన మధుర మైన పరిణామాన్ని గుర్తింపవచ్చును.

9. ఈ సహాయం మాస్టర్ సి.వి.వి. యోగ మార్గాన ప్రార్థనతో ప్రభాకరశాస్త్రిగారు చేసే చికిత్స (ట్రీట్మెంటు).

10. 24-3-44 న వ్రాసిన జాబులో ఉదా హృతమైన పద్యమేయిది. కాని అంకెలో తేడా ఉంది.

11. 'మాస్టర్ సి. వి. వి. నమస్కారం అని ఉదయమూ సాయంత్రమూ చేసుకొనే ప్రార్థన.

12. ఇది బెజవాడలో ఆస్థానకవికి జరిగిన సన్మానసభను గూర్చిన ప్రస్తావన.

13. చెళ్ల పిళ్ల వారి కి ప్రభాకరశాస్త్రిగారికి ఉండిన గురుశిష్య సంబంధం యొక్క పరాకాష్ఠను సూచించే సందర్భమిది.



శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారికి శ్రద్ధాంజలి

# ఆస్థాన కవి నిర్యాణము

**- వేటూరి ప్రభాకరశాస్త్రి**

గోచిపెట్టక మున్న కోమల కవిత చెప్పగ నేర్చితిమి ధరాపాలురార' అని చెప్పుకొన్నట్లుగానే తమ యెనిమిదవ యేట నుండి యెనుబదవ యేటి దాకా నిరంతర కవితా తపస్సు చేస్తూ, తమ సాన్నిధ్యానుగ్రహము చేతనే అనేకులను తమ పోలిక చాలికలుగల దివ్య కవితా విశారదులనుగా సత్ప్రవర్తనులనుగా సత్కుటుంబులనుగా అనుగ్రహిస్తూ వచ్చిన కవితా కులపతులు శ్రీ వెంకట శాస్త్రిగారు శివరాత్రినాడు మిట్ట మధ్యాహ్నమున శరీరము విడిచినారన్న వార్త నిజంగా నాకు, నాకే కాదు అనేకులకు సంతోషమేకొల్పినదిగాని దుఃఖం కొల్పలేదు. అయినా విద్యావంశంలో బిడ్డల మయిన మమ్మ - అంటే చిరంజీవులను శివరామ శాస్త్రిని, సత్యనారాయణను, వేంకటేశ్వరరావును, లక్ష్మీకాంతమును ఇంకా అనేకులనూ జన్మ వంశములో బిడ్డలనూ తండ్రిలేని బిడ్డలనుగా చేసినారని తలచుకొంటే ఇక ఆ దివ్య సారస్వత మూర్తి భౌతిక శరీరమును చూడడం తటస్థించదు అని తలచుకొంటే అదేమో దుఃఖము పొర్లుకు వస్తూనే ఉన్నది. శివరాత్రికి పూర్వ దినమే నేను వారిని దర్శించి భీష్మనిర్యాణం జ్ఞాపక పఱచి - మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణం అన్నంత మాత్రమే చదివి నమస్కరించి గుంటూరు వెళ్లినాను. అయినవారు వినయ వివేకవంతులై అనువర్తిస్తూ ఉండగా, అందులో మరీ మా దుర్గయ్య శాస్త్రి సత్కవితా విశారదుడై అనువర్తిస్తున్నాడనగా, అవసాన సమయమున దగ్గర ఉండి శుశ్రూషిస్తూ ఉన్నాడనగా మా శాస్త్రిగారికి, విద్యా వంశములో బిడ్డలను గూర్చిగాని జన్మ వంశంలోబిడ్డలను గూర్చి గాని ఏ విచారం ఉండదు. వారా బంధరహితులై పండురాలినట్లు రాలిపోయినారు.

మా శాస్త్రిగారికి శివభక్తి హెచ్చు. వారికి రాజాధిరాజులిచ్చిన బంగారుబిరుదు లెన్నిఉన్నా వాటిని గాక మెళ్లో గవడ రుద్రాక్షలమాలనే ధరిస్తూ ఉండేవారు. కొన్నేళ్ల క్రిందట నమశ్శివాయోం, నమశ్శివాయోం, నమశ్శివాయోం నమశ్శివాయ. అని చాలా శ్లోకాలు రచించి శివోహం అనీ నమశ్శివాయ శివైక్యం అనుసంధిస్తూ శివనామం జపిస్తూ ఉండేవారు. శివరాత్రినాడే వారికి ముక్తి కలుగడం ఆతపో ఫలమే అనవలెను. శివక్షేత్రాలన్నిట శివరాత్రినాటి ప్రదోషకాలంలో "జగజ్జ్యోతి" అని కొన్ని డబ్బాల నేతితో గొప్ప జ్యోతిని వెలిగిస్తారు. అది పది రోజుల దాకా వెలుగుతూ ఉంటుంది. శివరాత్రి నిర్యాణము గనుక వారి ప్రదోష సమయపు చితాగ్ని జ్వాలలు ఆ జగజ్జ్యోతిలో కలసి కైలాసము ముట్టి శివపురాణ రచన చేసిన మా శాస్త్రిగారి శివలోక యాత్రకు దారిదివ్వెలుగా ఈ పదిరోజులూ అను

వర్తిస్తూ ఉంటాయి అని నా విశ్వాసం. మా శాస్త్రిగారి శిష్యవాత్సల్యం ఎట్టిదో ఒక్కముక్కలో చెప్పుతాను. ఎంత తప్పించుకు పోదామన్నా విడువక వారు ఒంటరిగా వున్నప్పుడు నన్ను తమ ప్రక్కలో తమతో పాటు పండుకోబెట్టుకున్న సమయాలెన్నో ఉన్నై. ఒకప్పుడు 'గురుతల్పమండి' అని నేను గొణుగుతూ ఉంటే 'బిడ్డవురా నా దగ్గరే పడుకోవలె'నన్నారు. వారి ప్రక్కలో పడుకొంటే తెల్లవార్లూ చాటుమాటు లేకుండా వారిముచ్చట్లు అన్నీ తెలియజెప్పుతూ ఉంటే కాలం గడిచిపోయేది. వారు విద్యాబీజములు సర్వాంధ్రదేశమున శిష్యక్షేత్రములలో విరజల్లినారు. అవి శాశ్వతంగా వర్ధిల్లుతూ ఉంటే వయసు మీరిన కొద్దీ వారి రచనలు ధర్మోదాత్తములై రసోత్తరములై వెలసినవి. వ్యవహార భాషావాదానికి నిశ్శబ్దంగా నిర్వివాదంగా వారు ప్రాణంపోశారు. ఇక ఎక్కువ కాలం వారి దర్శనం లభించదనుకున్నాను.

వచ్చుచు బోవుచున్ విజయవాడను మద్గురు(జూచు
చుందునన్
ముచ్చటనుందు నిందనుక ముందెటులున్నదొ
ఎట్టులుండినన్
పొచ్చెములేదు పక్వఫలముల్ తొడిమల్ విడవో
యిహమ్మువా
రిచ్చిన యీకవీంద్రపద మీశ్వరు నొద్దను
జెల్ల(గావలెన్ ..

అని ప్రార్థన చేసుకొన్నాను.

దశలేడెన్మిది వెళ్లబుచ్చితిరి శబ్దబ్రహ్మనిష్ణాతులై
వశమందున్నవి జ్ఞానపుంగరణముల్ వాక్ప్రాణు
లున్ వీనితో
ప్రశమంపుందశ వెళ్లబుచ్చుచు పరబ్రహ్మను
సంధాతలై
శిశువుంబోలె సుతల్ సుతుల్ స్నుషలు పోషింపన్
వినోదించుచున్.

అని వారిని వేడుకొన్నాను. కూతుళ్లు కోడళ్లు కొడుకులు అల్లుళ్లు సరిగా శుశ్రూషించి కృతార్థులైనారు మా శాస్త్రిగారు; ఇకమీద శ్రీ తిరుపతిశాస్త్రిగారి సహవాస సౌఖ్యం అనుభవిస్తూ వారితో కైలాసంలో జంటకవులై వెలుగొందుతూ ఉంటారు. శాశ్వతంగా తిరుపతిశాస్త్రిగారికి వెంకటశాస్త్రిగారికీ వర్ధిల్లిన మైత్రిని పోషించుకుంటూ విద్యావంతులైన తిరుపతి శాస్త్రిగారి బిడ్డలూ వెంకటశాస్త్రిగారి బిడ్డలూ విద్యావంశసోదరులమయిన మేమందరమూ మా శాస్త్రిగారి దివ్యలోకాశీస్సులందుకొంటూ సౌహార్దంతో సారస్వతసేవ కావింపగల్గుదుముగాక.

శ్రీ శాస్త్రిగారి పాదుకలును, సులోచనాలు, రుద్రాక్షతావళం, బిరుదులు అన్నీ మంచి మ్యూజియంలో శాశ్వతంగా చేర్చి ఉంచడం మంచిది. అందుకు పూనుకొందుము గాక.

(ఆలిండియా రేడియోవారి సౌజన్యంతో)

  

మరికొన్ని లేఖలు ప్రక్క పేజీలో

# మరికొన్ని లేఖలు

మృత్యుంజయ ఫార్మసీ

గాంధీనగర్, విజయవాడ
27-2-50

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి గారికి నమస్కారోభయకుశలోపరి. నిన్న నొక బహిరంగ సభ ఏర్పాటు చేయబడ్డది. రామమోహన లైబ్రరీలో శ్రీ వెంకట శాస్త్రిగారి 12 దినము కనుక. ఆ సభలో దుర్గయ్యశాస్త్రి శ్రీ శాస్త్రిగారి యావత్తు సామాన్లు వగైరా మ్యూజియంలో దాచుటకు యిస్తానని వాగ్దానం చేశాడు. వాటి ఏర్పాట్లు మీరు ఆలోచించ వచ్చును. జవాబు వ్రాయకోర్తాను. వాటిని స్వాధీనము చేసుకుంటాను.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు
వేంకటేశ్వర ప్రాచ్య కళాశాల, తిరుపతి.

చిత్తగింపుడు.
(సం)-నమశ్శివాయ.

*  *

Sri Venkateswara Oriental Institute
Tirupati.

From :
Prof. P. V. Ramanuja swami M A.
Director and Principal.

To,
Sri Veturi Sundara murthy B.Sc,
S/o the Late Sri V. Prabhakara
sastri Garu, Tirupati

RO. C. No. 39 01/49 Date 3-10-1950

The Gold Medal of Asthana Kavi presented by the Government to the Late Sri Venkata sastry garu along with some other articles belonging to the pandit, which have been presented to the Sri Venkateswara Museum, Tirupati are left in your house by your late revered father. I request you to send the articles to me by the bearer for being placed in the Musem.

Yours Sincerely,
(Sd) P. V. Ramanuja Swami
Director

*  *

The following articles are received from Sri V. Sundaramurthy garu.

1) A Silver Casket with a box, Presented by Gudivada Muncipal Council 17-9-49.

2) A Silver lotus with a Silver plate presented by Andhra Saraswatha Sangham, Hyderabad.

3) A Gold Medal with Silver Chain presented by the Government of Madras (Asthana Kavi Medal).

4) Rudraksha Mala.

5) A Silver plate with a circular Gold disk in the centre presented by various associations on the eve of his being made the Asthanakavi.

6) Spectacles with case.

7) Fascimile.

8) Snuff box (పొడుము కాయ).

9) కుంకుమ బరిణె.

10) నల్లమందు డబ్బి.

11) A Shield with his Photo enclosed in a Silver design presented by Gowthami Vidya Peetam, Rajahmundry 17-9-1949.

12) A pair of shoes.

13) A Wooden box with Key.

14) A bamboo hand stick.

(Sd) P. Balakrishnamurthy
Research Asst. in Telugu.
S. V. O. R. I. Tirupati, 4-10-50

Sri Venkateswara Oriental Institute

From
Prof. P. V. Ramanuja Swami

To
Veturi Sundara Murthy

RO. C. No. 39/01/49 Date 5-10-1950

I have the honour to acknowledge with thanks the receipt of the following articles of the Late Sri Chellapilla Venkata sastry brought to the Sri Venkateswara Museum by your father of revered memory.

1) Silver plate with a circular gold disc in the center.

2) Silver casket in case.

3) Government of Madras Medal.

4) Shield with photo and silver frame.

5) Silver Lotus with base plate.

6) Hand box.

7) Spectacles with case.

8) Snuff box.

9) Rosary of beeds.

10) Hand stick bamboo.

11) A pair of slippers.

12) A small tin box.

13) Another tin box [and]

14) Fascimile

Yours Sincerely,
(Sd.)-P. V. Ramanuja Swami
Director

7-10-1950.



---

కం॥ ఆధులచే వ్యాధులచే
బాధల బడుచున్న నన్ను బాగుపఱిచి స
ర్వాధారమైన నీతే
జోధారకుఁ బాత్ర మొనరుచుకొనవె! దేవా! —వే. ప్ర.

---

.... సోమవారము, 2 జనవరి, 1933.

కోటసాని బావి పశ్చిమపు గట్టున ప్రాచీన లిపి శాసనం ఉంది. గురజాలలో[1]

.... మంగళవారము, 17 జనవరి, 1933.

కొడవటిగంటి వెంకట సుబ్బయ్యగారి జననం[2] - మన్మథనామ సం॥ మాఘ శుద్ధ ౧౩ జయవారం రాత్రి 25 ఘడియల ప్రొద్దుపోయి, పునర్వసు నక్షత్ర తృతీయ చరణ ధనుర్లగ్నములో జననము.

.... శనివారము, 28 జనవరి, 1933.

నేడు మధ్యాహ్నము రామచంద్రయ్యగారు[3] ఆతురుడై అగపడెను నిద్రలో.

.... ఆదివారము, 29 జనవరి, 1933.

ఉ.ల[4] గారికి జాబు వ్రాసినాను.

.... బుధవారము, 1 ఫిబ్రవరి, 1933.

నేడు భుజించకుండా ఆఫీసుకు వెళ్ళినాను. ట్రీట్మెంటు ఎవరికిని జరుప లేదు. రాత్రి 10 గం॥ నా బదులు చిరంజీవిని[5] జరపినది.

.... గురువారము, 2 ఫిబ్రవరి, 1933.

ఉ. లక్ష్మీనారాయణ గారి దగ్గఱ నుండి జాబు వచ్చినది. మరల జాబు వ్రాసినాను.

.... శనివారము, 4 ఫిబ్రవరి, 1933.

నేడు కొత్తయింట ప్రవేశించితిమి. నేటిరాత్రి చి॥ ఆనందమూర్తికి[6] జ్వరము.

కొత్తయింటి మార్పు చిత్తవికారంబు
నరస భోజనంబు నజ్ఞగోష్ఠి
నేడు నాకుఁ జాలఁ బీడ కల్గించెను
రాత్రి సరిగ నిద్ర రాకపోయె

.... ఆదివారము, 5 ఫిబ్రవరి, 1933.

నేడు 11 గం॥ ఆఫీసుకు రాగానే రామచంద్రన్[7] బిడ్డకు చాలా జబ్బుగా ఉన్నట్టు వినికి. 11.05కు ట్రీట్మెంటు చేసితిని. తిరిగి 3.35కి ట్రీట్మెంటు చేసినాను, ఈ తూరి ట్రీట్మెంటులో చాలా ఆక్షను జరిగినది. తల మంటలు ఎక్కెను. చేయి గజగజ లాడెను. చాలా ఒడుదుడుకుగా ఉన్నది. రామచంద్రన్ మరొక అటెండరు ద్వారా నాకు ఆ పిల్లవాని ఆరోగ్యము వినిచెను. ఉదయం వి.ఎ[8] ఇంట ఉండగా విషూవియస్‌ను గూర్చి వినికి. తీవ్రమైన ఆక్షన్. (ఇటలీ అగ్ని పర్వతము రగులుటను గూర్చి వినికిచే).

.... సోమవారము, 6 ఫిబ్రవరి, 1933.

రామచంద్రన్ బిడ్డడికి ట్రీట్మెంటు చేసినాను. ఆఫీసులో చేస్తూఉండగా ఆనంద మూర్తి ఆడుతూ అగపడెను. ఆనందమూర్తికీ జ్వరం. కొంత నెమ్మదిగా ఉన్నది.

.... బుదవారము, 22 ఫిబ్రవరి, 1933.

పాండ మంగలం వెంకట రామయ్యగారి[9] దగ్గఱ నుండి జాబు.

---

[1] దీనిని గురించి గురుదేవులు 'కపిలేశ్వరపుర శాసనము' అనే వ్యాసంలో ఇలా వ్రాశారు.
"క్రీ.శ. 700 సం॥ ప్రాంతము నాఁటివి గోదావరీ మండలమున తెలుఁగు శిలాశాసనము లిప్పటికిని గానరాలేదు. కృష్ణామండలమున చాళుక్యభూపాలుఁడగు మంగి యువరాజు శాసనము బౌద్ధస్తూప శిల పైఁజెక్కినది లక్ష్మీపురమను గ్రామమున నొకటిమాత్రము దొరకినది. నేనే దానిని దొరకించుకొని విభవజ్యేష్ఠ భారతిలోఁ బ్రకటించితిని. గుంటూరు మండలమునఁగూడ, నాకాలపు తెలుఁగు శాసనములు ఒంగోలు తాలూకాలోతప్ప ఇతరత్ర దొరకలేదు. పల్నాటి తాలూకా గురిజాలలో కోటసాని బావి యని పేరుగల దిగుడు బావిలో నీటిమడుగున నొక ప్రాచీన శిలాశాసనము నునికి విని యిప్పటి కిర్వదియైదేండ్లకుముందు అక్కడి మిత్రులు వెలికిఁదీయఁగాఁజూచి, యిటీవల పదియేండ్లక్రింద ప్రతిబింబము తెప్పించుకొని చూచితినిగాని నాకది స్పష్టముగాఁజదువఁగుదరనిదిగానున్నది. కాని యది మాత్రమచ్చము తెలుఁగు శాసనమే...." JSVORI Tirupati 1944.

[2] దీనికి సంబంధించిన లేఖయిది.

[ శ్రీ శ్రీ ప్రభాకరశాస్త్రిలవారి పాదపద్మముల సన్నిధికి - బెజవాడవెళ్లి మాచుట్టాలతో మాట్లాడితే శివానుగ్రహమువల్ల కొడవటిగంటి వెంకటసుబ్బయ్య జాతక విషయము తెలిసినది. కాని, అంశ చక్రాలు దొరకలేదు. మన్మధనామ సంవత్సర, మాఘ శుద్ధ 13, జయవారం రాత్రి ౨౫ ఘడియల పొద్దుపోయి, పునర్వసు నక్షత్ర తృతీయ చరణ, ధనుర్లగ్నంలో జననం-అని వ్రాసియున్నది. విశేషాలు మరిలేవు. ఈ ప్రాంతాలలో పిల్లలమర్రి పూర్ణయ్య సిద్ధాంతిగారి పంచాంగం ఆరోజుల్లో ప్రచారంలో ఉండేది. దాన్నిబట్టి ఇవి వ్రాశారు. ఫలితము తెలుప వేడుతాను. మీరు చెప్పిన పనులు నిదానముగా చేస్తాను. చిత్తగించవలెను - శివశంకరశాస్త్రి. గుంటూరు, ఫిబ్రవరి 26, 1933]

[3] యోగ మిత్రులు.

[4] యోగమిత్రులు ఉన్నవ లక్ష్మీనారాయణగారు.

[5] వేటూరి మహాలక్ష్మమ్మగారు. ప్రభాకరశాస్త్రిగారి సతీమణి.

[6] గురుదేవుల మూడవ కుమారుడు.

[7] డా॥ టి. యన్. రామచంద్రన్, యోగమిత్రులు (చూ. కరెస్పాండెన్సు-2 'మణిమంజరి' జయంతి సంచిక - పుట 44-48 ఆంగ్లవిభాగం)

[8] ఆచార్య విస్సా అప్పారావుగారు, ఫిజిక్సు ప్రొఫెసరు. శాస్త్రిగారికి వియ్యంకులు యోగమిత్రులు.

[9] యోగమిత్రులు.

# చాటుపద్య - మణిమంజరి

[ తుని నుంచి 'శ్రీరాజా నల్లపరాజ మీర్జా అచ్యుత రామరాజ బహాద్దరు' గారి సంతకంతో వచ్చిన 1926 నాటి యీ లేఖతోపాటు 37 చాటు పద్యాలు కూడా వారి సంస్థానానికి సంబంధించినవీ ఇతరములూ గురుదేవులకు చేరినవి. వాటిల్లో కొన్నింటిని సంస్కరించి చాటుపద్య మణిమంజరి ద్వితీయ సంపుటం (1960) లో శ్రీవారే చేర్చు కొన్నారు. తక్కిన వాటిని ఇక్కడ ప్రకటి స్తున్నాము.

ఈ రాజవంశ చరిత్రను గురించి శ్రీ పెండ్యాల వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు 1929 ఏప్రెలు 10 సంవత్సరాది సంచిక ఆంధ్ర పత్రికలో ప్రక టించిన వ్యాసం చూడదగినది. అందులో చివరన వారిట్లా వ్రాశారు. 'సంపాదిత గ్రంథాలు పెక్కులు ఈఏడు కలిగిన తుని జలప్రళయంలో పోయినవి!' మన దురదృష్టము! లేకుంటే ఇంకా ఎన్ని లభిం చేవో; -సం ]

ది. 5-4-1927

తుని.

ఆర్యా !

తాము ది 28-5-1924 తేదీ వ్రాయించిన వుత్తరముకు అప్పట్లో జవాబు పంపించి యున్నాను. అది చేరియుండునని తలంచెదము, అప్పటి నుంచీ కొన్ని అనివార్య కార్యములచే వెంటనే పంపించ లేనందున మిక్కిలి విచారించితిమి. యిప్పట్లో యీ ముప్పది యేడు పద్యములను మీ తావునకు పంపించితిని. వాట్ల యందున్న లోపములను మీచే సవరణ కాగలవని తలంచినాము. వీటిని వీలుననుసరించి ద్వితీయ భాగమందుగాని తిరుగా అచ్చువేయబోయే తృతీయ ముద్రణము నందుగాని చేర్పించి మాకొక ప్రతి వి. పి. గా పంపించ కోరుచున్నాము. ఆలస్యము మన్నించ కోరుచున్నాము. యివిగాక యింకనూ మరికొన్ని పద్యములూ శ్లోకములూ పూర్వకవి రచితములున్నవి. కావలసిన యడల వ్రాయిస్తే పంపించు చున్నాము. తరచు మీ క్షేమమును వ్రాయించ కోరెదము.

చిత్తగించవలెను.

శ్రీ రాజా నల్లపరాజ మీర్జా అచ్యుత రామరాజ బహాద్దరుగారు

[ 37 పద్యములుగల వ్రాత ప్రతి కింద ఈ లేఖనమున్నది ]

యీ పద్యములను వ్రాతప్రతి నుండి యెత్తి మీ కోరిక ప్రకారము యిందున వ్రాసి పంపించడమైనది. తప్పులకు మన్నించ కోరెదము. చిత్తగించవలెను. 5-4-26 సం॥ శ్రీరాజా నల్లపరాజు మీర్జా అచ్యుత రామరాజ బహద్దరు గారు.

చాటుపద్యములు

(పెద్దాపురం శ్రీరాజావత్సవాయ తిమ్మ జగపతి రాజు మహారాజులుంగారు చెప్పిన చాటు పద్యము.)

సీ॥ చేలంట నిటకు వచ్చితి వెందుబోయెద । వూరు జేరగవచ్చినార మబల
నఖముఖంబులవీక్షణంబౌనర్చెద వేల । చనుగట్టులానగ జలజనయన
తెలియ వాతెఱవింత తిలకించెదవు జాణ । పంటనాడగ భ్రమపడితి తరుణి
నీవీసరణిఁగాంచు నేర్పు విచిత్రంబు । విప్పి చెప్పెద జూడవే లతాంగి

గీ॥ అనుచు పథికచయంబుతో ననుదినంబు । సరసవాక్యోపవాక్య ప్రసంగములను
దేలుదురు వీటి బాహ్యప్రదేశములను । శాలిపాలీ వధూటు లా ప్రోలునందు

(శ్రీరాజా నల్లపరాజు మీర్జా వెంకట నీలాద్రి రాజు బహద్దర్‌గారి పైనచెప్పిన శ్లోకము వంశస్థవృత్తం)

శ్లో॥ చిరసుస్ఫురా సత్యగిరా విరాజతాం । ప్రతాపరూపామితభోగకీర్తిభిః
క్షితౌ హరిశ్చంద్ర ఇతీరితోఽమరై । ర్నరైశ్చ నీలాద్రినరేంద్రచంద్రమాః॥

(శివల శ్రీకాకర్లపూడి వేంకటపతి రాజుగారు శ్రీ రాజా నల్లపరాజ మీర్జా సాహెబు వెంకట నీలాద్రి రాజ బహద్దరు వారిని గూర్చి చెప్పిన పద్యము.)

కం॥ పంకేజభవ వధూపద
పంకజ మంజీరనినద భాసురములు నీ
పొంకపు పలుకులు మీర్జా
వెంకట నీలాద్రిరాజ విద్యల భోజా!

(శ్రీ శిష్టు కృష్ణమూర్తికవిచంద్రుడు శ్రీ రాజావారిని దర్శించినపుడు చెప్పిన శ్లోకము.)

శ్లో॥ లక్ష్మీవక్షోజకుంభ ద్వితయపరిసర ప్రస్ఫురత్కుంకుమశ్రీ
శోణానూనాగ్ర సంధ్యారుచిరుచిరఘన భ్రాంతి కృత్కాంతివక్షః
పద్మాక్ష స్సర్వ విద్వద్వినుత గుణగణాధ్యక్ష మక్షీణశౌర్యం
మీర్జానీలాద్రి రాజ ప్రభుమణి మవతు స్ఫారకారుణ్యబుద్ధ్యా॥

(ఈతకోట వాస్తవ్యులు శ్రీ గొట్టెముక్కల నరసింహరాజుగారు భారతీదేవింగూర్చి చెప్పిన పద్యము)

ఉ॥ తల్లి సతీమతల్లి పదతామరసాశ్రితకల్పవల్లి భా
స్వల్లలితాంగవల్లి రతివల్లభుతల్లి కృపారసంబు పై
జల్లి నిరంతరంబు మము చల్లని చూడ్కుల జూచి నీవు మా
యిల్లు భవద్గృహంబుగ వసింపగదే జగదంబ భారతీ ॥

(తాను పెంచినగోరు ప్రమాదవశంబున పోగా అందును గూర్చి గొట్టెముక్కల నరసింహరాజుగారు చెప్పిన పద్యము. 1820 సం॥ ప్రాంతమువారు).

సీ॥ కుంభికుంభ స్త నీ కుచగుళుచ్చములపై చంద్రవంకలు దీర్చుజాడమాని
ఘనఘనా ఘన వేణికాకచంబులమీద చిక్కులన్నియు బాపు చెలువువదలి
హారభాసురకుచాహారికుచాకీర్ణ హారపంక్తులు దిద్దుదారి వదలి
బహువిధ రతిఖిన్న భామాముఖ స్వేద బిందువుల్ చిటులించు పొందులుడిగి.
కామినీస్వర్ణ రంభాశిఖాసుపర్ణ
మార్దవావాస పృష్ట సంభావ్యమాన
నవ్యకండూతి వాపెడు నయమువదలి
పోయెగా గోరు మాచేతి పొందుమాని.

[ శ్రీనాథుని చాటువు ఇట్టిది ప్రసిద్ధము. చూ. క్రీడాభిరామము. ]
(గొట్టెముక్కల నరసింహరాజు చెప్పిన పద్యము).

ఉ॥ నస్యము శీతమత్త గజనాశన హేతు విచార ధీర పం
చాస్యము సుప్తి గాఢతర సంతమస ప్రళయార్కబింబ సా
దృశ్యము వేదశాస్త్ర పఠనేప్సిత పండిత వాగ్విచిత్ర సా
రస్యము సర్వలోక జనరంజన దాస్యము రాజవశ్యమున్.

[ ఈ పద్యమే కర్తపేరులేకుండ శ్రీ దీపాలవారి 'చాటుపద్యరత్నాకరము' నందుకూడ కలదు. ]
(చాటుశ్లోకము) :

వంశేన వపుషా వాచా వస్త్రేణ విభవేనచ
వకారపంచకేనైవ సర్వోనాయాతి గౌరవమ్.

(శ్రీ రాజా కాకర్లపూడి రామచంద్రరాజుబహద్దరుగారినిగూర్చి చెప్పిన చాటుపద్యము).

సీ॥ నీబాకు శత్రుల నెమ్మేని కెగబాకు నీసాగువైరుల నెమకసాగు
నీ కతా రరుల బోనీక తారుగజేయు నీగద పగర దండించునుగద

నీ బల్లె మహితుల ప్రాబల్యమణగించు నీ శక్తి రిపుల ఖండించుశక్తి
నీఖాండ మది శత్రు నృపఖండన మొనర్చు నీయంబు పరవాహినికి భయంబు
నీదుకైజారు కైజారు నిఖిలశరుల
దార్చు జముధాటికి నిజము దాటిదాటి
కడగి వైరులనొంతు కాకర్లపూడి
రామచంద్రావనీప! సూర్యప్రతాప!

(చాటుశ్లోకము)

ఆంధ్రత్వమాంధ్ర భాషాచ ప్రాభాకర పరిశ్రమః
తత్రాపి యాజుషీశాఖా నాల్పస్య తపసః ఫలమ్ ॥

(చాటుపద్యము)

సీ॥ కోతు లెన్బదికోట్లు కొమరొప్ప నొకగంతు
గంతులువేయు నిక్కంపుగమియు
గమికోటికోట్లను గలయంగ నొకమొత్త
మొత్త లర్వదికోట్లు మొరయు వీడు
వీడులక్షక్షోణి వెలయంగ నొక సాతు
సాతు డెబ్బదివేలు సరవి మూక
మూకలుశతకోటి ముదమొప్ప సంగడ
సంగడశతకోటి సరగ ధట్టి
ధట్టు లర్వదికోట్లు ధట్టింపనొకమొన
మొనలు మున్నూటపద్మూడు తోయ
అట్టి తోయలు మరియునార్వైన వెల్వ
అట్టి వెల్వలు డెబ్బదియారు తోడ
నరిగె సౌమిత్రి వీరసహాయుడగుచు
రామచంద్రుండు లంకాపురంబుమీద.

(శ్రీ దర్భా సర్వేశ్వర శాస్త్రి విరచిత పద్యము. )

సీ॥ భూమి నల్లపరాజు బోలు ధీయుతుడన
నల్లపరాజు నానామ మొప్పె
జన నికాయంబు మీర్జావారనంగ మీ
ర్జావారునా బదరాజ మొప్పె.

వృద్ధు లచ్యుత కీర్తి వీవగుదు వన బ
దైక దేశాచ్యు తాహ్వాయము నొప్పె.
రాము గుణమ్ముల సోము రూపున బోల
రామరాజను నామరాజ మొప్పె.

సౌరభవదాఖ్య ప్రతిపద సార్థకంబు
తనువు జూడంగ జిత దర్పదర్పకంబు
హృదయ మనుపమ కారుణ్య సదన మహాహ
రాజకుల దీప! యచ్యుత రామభూప.

(శ్రీ వద్దిపర్తి మంగయ్య కవిగారు కాకినాడ నుంచి వ్రాయించి పంపిన పద్యము.)

సీ॥ సౌమ్యాస్యమున కుద్ది చంద్రుడె యందుమా
వృద్ధిక్షయంబుల వెలయు చుండె
సౌందర్యమున కుద్ది కందర్పుడందుమా
యంగ విహీనుడై యలరు చుండె
ఘనవదాన్యత కుద్ది కర్ణుఁడె యందుమా
నీచ కులంబున నెగడియుండె
వర ధైర్యమున కుద్ది స్వర్ణాద్రి యందుమా
మానవా గోచర మగుచునుండె

యిట్టి గుణములు గలుగు వారెట్లు సాటి
యవని నల్లపరాజ వంశాబ్ధి జాత
రామరాజ బహద్దరు రాజమణికి
యుక్తిగాదు వచోతిశయోక్తి గాదు.



# అనుభూతి - సమన్వయము

[ యోగము - విశ్వ చైతన్యము అన్న శీర్షికతో గురుదేవుల ప్రార్థనానంతర ప్రసంగ మొకటి 'మణిమంజరి' ప్రభాకర జయంతి (ఫిబ్రవరి 1981) సంచికలో ప్రకటింప బడ్డది. తమ అనుభూతిని, ప్రార్థన సమావేశాలలో పాల్గొన్న మిత్రుల అనుభూతులను సమన్వయించి సమీక్షించి గురుదేవులు చేసిన ప్రసంగాల్ని, ప్రత్యేకంగా ఆదివారములందు చెప్పిన అంశాల్ని కొన్నిటిని శ్రీ గురుప్రసాదము గుర్తుచేసుకొని ఉంచారు. వాటి నుంచి మరికొన్ని అంశాల్ని ఇక్కడ పొందు పరుస్తున్నాము - సం ]

27-10-1946 సాయంత్రము.

Love - Life అను వాటి మధ్య తమ ఊపిరి ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఊగుచుండెననియు, శరీర మున తీక్షణముగా ఏకను జరుగుచున్న దనియు చెప్పిరి. కాని ఇప్పుడది Love - Life బదులు Now - Knife అని వినబడుచున్నది. మంగలి కత్తి సానబెట్టినట్లు ఊగుచున్నదని చెప్పిరి. (Now-నవకాళి)-

-దేవతల గూర్చి:

నెల్లూరు వకీలు కే. యల్. నారాయణరావు గారి అనుభూతి: నవరాత్రి వ్రతములు చేయుచుండెను. ఆయన భార్యకు శంకరయ్య గారి భార్య సోకి తగ్గి పోయినది. కాని నారాయణరావు గారు నవరాత్రి వ్రతములు చేయుచునే యుండెను. నిదురలో నారాయణరావు గారి భార్యకు స్వప్నము వచ్చినది. ఆమెను ఆయన లేచి ఓదార్చెను. "స్వప్నము దుస్స్వప్నము కాదు. మంచిదే. కంగారుపడ నవ సరము లేదు" అని ఆమె చెప్పినది. ఆయన శరీరము వణకు చుండెను. నిదుర పట్టలేదు. ఒక దేవత కనబడినది. 'నాకు మీరు పూజ్యాలు వ్రత ములు చేయ నవసరము లేదు. ఆయనకు (శాస్త్రి గారికి) చేయండి. నేను చేయగలిగినది ఆయన (శాస్త్రిగారి) దగ్గరకు తీసుకొని పోవడమే. మేము కూడ ఆయన దగ్గరకు పోవలసిన వారమే. కావున ఆయనకు నమస్కారము చేయండి' అని చెప్పి నది. 'అట్లే చేసెద' మని నారాయణరావు నమ స్కారము చేసుకొనెను. వణకు తగ్గిపోయి నిదుర పట్టినది.

29-10-1946.

సృష్టిలో ఇంతవరకు "త్రీడై మెన్షన్సు" పని చేయుచున్నవి. సృష్టి, స్థితి, లయ ఇంతవరకు పనిచేయు చున్నవి. దీనితోపాటు ఇంకొకటి "ఎటర్నిటీ" కూడ పనిచేయు చున్నది. కాని అది కనబడుట లేదు. దీనినే "ఫోర్తుడై మెన్షన్ వర్క్" అందురు. ఇది పనిచేయ మొదలిడుచో లయ ఉండదు. అదే ఇప్పుడు జరుగు ప్రయత్నము. కొద్ది రోజులలోనో వారములలోనో అందరికి వ్యక్త మగునట్లు అది పనిచేయబోవు చున్నది.

# గాంధి రామాయణం
## సంకలనం

[ గత సంచిక తరువాయి ]

## 2

జై హింద్

"అహింసాపరమో ధర్మః", అని చాటి చెప్పిన అవతార మూర్తి మన బాపూజీ. భారత జాతిని నిద్రనుండి మేల్కొలిపి, భారత మాత దాస్య శృంఖలములను త్రెంచి, బానిసత్వమును రూపు మాపి స్వాతంత్ర్యమును మనకు సంపాదించి పెట్టిన శ్రీ భారత భాగ్యవిధాత మన బాపూజీ. మహాత్ముడు స్వాతంత్ర్యాన్ని సంపాదించినది ఒక్క అహింసా సిద్ధాంతం వల్లనేనని చెప్ప వచ్చును. అహింసా సూత్రాన్ని ఆచరించుటలో బుద్ధుని పోలినవాడు మన మహాత్ముడు. "ఒక చెంప కొట్టిన మరియొక చెంపనిమ్ము" అని బైబిలులో చెప్పిన వాక్యము అవలంబించిన రెండవ ఏసుక్రీస్తు మన గాంధీజీ. అనేక కష్టాలు పడి బాపూజీ మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించి పెట్టి చివరకు తన ప్రాణాన్ని బలి యిచ్చాడు. ఆనాడు ఏసుక్రీస్తు శిలువకు బలి, ఈనాడు మన బాపూజీ పిస్టల్ గుండ్లకు బలి. మహాత్ముడు మన తండ్రి, మన మందరం ఆయన బిడ్డలం. ఆయన బిడ్డల స్వేచ్ఛకోసం పోరాడి స్వాతంత్ర్య జ్యోతిని వెలిగింప జేసినాడు.

అటువంటి మహాత్ముని యొక్క బిడ్డలలో ఒక డైన ఒక దుష్టుడు తండ్రిని పొట్టబెట్టుకొన్నాడు. అది చాలా ఘోరం, చాలా అన్యాయం, చాలా దోషం. కాని మహాత్మునిలో దుర్గుణములు ఏవో ఉన్నవి, అని దేశద్రోహులుచేసే దుష్ప్రచారములు విని, చాలా మంది ప్రజలు మోసపోయి, బుద్ధి హీనులై బాపూజీని నిందించుచున్నారు. కాని అది కేవలం మనకే అవమానం. అదీ కాకుండా దాని వల్ల మన తండ్రికి ద్రోహం చేసిన వాళ్ళం అవు తున్నాము. బాపూజీ మరణించాడు. కాని జీవించే ఉన్నాడు. గాంధీజీ అమరజీవి, ఆసియా జ్యోతి, బాపూజీ మనకు ఆదర్శమూర్తి. కావున ఆయన ఆశయాలను అనుసరించి ఆయన ఆత్మకు శాంతి చేకూర్చడమే మన కర్తవ్యం:-

ఉమ్మడి సింగు సుబ్బారావు.
యస్.యస్.యల్.సి.
ఆలపాడు.

23-1-50

## 3

నాటికి నేటికి సరిగా, రెండు సంవత్సరాలు. సరిగా యిదే సమయము మన బాపూ, మనకులేడని, రేడియో వినిపించినది. అదియొక అయోమయ ప్రపంచమున బడిపోయినాను. ఎన్ని ఆలోచనలు! మహాత్ముడు, గుండుకు వశమై పోయినాడా? మహా త్ముని శరీరమున గుండు ప్రవేశించగలదా? అహింసను, హింస జయించగలదా? ఎన్నో పిచ్చి యూహలు, గుండె అలమటించి పోయినది.

నమస్కరించుకున్నాను. శరీరము భౌతిక మని పించింది. స్పృహ కలిగినది, మన బాపూ మనలను విడువలేదు. మూర్తి మాత్రమే నశించి నది. అప్పుడు, ఇప్పుడూ, మన జాతిపిత, సర్వాంతర్యామియే. మనస్సున కూరట కలిగినది. "రఘుపతి రాఘవ రాజారాం" భజనచేసుకున్నాను. కొంత ప్రశాంతి పొందగలిగినాను.

ఆ మూర్తి నిష్క్రమణే మంచి దనిపించినది. అప్పటికే, జరిగిన, జరుగుతూ వున్న, జరగపోయే, మార్పులను ఆయన భరించలేడేమో అనిపించింది.

అప్పటికి ముందు నుంచే ఇంకనూ అటు తరువాత అజ్ఞాన ప్రజలను, పాలించే విషయములో అహింస ద్వారా పరిపాలించాలని మిక్కుటమగు కోరిక కాగా, ఎంతో ప్రయత్నించినాను. ఏదో సమయములో ఈ లోకము విసిగిస్తుంది. విసుగు రాని మహత్తు ఎటులో సంపాదించుకొనుట? ఇది ఒక పెద్ద సమస్య అయినది. నా మనస్సుకు దారి ఎంత ప్రయత్నించినా, ఈ పేద హృదయానికి, కనుపించుటలేదు. దారిచూపి, సరిదిద్దగల మాట లాడు- మహాత్ముడు లేకపోయెనే అనిపిస్తుంది. ఆయన భావాలు తెలుసు, వ్రాసిన పుస్తకాలు చదువ వచ్చు, కాని అంతటి వాడనా నేను, అనిపిస్తుంది. బలహీనత, సోమరి తనము, ప్రపంచంలో చుట్టూ జరుగుతూ వున్న, హింసా విజయ పరంపరలు, అధికారము, బలము, ఇవన్నీ, అహింసా సిద్ధాం తాలను, దరిచేరనిచ్చునా? ఇటులనే, వినాశనమేమో? అనిపిస్తుంది. దారి దిద్దుకుంటాను, మరల దారి తప్పుతూ వుంటుంది. ఇటులనే, విజ్ఞానము లేని ఈ మనస్సు కొట్టుకలాడుతున్నది.

దారి చూపు నాథునికై వెదకు కొనుచున్నది. దారి కనుపించునని, దృఢ నమ్మక మున్నది. కాని, అంతా చీకటి. తడుముకొని నడుచు చున్నాను. సర్వసంగపరిత్యక్తగాని, దీనికి యోగ్యుడు కాడేమో? ఎటుల పరిత్యాగము? దేనిని త్యజించుట? అబ్బా, ఎన్నిలంపటములు! ఎటుల వీటి నుండి వైదొలగుట? సామాన్య మానవుణ్ణి పరిమిత లక్ష్యము సాధన వలన చేకూరును. అంత రాత్మ ప్రబోధము. ధన్యుణ్ణి. కార్యసిద్ధి వరకు, కష్టపడ సంకల్పమున్నది.

మహాత్మా! కారుణ్య మూర్తీ! నా సంకల్పమును "సిద్ధిరస్తు" అని సంకల్పించు.

అందుకో లేనేమో? ఆశీర్వదించు.

7-2-1950 V.R.G.K.M. PRASAD

ముక్త్యాల.



# ఆదర్శ దంపతులు

—కొత్త రామకోటయ్య

వరప్రదాత శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రిగారు మదరాసు తిరువళిక్కేణి (Triplicane) తూర్పు విభాగం. సముద్రతీరం. చల్లనిగాలి వీచి హాయినిగొలిపే ప్రదేశం. నాలుగోనెంబరువీడు (వీడుఅనగా యిల్లు) సాయంకాలం అయిదున్నర గంటలయింది. ఆ యింటి ముందుకు ఒకరొకరే వస్తున్నారు. కొందరు నడచి, కొందరు రిక్షాలు, ఇంకొందరు జట్కాలు మొదలగువానిమీద దిగుచున్నారు. కారులోవచ్చి ఆగి లోపలికి పోతున్నారు, దిగినవారంతా నిశ్శబ్దంగా, 4వ నెంబరు యింట్లోకి వెళ్ళుచున్నారు. ఆ యింటి ముందుభాగం, దాక్షిణాత్య సంప్రదాయం ప్రకారం పంచ అరుగులు ఉన్నాయి. ఆ అరుగులపైన కూర్చుంటున్నారు, వారందరను పేర్పేర పలకరించి, ఆదరించుచున్న వారెవరు? ఆ యింటి యజమాని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు. వారి సదానువర్తి శ్రీ ప్రణతార్తిహర అయ్యంగారు (మీడియమ్), అనుయాయులు శ్రీ విస్సా అప్పారావుగారు, అనుజీవులగు పండితులు, ఇతర యోగ మిత్రులగు లాయర్లు, డాక్టర్లు అంతా యోగ ప్రాక్టీసునకు వచ్చినవారే. కొందరు ఆరోగ్యార్థులు కొందరు యోగార్థులు, మరికొందరు యోగసిద్ధ్యర్థులు, ఇలా పలుతెగలవా రుండెడివారు.

ఆరోగ్యార్థులను ముందు పరామర్శించి, ట్రీట్ చేసి పంపించేవారు. తదుపరి యోగసిద్ధులను కోరే వారికథ, తదనంతరం యోగమిత్రులు, ముఖ్యులు కూర్చుండి మనయోగం అంటే ఏమిటి? ఇది సిద్ధిపొందేదెప్పుడు? అనే విషయములపై చర్చ సాగెడిది. రాత్రి చాలా ప్రొద్దుపోయేవరకు ఈ చర్చలు సాగెడివి, ఎందరో రోగులు బాధలతో రావటం నమస్కారం చేసికోవడం - సుఖ స్థితి పొంది వెళ్ళిపోవటం అనేకరకాల వ్యాధులతోపాటు దయ్యాలు, భూతాలు, వదలటం ఏవో "ఫినామినాలు" కనుపించటం - పూర్వజన్మ వృత్తాంతాలు వాని ప్రభావాల వర్ణనలు, ఇలాంటి వింతలెన్నో జరిగెడివి శ్రీ శాస్త్రిగారి సమక్షంలో - యీ - 4వ నెంబరు వెంకటరంగం పిళ్ళె వీధిలోని ఇంట్లో - ట్రిప్లికేన్, మదరాసులో. తరువాత శ్రీ శాస్త్రిగారు శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యకళాశాలలో పనిచేయుటకై 1939సంవత్సరముచివరిభాగమున తిరుపతికివచ్చిరి. వీరక్కడ శ్రీ కొచ్చి వెంకటేశ్వరరావుగారి ఇంట బహుకాలము నివసించిరి. ఈ యింటనే మాస్టర్ సీ. వి. వి. గారికిని మాతృశ్రీ వేంకమ్మాళ్‌గారికిని వివాహం జరిగినదట. శ్రీ శాస్త్రిగారు ఆ ఇంటనే నివసిస్తూ యోగ విస్తరణమును తిరుపతిలోనడపిరి. ఇచట సాయంకాలమునకు చాలామంది సాధకులు వచ్చేవారు అనారోగ్యముతో ఉన్న, పశువులు, గుఱ్ఱములు వగైరాలుకూడా వచ్చెడివి. సాయంకాల ప్రార్థనలో ఆ జంతువులు కూడా పాల్గొని ఆరోగ్య లబ్ధిని పొంది వెళ్ళెడివి. ఇచట శ్రీ శాస్త్రిగారెందరినో ఈ యోగానుష్ఠానపరులుగా చేసిరి. తిరుపతిలోని

ప్రేయరు హాలులో నిత్యం దర్శనంఇచ్చే యోగ మిత్రులలో పేర్కొనదగినవారు శ్రీ పరమాత్మని రాధాపతిగారు. వీరు ప్రముఖ లాయరు. శ్రీ M.N. గారి బావమరది. శ్రీ శాస్త్రిగారియొక్క యోగప్రతి బింబము, శ్రీ వెంకట సుబ్బాశాస్త్రిగారు. వీరు తెలుగు పండితులు. శ్రీ శాస్త్రిగారి యెడల చాలాభక్తి విశ్వాసములతో ఉండి యోగానుష్ఠానం చేసేవారు. వీరిరువురు, శ్రీ శాస్త్రిగారికి ఇరువైపులను కూర్చుండి ప్రార్థనాదికములను నిర్వర్తించేవారు. శ్రీశాస్త్రిగారి ఇల్లు ఎప్పుడూ తిరుపతి శ్రీవేంకటేశ్వర స్వామివారి దర్శనార్థంవచ్చి శ్రీ శాస్త్రిగారిని చూచి వెళ్ళే వారితోనూ, తమతమ రచనలను వినిపించి వారి సలహాలను పొందగోరివచ్చిన కవులతోను రచయితలతోనూ, సాహిత్య శిష్యులు, యోగశిష్యులు మొదలగు శిష్యసందోహాలతోనూ, కుమారులు, కుమార్తెలు, బంధు మిత్రులతోనూ చాలాకోలాహలంగా ఉండెడిది. వారి సతీమణి శ్రీమతి వేటూరి మహాలక్ష్మమ్మగారు శ్రీ శాస్త్రిగారి మనసు నెరిగి వర్తిల్లిన సహధర్మచారిణి. గురుదేవులు శ్రీ మాస్టర్ C.V.V. గారు ఈమెకు తమంతటతామే అభ్యర్థన లేకయే "ఇనీసియేషన్" అనుగ్రహించి యిచ్చిరి. ఆ మాతృశ్రీ ఆదరణ, యోగసాధకుల యెడ చూపే వాత్సల్యము సాధకులకు మరువరానిది.

## వరప్రదాత

మద్రాసు :- ట్రిప్లికేన్ 4వ నెంబరు వెంకట రంగం పిళ్ళేవీధి, ప్రార్థనా మందిరములో శ్రీశాస్త్రి గారు కూర్చుండియున్నారు. జరుక్‌శాస్త్రిగారు (1935 సం॥) వచ్చి నమస్కరించారు. చాలా బక్కచిక్కిన ఆకారం. శుష్కించిన సరస్వతిలా ఉన్నారు. నీరసంగా నడచివచ్చి నమస్కరించారు. ఈ తీరుచూచి శ్రీశాస్త్రిగారు ఎంతో ఆదరంతో "ఏమి నాయనా! ఎవరు నువ్వు? రా కూర్చో" అన్నారు, తనపేరు చెప్పినాడు. ఆయనగారు తెలుగు విద్వాంసుడు. చిట్టిగూడూరులో చదివివచ్చిన పండితుడు. ఒక సంవత్సరంగా చాలా అనారోగ్యంతో బాధపడుచుండిరి. డాక్టర్లు "క్షయ" యని వైద్య విధానం నడిపిరి, అదియేమీ ఉపయోగించలేదు. చిక్కి శల్యావశిష్టుడై యున్నాడు, శ్రీశాస్త్రిగారికి తన అనారోగ్య విషయం చెప్పెను. తనను శ్రీ చెళ్ళపిళ్ళ నరసింహంపంతులుగారు పంపించినా రని చెప్పిరి.

శ్రీశాస్త్రిగారు :- నరసింహంగారు కుశలమా! వారేమన్నారు?

ఆయన :- ఆ....క్షేమమే, నరసింహంగారు నన్ను తమవద్దకు పంపుచూ రెండు మూడు సలహాలిచ్చారండి. శ్రీశాస్త్రిగారికి సాహిత్యరంగములో కొన్నిరకాలగు అభిరుచులున్నవి. నీవు పండితుడవు గదా! నీకుకొన్ని ప్రత్యేకాభిప్రాయములుంటాయి. అయితే శ్రీశాస్త్రిగారు చెప్పే సాహిత్యవిషయాలు నీకు సమ్మతం కానప్పుడు నీవు ఆక్షేపించకుము, వారు చెప్పినదానికి సరేఅను. లేకుంటే వారికి చిరు కోపం అని చెప్పేరండీ!

శ్రీ శాస్త్రిగారు:- "అది నిజమే! అయితే ఇప్పుడు నేను నీకు పర్మిషనిస్తున్నాను. నీకు నచ్చనపుడు నేను చెప్పిందానిని కాదని ఎదురుమాట్లాడు. వాదించు, ఏం ఫరవాలేదు. సర్దుకొందాము" అని నవ్విరి.

ఆయన:- రెండో విషయము. శ్రీ శాస్త్రిగారి "యోగా ట్రీట్‌మెంట్" మహత్తువల్ల నీవారోగ్యవంతుడవు కాగలవు. వారు నిన్ను మందు పుచ్చుకో నక్కర లేదందురు. నీ వందుల కెదురు పలుకకు. ఎదురాడిన వారు సహించరు. వారి ఎదుట మందు పుచ్చుకొన కుండుట కొడబడి రా. తరువాత ఇంటి వద్ద మందు పుచ్చుకొనినా ఫరవాలేదు, అన్నారండీ! నరసింహంగారు.

శ్రీ శాస్త్రిగారు:- (నవ్వి) ! నీవు రహస్యంగా మందు పుచ్చుకోనేలయ్యా! నీకు పుచ్చుకోవాలని తోస్తే పుచ్చుకో.... దానికి అనుమతి ఇస్తున్నాను. నీ శరీరం చాలా శుష్కించి ఉన్నది. మంచి ఆహారము తీసుకో. పాలు, తేనె వగైరాలు తీసుకో, మందు తీసుకో అయితే ఒక పద్ధతిపైన మాత్రమే మందును వాడు. నీవు పాలను పుష్టికై తీసుకొంటున్నావు గదా! అలానే పాల మాదిరిగా ఇది యొక పుష్టినిచ్చే ఆహారము——అనే భావంతో మాత్రమే మందును వాడుము. ఆ మందు వాడుచున్నగాని ఆరోగ్యం లభించదు- అనే భావంతో మాత్రం మందులను సేవించకుము. కొలది కాలానికి ఆ మందు అక్కర లేదనే భావము నీకే తోచును. అపుడు నీవే మానివేయ గలవు.

ఆయన:- మూడో విషయం—— "సిగరెట్లు వగైరా చెడు అలవాట్లు వారికి నచ్చవు," అన్నారండీ! నరసింహంగారు, సిగరెట్లు త్రాగుట మానితిని. డాక్టర్లు సిగరెట్లు త్రాగుట క్షయరోగికి ప్రమాద మన్నారు. ఆ భయం వల్ల మానానండీ!

శ్రీ శాస్త్రిగారు:- భయంవల్ల మానక్కర లేదు గాని అసలట్టి దురలవాట్లు వదలివేయుట మంచిది. సరే! నీ సంగతి చూద్దాం! కనులు మూసికొని కూర్చుండి నమస్కారం చేసికొనుము.

ఆయన:— నేనేమని నమస్కారం చేసికొనాలి? ఎవరికి? మంత్రమేమిటి?

శ్రీ శాస్త్రిగారు:- "కరుణా సముద్రుడగు ఆ పరమేశ్వరుని దివ్యానుగ్రహము నా మీద ప్రసరించును గాక!" అని అనుకొనుము!

ఆయన అట్లే గావించిరి. కొంత తడవు కనులు మూసికొని కూర్చుండిరి.

వారి అనుభూతి:- అదివరకు ఎంతో ఉసూరుమంటూ ఉన్నవాడు అలా నమస్కారము చేసికొనగానే వారి శరీరములో ఒక క్రొత్తశక్తి ప్రవేశించి నట్లున్నూ ఆనందము ఉత్సాహము తనలో వెల్లివిరిసినట్లున్నూ తోచింది. తను ఒక రోగిననే భావం ఒక ప్రక్కకు తప్పుకొంటునట్లు తను ఆరోగ్యవంతుడననే భావం ఇంకొక ప్రక్కన ప్రకటితం అగుట గుర్తించిరి. తదను కూలంగా ఈ వేదమంత్రం ఆయనకు గుర్తుకు వచ్చినది.

"అసతోమా సద్గమయ
తమసోమా జ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ॥"

ఈ మంత్రం ప్రభావం తన కన్వయించినట్లు తోచినది. చీకటిలో అలముకొన్న నీరస భావం తొలగి, శక్తి ఉత్సాహాలనే కాంతిపుంజాలు తనలో ప్రసరించు చున్నాయని మృత్యు రూపమున వ్యాధి నివారణ అయి అమృత రూపమగు ఆరోగ్యలబ్ధిని గాంచుచున్నా నన్న తృప్తి తనకు కలిగింది.

శ్రీ శాస్త్రిగారు:— ఏమయ్యా! ఎలా ఉన్నావు? ఏమి గమనించావ్?

ఆయన:- చాలా ఆశ్చర్యకరంగా జరిగింది స్వామీ! ఎంతో ఉత్సాహంగా ఉంది. పై విధంగా మంత్రం గుర్తుకు రావడం వగైరా అనుభూతి విశేషాలను వివరించేరు.

శ్రీ శాస్త్రిగారు:- "ఫరవాలేదు మంచిదారిలో పడ్డావ్ నాయనా! ప్రతిరోజు ఇలానే ప్రార్థనచేసుకో సుఖంగా ఉండు" అన్నారు.

ఒకటి రెండు వారాలలో ప్రార్థనకు వేళకు వచ్చి పాల్గొంటూ క్రమంగా కోలుకో సాగారు. నెల అయ్యేసరికి సంపూర్ణ ఆరోగ్యం పొందిరి. తదు

పరి ఒకరోజు ఉదయం ప్రార్థన మందిరంలో శ్రీ శాస్త్రిగారు కుర్చీలో కూర్చుండి యుండిరి. వారి ఎదుట ఈయన చాపపై కూర్చుండిరి.

శ్రీ శాస్త్రిగారు:- యాజ్ఞవల్క్య స్మృతిలోని ఒక సూత్రాన్ని చదివి- "ఏమయ్యా ఈ సూత్రము నకు అర్థమేమిటో ఆలోచించు" అని అన్నారు.

ఆ సూత్రార్థము "మానవుడు సర్వశక్తియుతుడై సంతాన వంతుడై చతుర్విధ పురుషార్థ సాధకుడు కావా"లని భావం. ఆ భావం ఆయనకు అర్థ మయ్యింది. తాను క్షయరోగి. ఇప్పుడే కోలుకుం టున్నాడు. అందువల్ల సంసారిగా నుండ నసర్థు డనుగదా! సంవత్సరంగా ఏకాంతవాసం చేస్తు న్నాడు. ముందు గూడా తనకు ఏకాంత వాసమే పథము— అందువలన జీవితం అంతా వ్యర్థమేగదా? అన్న భావాలు పొర్లి దుఃఖం ముంచుకొచ్చింది. కన్నీళ్లు కార్చసాగారాయన.

శ్రీ శాస్త్రిగారు :- "ఎందుకు ఏడుస్తావు? ఇచట ఎవ్వరూ ఏడ్వరాదు, ఏడ్వకూడదు. ఇదిగో చూడు! నాయనా! తిన్నగా కూర్చుండి నమస్కారం చేసికో".

ఆయన :- అదేమిటండీ నేను కూర్చుండియే యున్నానుగదా! కూర్చుండమన్నారేమటి?

శ్రీ శాస్త్రిగారు :- "శరీరంతోపాటు మనస్సును కూడ ఇటు ఆముఖం చెయ్యి. చచ్చుప్రశ్నలు వేయక కూర్చో....కనులుమూసికొని లోన ఏమి జరుగుతుందో గమనించు" అన్నారు.

ఆయన అలానే కనులుమూసికొని గమనించ సాగిరి. క్రమంగా తాను లోగడ అనుభవించిన దుఃఖభారమంతా తెగిపోయి తెరతీసినట్లుగా అయి నది. తాను రోగినని లోగడ అనుకొన్న భావము విడిపోయినది. "నేను ఇప్పుడు సంపూర్ణ ఆరోగ్య వంతుడను" అను భావము ఆయనలో నెలకొన్నది. అప్పుడు శాస్త్రిగారు తనను ఆశీర్వదించుచున్నట్లు —ఏదో శాశ్వతవరమును ప్రసాదించుచున్నట్లు తోచింది. కనులుతెరిచి శ్రీ శాస్త్రిగారి చరణము లను తాకి నమస్కరించిరి.

శ్రీ శాస్త్రిగారు :- నాయనా! నీవిక నీ యింటికి వెళ్ళుము. నీ పనులన్నిటియందు నిర్భీతుడవై పాల్గొనుము. మధ్యాహ్నము నాకొకసారి కను పింపుము. రాత్రికి ప్రయాణమై మీ గ్రామమగు బందరు వెళ్ళి నీ కుటుంబమును తీసికొనిరమ్ము. నేనున్నాను. భారము నాపై నుంచుము." అని తెలవిచ్చిరి.

ఆయనగారు మద్రాసునగరములోని తన సాహితీ మిత్రులను పరామర్శించి కాఫీహోటలులో మధ్యాహ్నం కాఫీ, ఫలహారం వగైరాలు సేవించి తమలపాకులకిళ్ళీ వేసుకొనిరి. సిగరెట్టు కాని ముట్టించిరి. అంతలో శ్రీ శాస్త్రిగారు మనస్సు లోనికి రాగా వెంటనే పారవైచి తిరిగి శాస్త్రిగారి ఇంటికి వచ్చిరి.

శ్రీ శాస్త్రిగారు :- ఏమయ్యా! నీ కొరకెదురు చూస్తున్నాను! ఎలాఉన్నావు?

ఆయన ఉత్సాహాన్ని, తృప్తిని వెలిబుచ్చిరి.

శ్రీ శాస్త్రిగారు:- సరే! మంచిది. తాంబూల ములో పడ్డావు. బాగుంది. పెడ్లికొడుకులా నడుపు. నీకు ఉద్యోగం లభించే ఏర్పాటుకూడ ఆలోచిం చాను. నీవు వెళ్ళేటప్పుడు గుంటూరులో ఆగి ఫలానావారిని చూడు. బందరులో ఫలానావారిని చూడు. నీ ఉద్యోగంసంగతి వారితో చెప్పియుం చాను. వారేర్పాటు చేయగలరు. సరే! మంచిది.

సుఖంగా వెళ్ళిరా! ఈ ముసలాణ్ణి జ్ఞాపకం చేసి కొంటుండు-

ఆయన :- "స్వామీ! ఎంతమాట ఈ నాలోని ఉచ్ఛ్వాస నిశ్వాసాల స్పందనమే తమరుగా భావిస్తు న్నాను. ఆజీవితమూ తమకు కృతజ్ఞుణ్ణి." అని ఆయన శాస్త్రిగారికి వందన మాచరించి సెలవు తీసుకొనివెళ్ళిరి.

పై విశ్వాసాన్నే శ్రీ శాస్త్రిగారిపట్ల ఆ మిత్రులు ప్రకటిస్తూ [ఇప్పటికీ విజయవాడలో ఉన్నారు.] పై విషయాన్ని వారే స్వయంగా వివరించిరి.

## వాక్ శుద్ధి

మదరాసులో ఉంటున్న రోజులలోనే శ్రీ శాస్త్రి గారి ఇంటికి వారి బంధువు లొకరొచ్చారు. కుశల ప్రశ్నాదికములయినవి. వచ్చినవా రిలా అన్నారు. "నాకు చాలా సంవత్సరములనుండి కడుపునొప్పి గ్యాస్ట్రిక్ అలసర్. వైద్యులు పరీక్షించి ఆపరేషను చేయటం ఒకటేదారి అన్నారు. మద్రాసులో చాలా గొప్పడాక్టర్లుంటారు. మద్రాసువెళ్ళి నా జబ్బు కుదుర్చుకొని రాగలను. అని ఇటు వచ్చేను" అని అన్నారు. ప్రార్థనవేళ అయినది. యోగ మిత్రులు విచ్చేస్తున్నారు. ఆయనవంక చూస్తూ;

శ్రీ శాస్త్రిగారు :- "సరే! మీ జబ్బు కుదుర్చుకొని వెళ్ళగలరు. కూర్చోండి. మీరుకూడ నమస్కారం చేసుకొనండి." అని అన్నారు. అంతే. ఆయన కొలదిరోజులు ప్రార్థనకు వచ్చి కూర్చొనే వారు. క్రమంగా ఆరోగ్యం అంతా సరిఅయ్యింది. "ఆపరేషన్" మాట తలపెట్టలేదు. సుఖంగా ఇంటికి ఆరోగ్యాన్ని పొంది వెళ్ళారు. "అంతా మీ వాక్ శుద్ధి" అని అన్నారు వారు. ఇంకొక దఫా మరొకరొచ్చారు. వారిపేరు కొండుభొట్లుగారు. శ్రీ శాస్త్రిగారికి బావమరిది వరుస—వారికి జలోదరము. "ఆపరేషన్" చేయించుకొనాలని వచ్చిరి. శ్రీ శాస్త్రిగారి శిష్యులయిరి. ఆపరేష నక్కర లేకయే పోయెను. కొండుబొట్లుగారిని, కుండ పొట్టగారని శ్రీ శాస్త్రిగారు పిలిచేవారు. అలాంటి దంతా తగ్గిపోయి వారు మంచి ఆరోగ్యవంతు లయిరి.

(సశేషం)



గీ. నేనుకారణముగ నెవ్వడేని సంక
టం పడని రీతి నన్ను వర్తింపజేయు
మాగ్రహ మసూయ గర్వమిత్యాదులయిన
చెడుగు లుడిగింపు మిక నన్ను జెందకుండ! ॥ వే.ప్ర ॥

# బాష్పాంజలి

**–డా॥ వేటూరి ఆనందమూర్తి**

ఏ అనుబంధం తోసుకు వెళ్లిందో నేను చెప్పలేను గానీ సరిగ్గా అదేరోజున పాండిచ్చేరి నుండి మా మిత్రుణ్ణి చూడాలని తోచి మధురకి ప్రయాణమయ్యాను, మే 27 ఉదయం అక్కడ గడిపి కోదండ రామయ్యగారితో తనివితీరా మాట్లాడుకొని తిరిగివచ్చేద్దామని! ఆయన ఊర్లో లేరు. తిరుపతిలో అన్నమాచార్య ఉత్సవాల్లో పాల్గొనడానికి రెండు మూడు రోజుల క్రితమే బయలుదేరి వెళ్లారట. 'నిన్ననే ఉత్తరం వచ్చింది. రేపు ఉదయానికల్లా వచ్చేస్తారు. ఈరోజు ఆగండి రేపుచూచి వెళ్దురు గాని' అని మా మిత్రుని శ్రీమతి, పిల్లలు అంటే సరేనని ఆగిపోయాను.

'రేపు తప్పకుండా వస్తారుగా' అని లోకరీతిని నేనంటే 'తప్పకుండా వచ్చేస్తారు' అని వాళ్లూ అన్నారు. ఏవో కబుర్లు చెప్పుకుంటూకూచున్నాము. పిల్లలు తెచ్చిస్తే కొలాలంపూరు తెలుగు సభల సందర్భంలో ఆయనమద్రాసులో నిలబడిపోయి బాధపడి రాసినవ్యాసాన్నీ, పత్రికలో 'యోగభ్రష్టు'డనే పేరున ప్రకటితమైన కవితనీ అక్కడికక్కడే చదివాను. ఏప్రెలు 12వ తేదీ చెన్నపురి ఆంధ్ర మహాసభా భవనంలో కలుసుకొన్ననాటి ముచ్చట్లు, "మణిమంజరి" షాణ్మాసిక తొలిసంచిక ప్రూఫుకాపీని చూచి ముచ్చటపడి పరిశోధక మండలి పక్షాన మున్ముందు జరుగవలసిన కార్యకలాపాల్ని గూర్చి చర్చించుకోవడం వగైరా మాట్లాడుకొంటున్నాము. ఒక గంట సేపయిందో లేదో ఎనిమిది ప్రాంతాలకి ఫోనొచ్చింది. గుండెలు పగిలే దుర్వార్త విన వచ్చింది. ఇంటిల్లపాదీ స్తంభించి పోయాం. ఏమి చేయగలం? చిక్కిన బస్సు అందుకొని హుటాహుటి పయనమై అందరం అర్ధరాత్రికి చిత్తూరు చేరుకున్నాం. అప్పటికే అంతా అయిపోయింది. మనిషిని చూసి మాట్లాడిరావాలనుకొన్న నాకు కళేబరాన్ని చూచి కళ్ల నీళ్లు కుక్కుకు రావలసిన దుర్గతి పట్టింది. ఎట్టి దుర్విధి! అయిన వాళ్ల దుఃఖపు వెల్లువను ఆపడమెట్లాగ? కాలమే ఆ గాయాన్ని మాన్చాలి.

పితృపాదులు ప్రభాకరశాస్త్రిగారి ప్రియాంతేవాసుల్లో ముఖ్యులు తిమ్మావఝుల కోదండరామయ్యగారు. తిరుపతిలో ఉన్న రోజుల్లో ఆయన తరచు మా యింటనే ఉంటూ ఉండేవారు. మంచి ప్రజ్ఞాశాలి. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం మూడూ సమపాళాల్లో ఉండేవి ఆయన ప్రజ్ఞలో. ముద్దులు మూటగట్టే దస్తూరీ. చదువుల్లో ఎప్పుడూ ఆయనదే అగ్రశ్రేణి. అంతేకాదు అనేక సందర్భాల్లో రికార్డు బ్రేక్ చేసిన ప్రజ్ఞ ఆయనది. పట్టుదలతో కృషితో ప్రతిభతో క్రమాభివృద్ధిని సాధించి ఆచార్య పదవి నధిష్టించి ఆంధ్ర సాహిత్య లోకాన్ని అలరింప జేసిన మనీషి ఆయన. ఆయనగారి కమ్మని కవితలు, వ్రాతలు, సాహిత్య ప్రసంగములు, ప్రవచనములు, పరిశోధక వ్యాసములు, ఉపన్యాస

ములు ఆంధ్ర సరస్వతి నలంకరించిన వెలలేని సొమ్ములు. విద్వాన్ పరీక్ష పూర్తిచేసిన తరువాత ఒక సందర్భంలో పితృపాదులు ఈయన్ని ఒకరికి పరిచయం చేస్తూ ప్రకటించిన భావాలు నాకు గుర్తు- "ఈ చిరంజీవి ప్రతిభాశాలి. ఈతని మూలమున భావి కాలమున ఆంధ్ర సాహిత్య సరస్వతి అపూర్వాలంకారముల నెన్నో సంతరించుకొనవలసి యున్నది. ఆంధ్రసాహిత్యగౌరవ భారము నీతడెంతగానో భరింప వలసి యున్నాడు". గురుదేవుల ఆశీర్వచనం ఆయనయెడ ఫలించింది. వ్రాతనుబట్టే ఎరిగి వ్యక్తిని చూడనివారికి తిమ్మావఝుల వారంటే ఒక సంప్రదాయస్ఫూర్తి కలిగి ప్రౌఢ వయః పరిపాకంతో పరిఢవిల్లే ఒక పరిణతమూర్తి గోచరించేది. 'మీరా కోదండ రామయ్యగారంటే' అని మనిషిని చూసిన తరువాత విస్తుపోయిన సాహిత్యాభిమాను లెందరో ఉన్నారు.



స్వర్గీయ
తిమ్మావఝుల కోదండరామయ్యగారు

నిండైన విగ్రహం, యూనివర్సిటీలో ఇంకా ఐదారేళ్లు సర్వీసుండగా, పూనుకొని కొంతవరకు సాధించిన కుమార సంభవ కావ్య వ్యాఖ్యా రచనాదులట్టే ఉండగా, ఎన్నెన్నో చేయాలని తానూ తన తోడి సాహితీ బంధువర్గమూ ఉవ్విళ్లూరుతూనే ఉండగా, పెద్దవయసుకాకున్నా మృత్తివచ్చి మీదపడి గ్రసించడం దాని ఓర్వలేని తనాన్నే ప్రదర్శించిందనాలి. మృతి ఈ భౌతికానికే కాని ఆ ప్రజ్ఞామూర్తికి కాదని ఎంత సముదాయించుకొన్నా విషాద యోగం తప్పడం లేదు.

శ్రీ ప్రభాకర పరిశోధక మండలిసభ్యుల్లో ముఖ్యుడుగాను వాఙ్మయ యోగపరిశోధనపత్రిక 'మణిమంజరి' సంపాదక సలహామండలిలో ఒకరుగాను మాకు అండగా ఉండి మాతో అనేకవిధాల సహకరిస్తూ ప్రోత్సహిస్తూ ఉండిన మా కోదండ రామయ్యగారు లేనిలోటు ఎన్నటికీ తీరేదికాదు. అశ్రుతర్పణాలిస్తూ, ఆయన సాహిత్య సేవనుగ్గడిస్తూ, ఆయన స్మృతికి అంజలి ఘటిస్తూ, వ్యక్తిగతంగాను, పరిశోధకమండలి పక్షనను మా సంతాపాన్ని తెలియ జేస్తున్నాము. వారి ఆత్మకు శాంతి కలగాలనీ, ఈ విషాదాన్నెదురుకొనే గుండె నిబ్బరం వారి కుటుంబసభ్యుల కనుగ్రహించాలనీ పరమేశ్వరుణ్ణి ప్రార్థిస్తున్నాము.



# గురుస్మృతి

- తిమ్మావఝల కోదండరామయ్య

మాదృశాంతేవాసిమండలంబున కింక
    గతియేది సిద్ధ సంకల్ప చరిత!
పరిశోధకాచార్య పదవి కింకెవ్వార
    లర్హులు కవిపండి తాగ్రగణ్య
కావ్య పరిష్కార కలనంబునకు నెవ్వఁ
    డున్నాడు దివ్య వ్యుత్పన్న భావ!
ప్రాచీన దివ్య ప్రబంధ సంబంధ స
    ముద్ధారమున కెవ్వఁ డిద్ధచరిత!

పలుకు సొంకము, నుడితీరు, కలికితనము
తెలుగు మఱుఁగులు, మెఱుఁగులు తీయఁదనము
పుక్కిలింపఁగ దివ్య తోద్బోధ కవితఁ
జెప్పఁగలవార లెవరింక సిద్ధ పురుష!

గురుమూర్తీ! భవదాదరామృతరసాకుంఠ ప్రబోధంబులున్
సరసాహ్లాదక శబ్ద శాస్త్ర కవితా సంశోధనా పద్ధతుల్
పరమార్థ ప్రవణైక దివ్య రచనా పాండిత్య శౌండీర్యముల్
కరవై పోయెను మాకు శిష్య తతికిన్ గన్పింపకే పోయితే.

శ్రీనాథ కవితా విశేషంబుల వెలార్చు
    పండితుం డీనాట నుండఁ డింకఁ
జెదపుర్వులకు భుక్తి యొదవించు తాళప
    త్రంబుల దులుపు నే దక్షుఁ డింక

జాతీయ కవితావిచార ప్రచారముల్
సేయు నే కవితా ప్రసిద్ధుఁడింక
చారిత్ర విషయ విజ్ఞానంబు నామూల
మెఱిఁగించు నే పండితేంద్రుఁ డింక
జాటుపద్యంబు లెవ్వాడు సంతరించుఁ
బూర్వకృతులకు నెవ్వాడు పొలుపు గూర్చుఁ
బీఠికల వెలయించు నే విబుధవర్యుఁ
డింక నీ చన్న వెనుక ప్రేమాంకమూర్తి!

'జగమున నొక్కఁడున్ మృతివశంవదుఁడౌటకు నోర్వఁజాలఁ డెం
దగవున నైన మృత్యుగతి దౌష్ట్యముమాన్పదఁ దన్పెదన్ మహా
జగ మమృతత్వసీధువున జాలుల వార్చి' యటంచు బల్కు నీ
పగ యయి మృత్యుదేవి పయి పాటున పో టొనరింప నోటు! పో!
యుగములు చన్నఁగాని మఱి యుండఁగఁ బోలని యోగిసత్తమా!

జగమే యాత్మకుటుంబమై యఖిల విశ్వ శ్రేయమే యాయమై
జగదారాధ్యుఁడు గాంధిదేవుని యహింసా తత్త్వమే మార్గమై
సొగసుల్ నింపఁగ నీదు జీవితము సంశోభించె దిగ్వ్యాప్తమై
యుగముల్ చన్నునుగాని పుట్టని మహాయోగీ! ప్రణామాంజలుల్.

బసవపురాణ ప్రబంధంబు పుణ్య మెం
తదియొ మీచేతి సొం పొదవి కొనియె
క్రీడాభిరామంబు వేడుక యెంతదో
మించు పీఠికను వ్రాయించు కొనియె
సోమన గ్రంథ మే నోము నోచెనొ వ్యాఖ్య
వెలయించు కొనియె సంప్రీతి యొసఁగ
మల్లనగణితంబు మహిమ యేలాటిదో
సమకూర్చుకొనె నొక్క సాధురూప
మాంధ్రపత్రిక, భారతి, యాంధ్ర వార
పత్రిక, కృష్ణ మొదలగు పత్రికలవి
యేమి నోములు నోచెనో యెఱుఁగ మేము
నీదు రచనల జీవాలు నించుకొనియె!

[ తమ గురుపాదులమృతికి దురపిల్లి వారి ప్రియాంతేవాసి కోదండరామయ్యగారు అలనాటి పత్రికలో అర్పించిన పద్యసుమాంజలి యిది! ]

# ఓ గురుమూర్తీ!

తిమ్మావఝుల కోదండరామయ్య

శ్రీ గురుదేవులు వేటూరి ప్రభాకరశాస్త్రివర్యుల నిర్యాణవార్త విని యున్నచోటనే కూలబడిపోయి నాను. శరీరమెల్ల ఒకమాటు వణకిపోయినది. బుద్ధి స్తభించిపోయినది. వాత్సల్యముతో శిష్యు లను చేరదీసి బుజ్జగించు పితృసముని కోల్పోయిన మాదృశ శిష్యవర్గమునకిక దిక్కేది? వారి మృదు మధురములగు వాక్సుధను గ్రోలు భాగ్యము మాకిక లేదు. వారి యొడిలో తలదాచుకొని మనశ్శాంతి బొందు నదృష్టము మాకిక లేదు. శరీరరుగ్మతల దెలిసికొని యారోగ్యము బొందు భాగ్యము మాకిక లేదు.

"నిండుమనంబు నవ్యనవనీత సమానము" వారిది. కరుణామయము వారి హృదయము. నవ నవోన్మేషము వారి ప్రతిభ. వారి చిత్తము భగవ దంకితము. వారి వాక్కులు గాంధినామాంకిత ములు. వారి కార్యములు భగవత్ప్రీతికరములు. ఆర్తుల నాదుకొనుట వారి నిత్యవిధి. ఉదయము లేచినదిమొదలు రాత్రి పదిగంటలవఱకును వారు నిర్విరామముగా నేతెంచు రోగులను పరామర్శించు చునే యుందురు. విసుగులేక భగవత్కార్యము నెఱవేర్చుటలో వారి కానందము. ఒక యార్తుని ప్రాణము రక్షింపబడినచో వారికదియే పదివేలు. సాహిత్యానందము వారి భగవదనుభూత్యానంద ములో ఒక బిందువుమాత్రమే. సాహిత్యమార్గ ములో వారనుభవించిన యానందము వారితరుల కానందము చేకూర్చి దానితో తాము పొందిన యానందములో నొక రేఖమాత్రమే.

తమ జీవితకాలములో నమృతత్వమును సాధింప సాధనసల్పిన మహర్షులు వారు. తమ జీవితకాలములో ననేకులకు జీవనప్రదానము చేసిన మహాయోగులు వారు. విశ్వశ్రేయము వారి కాంక్షి తము. సర్వమానవ సౌభ్రాత్రము వారి యాదర్శము. అహింస వారి మార్గము. గాంధిదేవుడు వారి యాదర్శమూర్తి. భగవత్ప్రాప్తి వారి లక్ష్యము.

వారు సాహిత్యమునకు జేసిన సేవ యపారము. పల్లెలలో నటకలపై బూజుపట్టి పురుగులకు భుక్తి పెట్టుచున్న తాళపత్రగ్రంథముల నెన్నిటినో వీరు వెలుగులోనికి తీసుకొని వచ్చిరి. మహాకవీశ్వరుల కృతిరత్నములకు జక్కని విలువగట్టగల దిట్టలు వీరు శ్రీనాథుని కవిత్వము వీరికి ప్రాణము. తెలుగుదేశము నలుమూలల దిరిగి తెలుగుతనమును వీరు చక్కగా జీర్ణించుకొనినవారు. శ్రీ తిరుపతి వెంకటకవుల శిష్యులలో వీరు ముఖ్యులు. తెలుగు సాహితీసౌధనిర్మితి కార్యములో వీరు మోసినది వేరొకచో జెప్పుకొనినట్లు బురదమట్టి కాదు. బంగారు మట్టి. వీరి పద్యకృతులు ముగ్ధమనో హరములు. వీరి కృతులలో వీరికి తను చిన్న నాటి చేష్టలపై ప్రీతి మెండు. మూన్నాళ్ళముచ్చట, కడుపుతీపు, కపోతకథ, చిన్ననాటి చేష్టలు వీరి

పద్యకృతులు. భాసుని ప్రతిమా నాటకమునకు వీరు కావించిన తెలుగుసేత హృద్యతరము.

వీరి 'శృంగార శ్రీనాథము'— శ్రీనాథుని కవితా మూర్తి కొక మధుర నీరాజనము. బసవపురాణ పీఠిక పండితకవి విమర్శకలోకమునకు ఆమని విందు. క్రీడాభిరామమునకు వీరు రచించిన పీఠిక తెలుగుతల్లికి విలువగట్టరాని తొడవు. ప్రబంధ రత్నావళి, కేయూరబాహు చరిత్ర, చారుచర్య మొదలగునవి వీరు వెలువరించిన ప్రాచీన గ్రంథములు. వీరి చాటుపద్యమణిమంజరి తెలుగు వారికి ఒక రత్ననిధి. వీరి పరిష్కరణము నిష్కృష్టము. తెలుగుసాహిత్యలోకములో వీరి పలుకుబడికి చెల్లుబడి యధికము. వీరి తెలుగు మెఱుగులు తెలుగుతనమునకు కాణాచి. రంగనాథరామాయణము, నన్నిచోడుని కుమారసంభవము వీరి పరిష్కరణముతో సర్వాంగసుందరములైనవి. వీరి రేడియో ఉపన్యాసములు వ్యావహారికభాషకు వరవడులు.

ప్రాచీన గ్రంథపరిష్కరణ సందర్భమున వారి ప్రతిభ నిశితముగా అప్రతిమానముగా వెలయు సందర్భము లనేకములు నేనెఱుగుదును. అనేక సందర్భములలో వారికడ నంతేవాసినై వారితో గ్రంథపరిష్కరణాది కార్యములలో బనిచేయు చుండిన సందర్భములలో వారి పాండిత్యపులోతును, వారి ప్రతిభాసామర్థ్యమును గుర్తింపగలిగిన మహదవకాశము నాకు లభించినది. వారి శిష్యుడుగా నీచెల్లనికాసు చెల్లుబడియగుటకు వారి దివ్యానుగ్రహమే కారణము. వారి దివ్యనామస్మరణము శిష్యులకు మాకు నిత్యపారాయణము. వారి వాక్యములు మాకు శిరోధార్యములు. వారి బోధలు మాకు దివ్యోద్బోధములు. మా జీవితములు తదంకితములు. వారు మాకిక లేరు. లేకపోవుటయేమి? సత్యమున్నచోట, సాహిత్యమున్నచోట వారుండనే యున్నారు. వారి వాణి భౌతికముగా మూగవోయి యుండవచ్చును. అది దివ్యవాణియై మా శ్రవణములకింకను వినిపించుచునే యున్నది. మా గురుమూర్తి దివ్యమూర్తి అదిగో! మాచెంతనే మా కన్నులముందరనే మమ్ముల నాశీర్వదించుచునే యున్నది. 'చిరంజీవ' యని యా దివ్యమూర్తి పలుకుచునేయున్నది. దివ్యమూర్తీ! గురుదేవా! మాకిక నెవరుదిక్కు? సాహిత్యసరస్వతికిక గతి యేది?

—ఆంధ్రపత్రిక 3-9-1950. ❋

---

నేనను నా యధమాధమ
నిర్వాహము తొలగించి
నీలో నను గలపుకొని
నెగడగదే పరమాత్మా!

వే. ప్ర.

# వ్యావహారిక భాషకు వేటూరి వారి తోడ్పాటు

- డాక్టరు పోచిరాజు శేషగిరిరావు

చెప్పుకోదగిన సాహిత్య పీఠాన్ని అధివసించిన ఒక సాహితీవ్రతునితో ప్రస్తావిస్తుండగా శ్రీ ప్రభాకరశాస్త్రిగారి ప్రస్తావన వచ్చింది. అప్పుడు నేను శ్రీ శాస్త్రిగారు వ్యావహారిక భాషావాదమునకు, వ్యాప్తికి, చేసిన దోహదాన్ని గురించి ముచ్చటించటం జరిగినది. ఆయన విని ఎంతో విస్తుపోయి, 'శాస్త్రిగారు వ్యావహారికభాషావ్యాప్తికి దోహదం చేశారా' అన్నారు. కొన్ని దశలుగా భాషలో మునిగి తేలుతూ కృషి చేస్తున్న వాళ్ళే ఈ ప్రశ్న అడిగారేమిటబ్బా! అని ఆశ్చర్యపడ్డాను. ఆయన గతించిన మూడు దశలకే తెలుగువారు ప్రభాకర శాస్త్రిగారొనర్చిన కృషిని మరచిపోయారా అనుకొని నాలోనేను మధనపడ్డాను. జాతిని, భాషను జాగరితం చేసి అర్ధశతాబ్దికి పైగా కృషి చేసిన మహనీయులనే మరచిపోతున్నామే అనిపించింది నాకు. ప్రచార యుగంలో స్థితిగతు లిట్లానే ఉంటాయేమో! భాషామూల్యాల కోసం తనువును. ధనమును నిరపేక్షంగా ధారపోసిన మహానుభావులు మరిచిపో దగినవారా!

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్యావహారికభాషా వాదమునకు పట్టుగొమ్మ. తొలుదొల్త వ్యావహారిక భాషావ్యాప్తికై శ్రమించి, ఆ వాదమును ప్రతిపాదించినవారిలో గిడుగు వేంకటరామమూర్తి పంతులుగారు ప్రధానులు. వీరికి 1907లో విశాఖపట్టణం కళాశాలాధ్యక్షులు పి. టి. శ్రీనివాసయ్యంగారూ, అప్పటిలో విద్యాశాఖాధికారిగా వ్యవహరించిన జె. ఏ. యేట్స్‌దొర కుడియెడమలు. ఆ నాళ్ళలో ఈ ఉద్యమమునకు ఎట్టి ప్రోత్సాహమూ లభింపలేదు.[1] 'నేనూ, నా మిత్రుడు గురజాడ అప్పారావూ, మాకు తోడుగా మరి ఇద్దరూ మాత్రమే యీ ఉద్యమం ప్రారంభించినా'మని రామమూర్తి పంతులుగారే అన్నట్లు క్రొవ్విడి లక్ష్మన్నగారు వ్రాసినారు.

శ్రీ వేటూరి వారి మాటలను చిత్తగించండి. 'శ్రీ రామమూర్తి పంతులుగారి వాదముతో నేను సంపూర్ణముగా ఏకీభవించిన వాడను, 1912-13 ప్రాంతములో వాడుక భాషలోనే నేను గ్రంథములు ప్రకటించినాను. సభలలో వాడుకభాష మాట్లాడడం పత్రికలలో వ్యాసాలు వ్రాయడం కూడా తప్పుగా భావించే కాలమది'.[2] ఆ రోజులలోనే శ్రీ శాస్త్రిగారు రెంటాల వేంకట సుబ్బారావుగారి ప్రోత్సాహముపై వాడుక భాషలో 'కామధేనువు కథ' (1912) ప్రచురించారు. దానికి సుప్రసిద్ధ న్యాయవాది, విద్యారాశి శ్రీ వేపా రామేశం పంతులు ఆంగ్లములో ఉపోద్ఘాతము వ్రాసినారు. అందు శ్రీ శాస్త్రిగారి అభ్యుదయ దృక్పథమును, రచనా ధోరణిని నిర్ద్వంద్వముగా కొనియాడుటే కాక వ్యావహారిక భాషావశ్యకత గూర్చి యిట్లుటంకించారు.

"If our efforts to extend the basis of Primary Education and to diffuse Knowledge and Culture even among the lowest classes are to be crowned with success, some such departure from the traditional restrictions is absolutely essential. One may observe that a language which has a crystalised structure and which cannot change can never be progressive and cannot be expected to unfold all the possibilities natural to its genius and talent in it".

గురజాడ వారి 'పూర్ణమ్మ' 'కన్యక' రచనల కానాడే శాస్త్రిగారు విజయ సంకీర్తనము గావించుటే కాక ముత్యాలసరాలలో 'శరణాగతి' అనే కవితను వెలయించారు. ఈనాడు శాఖోపశాఖలుగా విస్తరిల్లిన వ్యావహారిక భాషా విటపికి ఎంతో దోహదము చేసిన ఆద్యులలో వీరొకరు. ఈనాటి సాహిత్యాభ్యుదయమును అభ్యూహించి, యపేక్షించి యుండిన క్రాంతదర్శులు వారు.

వ్యావహారికభాషావాదమునకు శ్రీ శాస్త్రిగారి తోడ్పాటు గణనీయమైనది.[3] వచన రచనలలో వ్యావహారిక భాషను ప్రయోగించుట సంప్రదాయ సిద్ధమై యుండినట్లు శ్రీ శాస్త్రిగారు రామమూర్తి పంతులుగారికి వాడుకభాషలో వ్రాసిన లేఖను వారు 'తెలుగు పత్రిక'లో ప్రచురించు కొన్నారు.[4] ఆ వ్యాసములోనే వ్యాఖ్యానములకు ప్రాచీనులు వాడుక భాష వాడుకొన్న సంగతిని చూపుటయేగాక, లక్షణ గంథాలలోని వచన భాగమంతయు వాడుక భాషలోనే కలదని సప్రమాణముగ నిరూపించారు. 'కాటమ రాజుకథ' మున్నగునవి వాడుక భాషలో రచింపబడినవే. సి. పి. బ్రౌనుదొర వ్రాయించిన వ్యాఖ్యానాలన్నీ వాడుక భాషలోనే ఉన్న సంగతిని శాస్త్రిగారే తొలుత వెలువరించారు. ఇదియేకాక, వాడుక భాష ప్రచురముగా నుండె ననుటకు తామర తంపరగా తార్కాణములు చూపినారు. గిడుగు వారి వాదమునకు శాస్త్రిగారి తోడ్పాటు ఎంతో బలమును చేకూర్చినది. ఇది సామాన్యమైన విషయము కాదు

భాసుని ప్రతిమా నాటకమును తొలుత (1910) ఆంధ్రీకరించినవారు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు. అనువాద నాటకమున, మూలమున ప్రాకృతమున్నచోట వ్యవహారభాషను ప్రయోగింపగా, అది ఒక పెద్ద సంచలనాన్ని కలిగించింది. దాని పర్యవసానమే శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు 'వజ్రాయుధము'లో చేసిన ఖండన.[5]

తంజావూరి యాంధ్ర రాజుల చరిత్రనుగూర్చి తెలుగువారికి తొలుత తెలిపినది శ్రీ ప్రభాకరశాస్త్రి గారే. దానికి పీఠిక (1914) 64 పుటలు వ్యావహారిక భాషలోనే వ్రాసి, 'తొడిమ' అను పేర అనుసంధించారు. వ్యావహారిక భాషావ్యాప్తి యొనర్చుటే కాక, ఎంతో జానపద సాహిత్యమును, ఆ రోజులలో పండితులు అంటరానిదిగా భావించిన అనాదృత వాఙ్మయమును, శాస్త్రిగారు సముద్ధరించిరి.

తెలుగువారి నోట వెలువడిన పలుకుబడులు, నానుడులు, సామెతలు సేకరించుట వారి అభ్యుదయ దృష్టికి నిదర్శనము. ప్రజా వాఙ్మయ శాఖలన్నీ సమతూకముతో వెలయవలసినవే యనియు, దేని విలువ దానికున్నదనీ, త్రోసివేయదగిన వాఙ్మయ శాఖ ఏదీలేదని భావించిన ప్రాచ్యభాషాపండితులే అరుదు. శ్రీ శాస్త్రిగారు తొలినుండి జాతిని జాగృత మొనర్చుట కన్ని వాఙ్మయిశాఖలు వర్ధిల్లవలసినవే అని దృఢముగా నమ్మినవారు.

తాళ్ళపాకవారి పదాలను కొన్ని సంపుటాలను ప్రచురించారు. ప్రఖ్యాత సంకీర్తనాచార్యుల పాటలన్నీ వాడుకభాషలోనే ఉన్నాయనీ, అలా వాడుక

భాషలోనున్న పాటలనూ, పదాలనూ ప్రౌఢ వ్యాకరణము ప్రకారము తీర్చిదిద్దుట పువ్వును నలిపి వాసన చూచుటవంటి దన్నారు.[6]

సాహిత్యం ఏకొద్దిమందికోగాదు—అన్ని వర్గాల వారికీ అనుభవింపదగినదిగాఉండాలని ఆంధ్రజాతిని మేల్కొల్పిన కొద్దిమందిలో నొకరు. తొలినాళ్ళలో ముఖ్యులు శ్రీ శాస్త్రిగారు. 'సాహిత్యం అన్ని తరగతులవారికీ అనుభవింపదగి ఉండాలి' అని ఒక వ్యాసంలో (15-7-1942 ఆంధ్ర పత్రిక) వారు జాతిని హెచ్చరించారు.

నేటి నవ్యసాహిత్య విశారదుల విజృంభణము లన్నీ ఆయనకు పరమానంద ప్రదములే. 'మన పరిపూర్ణత రేపటి రోజుల్లో ఉన్నదిగాని, నిన్నటి రోజుల్లో లేదు'[7] అన్నారు.

'నేటి తెనుగు-నోటితెనుగు' (1945-46 ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచిక) వ్యాసంలో ఇలా అన్నారు. 'కుల్లూకభట్టీయాన్నిబట్టి వర్ణాశ్రమ ధర్మాలను, నన్నయ భట్టీయాన్నిబట్టి ఆంధ్ర భాషావ్యవహారములను ఆచిపట్టవలెననే వారు నాలుకలు కఱచుకోవలసిన స్థితి వస్తుంది. తప్పదు.' వారి సామాజిక స్పృహాతీరు ఇట్టిది. తాను నమ్మినదాని నాచరించి చూపుట వారి ప్రథమ ప్రకృతి.

వాడుకభాష మంచినీటివలె బహుప్రయోజనము కలదనీ, కావ్యభాష పంచదారపానకమువలె పరిమిత ప్రయోజనము కలదనీ శ్రీ ప్రభాకరశాస్త్రిగారి తీర్పు. ఏనాదుల భాష గూర్చి—దాని తీరుతెన్నులనుగూర్చి ఏనాదో వ్యాసం (1917 కృష్ణాపత్రిక) వ్రాసినారు. వ్యావహారికభాషోద్యమమునకు మూల స్తంభములలో నొకరుగానుండి-దాని బహుముఖవ్యాప్తికి దోహదము చేసి, దాని సర్వతో విజృంభణమున కానందపడిన విశాల హృదయులువారు. వ్యాసములలో-కథలలో-కవితలలో-విమర్శలలో నాటకములలో మరెన్నిశాఖల లోనో దానిదాని విశ్వరూపమును మనము చూచుచునే యున్నాము. అందు శ్రీ శాస్త్రిగారి వాటా పెద్దది.

1. 1977 డిసెంబరు భారతి.
2. నవ్యసాహిత్య పరిషత్ వార్షికోత్సవ ఉపక్రమోపన్యాసము (1946 జనవరి)
3. గ్రామ్యమీమాంస — 31-3-1917 కృష్ణా పత్రిక
4. 1919 సెప్టెంబరు - తెలుగుపత్రిక
5. వజ్రాయుధము - 1 సంపు. 3 సంచిక
6. చూడు. 1941 ఫిబ్రవరి భారతి.
7. నవ్యసాహిత్య పరిషత్ ఉపక్రమోపన్యాసము (1946 జనవరి)

# ప్రభాకర స్మృతి

- చల్లా సూర్యనారాయణ

[ స్వర్గీయ చల్లా సూర్యనారాయణశాస్త్రిగారు బహుకాలం క్రితం ముక్త్యాల సంస్థానానికి సంబంధించిన మాహిష్మతీ ప్రెస్సులో పనిచేసినవారు. ప్రభాకరశాస్త్రిగారికి బాల్య స్నేహితులు. గురుదేవుల రచనలు - ముఖ్యంగా చాటువుల్ని - వారెన్నో సేకరించి దాచి ఉంచినట్లు తెలుస్తున్నది. ఆ సంకలనం ఎప్పటికైనా లోకానికందితే బాగుండునని ఆశిస్తున్నాము. సం॥ ]

వేటూరి ప్రభాకరశాస్త్రి ఆశువుగా రచించిన చాటువులు పెక్కులున్ననూ నావద్దదొరకగలవి కొన్ని వెదకి సేకరించి ప్రకటించు కుతూహలము నాకు కలదు. మేమిరువురమునూ మా జన్మస్థానమైన పెదకళ్లేపల్లి (దివి తాలూకా) గ్రామవాస్తవ్యులము. మా బాంధవ్యముకంటె మా అన్యోన్యమైత్రి చాలా యెక్కువది. చెన్నపురికి 1911 సం॥ జనాభా ఆఫీసులో సూపర్‌వైజర్‌గా నేను పోకపూర్వమే కొంచెంముందుగా చెన్నపురికి చేరిన ప్రభాకర శాస్త్రియూ, నేనునూ యేకముగా కలిసి నివసించినపుడూ, బజారువెంట కలిసిపోవునపుడూ, నేను చూచి కోరిన విషయములపై అతడు ఆశువుగా చెప్పిన పద్యములనూ, తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమునకునూ, అరవజిల్లాలోని కొన్ని గ్రామములలో నివసించు ఆంధ్రకుటుంబముల చెంతకునూ మేము చేసిన ప్రయాణములలో ప్రభాకరశాస్త్రి ఆశువుగా రచించిన పద్యములునూ, తనకు బావగారనగుటచే నామీద అప్పుడప్పుడు చెప్పిన హాస్యపద్యములునూ, యింకా కొన్ని చాటువులున్నూ కలిగిన నా కాగితాలకట్టలు కొన్ని కారణములవల్ల యిప్పటిదాకా బైటికివచ్చుటకు వీలు లేనిస్థితిలో చిక్కుపడిపోయినవి.

నా ఆరోగ్యం కొంచెం చక్కపడినవెంటనే వాటిని వెతికితీసి ప్రకటించెదను. అందుకు పరమేశ్వరుడు కటాక్షము నెరపుగాక యని ప్రార్థించుచున్నాను. ప్రభాకరశాస్త్రియే నన్ను కుంభకోణం యోగాస్కూలులో చేర్చి శ్రీ వెంకాసామిరావుగారికి నన్ను తనతోడి సాక్షచ్ఛిష్యునిగ చేసియున్నాడు. ప్రభాకరశాస్త్రి గొప్ప కవీశ్వరుడును, పండితుడును, భాషాపోషకుడును, విమర్శకుడునేకాక గొప్ప యోగికూడ అయియున్నాడు.

అట్టి నెరబాంధవుని, అత్యంతమిత్రుని కోలుపోవుట నాయొక్కయు, ఆంధ్రలోకముయొక్కయు భాగ్యహీనతగాక మరి యేమనవలయును?

(27-9-50 గొల్లప్రోలు.)

ఇంతవరకు 27-9-50న నాకు కొంచెం మతి తెలిసినపుడు వ్రాసినాను. పిదప నా ఆరోగ్యం

మరీ చెడినది. కొంచెం బాగుపడితే వ్రాద్దామని పడవేసిపెట్టినాను. ఇప్పటికీ బాగుకాలేదు. సి.వి.వి. అనుగ్రహం కలిగినప్పుడు వ్రాస్తాను. ఈలోపుగా దీనిని (ప్రస్తుతం ఎదురుగా జ్ఞాపకంవున్న యీ చాటుపద్యమును) యేమి చేయదలచితే ఆ పని చెయ్యి. ధన్వంతరిలోగాని, ఏ పత్రికలోగాని ఆంధ్రలోకానికి తెలుపవలెనని నా కోరిక.

(ముగ్ధ)

నేను ప్రభాకరశాస్త్రిని ఈ పద్యం చాటువుగా చెప్పమని కోరడంలో ఒక షరతు పెట్టినాను. పద్యం 'ముగ్ధ' అనే పదముతోనే మొదలుపెట్టవలెను. అందులో 'దుగ్ధము' అనే మాట వాడకూడదు.

"ముగ్ధ! ఇవేటి మాటలు విమోహితులై
నిను గాంచినంత సం
దిగ్ధమనస్కులై తుదకు తేకువజారఁగ
బీదబేలలై
స్నిగ్ధములైన నీదు నునుచెక్కులఁ జన్గవ
నొక్కఁగోరుచున్
దగ్ధసుమాస్త్రినంత బలుదంటలును నిన్ను
వెంటనంటరే?

(దగ్ధసుమాస్త్రిడు అనగా శివుడేగాన శివునంతటి దంటయూ నిను వెంటాడడా అని ఆశయము)

* *

చి॥ శంకరశాస్త్రికి ఆశీః

దుఃఖవార్త విన్నప్పటినుంచీ నిజంగా నాకు మతి చెడినది. సదా నిద్రమత్తు. ఏమి వ్రాస్తున్నానో తెలియడంలేదు. మాట తోచదు. ఇందువల్లనే ఉత్తరం ఆలస్యం. నా వ్రాతలో వెనకా ముందు సందర్భం వుండదు. ఇక వ్రాయలేను. నా క్షేమం విచారిస్తూ వుండకోరినాను.

9-12-50 (సం) చల్లా సూర్యనారాయణ.
గొల్లప్రోలు.



# గ్రంథ సమీక్ష

[ ఆనందవల్లి-కవిత. కృతికర్త డా॥ పోచిరాజు శేషగిరిరావు. మధుమంజరీ ప్రచురణం. క్రౌను సైజు 64 పుటలు, మూల్యం : రూ. 6/-, ప్రాప్తిస్థానం : పి. గురుప్రసాద్, M. Com., (C. I) రామారావుపేట, పెద్దాపురం, తూ. గో. జిల్లా. ]

డా॥ శేషగిరిరావుగారి 'ఆనందవల్లి' కవితా సంపుటి ఒక చైతన్య స్రవంతి. ఆనంద పయోధి. ఒక సంస్కార రేఖ. ఒక దివ్యానుభూతి స్పందన. పేరునుబట్టే తెలుసుకోవచ్చు అదొక అక్షరాకృతి నందిన ఆనంద ధ్రువనీ, సకల ధర్మ సర్వరహస్యో పనిషన్మధువనీ. 'లోవెల్గు' లను దర్శించి 'లోబల్కు'లను వర్ణించి, 'అహీనరసానుభవైక దృష్టితో' ఆనందవల్లిని సృజించిన ఈ కవి కర్మ నిపుణము. కలకాలం నిలిచే విలువగల తన్మయతే ఈయన కవితా తపస్సులోని మహనీయత.

చిన్నతనంలోనే మదికెక్కిన 'కవిత్వపుపిచ్చి' అదొక ఆరని తీరని దాహమై అనుతాపాన్ని పెంచిన వేళ ఆ తాపాన్ని ఉడిపి, కవితామదమును కెడపి, తత్వమును గలిపి, సమ్మోదాన్ని గొలిపి, సాన్నిధ్య మున నిలిపి ఆనందానుభూతిని సాక్షాత్కరింప జేసిన ప్రభాకర గురుపాదుల దివ్యానుగ్రహ స్తుతి కెత్తిన అక్షరసుమాంజలి ఈ ఆనందవల్లి.

"వేసరి డస్సి వేదనల వీటిడినై నిను డాసినంత
సం
త్రాసము వాపి భావ నికరమ్ముల నాయెద నింప
నింపి, వి
శ్వాసముఁ గూర్చినాఁడవు ప్రభాకర! నీ మహనీయ
శక్తిచే
దోసిలి యొగ్గి భక్తి పరితోషిత గాత్రుఁడనైతి,
ధన్యుడన్"

(అనుభూతి పుట-27)

అన్నది వారి అనుభూతి.

"ఒక మధుర క్షణమ్ము గుఱుతున్నది జీవన
సంధ్యలో సము
త్సుకత గురూత్తముండు సుమసుందర హస్తమునన్
స్పృశించి యం
గకముల దివ్యదీప్తుల ప్రకంపితుఁ జేసిన వేళ
కాంతి వ
ల్లిక నెదనాటెఁ దన్మధుర లీల మనమ్మను వీడ
కుండగన్"

(సాక్షాత్కారము-పుట 18)

ఆ విధంగా 'కాంతివల్లిక నెదనాటి' 'తన్మధుర లీల'ను సాక్షాత్కరింపజేసిన దివ్యసన్నివేశమే ఆనందవల్లికి జననహేతువు. ఈ అంశాలను డా॥ శేషగిరిరావుగారు 'కవితాహేతువును'ను వివరించిన పట్టున విశదీకరించారు. ఆ 'సాక్షాత్కారం'తోను 'అనుభూతి'తోను, 'ఆనందవల్లి' ఎదనాటింది. 'ఆనందప్రభ'లు చిందింది. 'ప్రకృతి దర్శన' మయింది. ఎడదలో 'మందారమాల' వికసించింది. 'పూలజల్లు' కురిసింది. పరవశించిన హృదయవీణ 'అష్టపది' నాలపించింది. రస సముచితమైన భావావళిని 'ఏకావళి' ముడివేసింది.

"రాలు కరగించు దివ్య కీర్తనవు నీవు
పాట మొదలెత్తు పల్లవి పదము నేను,
విమల గాంధర్వ మాణిక్యవీణ వీవు
తద్గతమ్మగు తపనీయ తంత్రి నేను."

(ఏకావళి పుట-37)

ఈ నాడు వినవస్తున్న కృతులలో 'ఆనందవల్లి' ప్రశస్తమైనది. పాఠకుల నొక్క మొగిని చదివిస్తున్నది. 'రసపరిప్లుతవల్లకి వోలె శ్రావ్యమై' ముదమిస్తున్నది. 'రాగస్పందన సుందరమ్ము'ను 'మధుర ధారావేగ సంరూఢము'ను అయిన ఈ సత్కృతిలోని మాధుర్యాన్ని, జీవాన్ని, కులపతి డా॥ ఎక్కిరాల కృష్ణమాచార్యుల వారి 'ఉపశ్రుతి మహనీయముగా ప్రదర్శిస్తున్నది. "అరుదైన భావ ధార"తో వెలసిన "శేషగిరిరావుగారి తెనుఁగు కృతులెన్నెని సరస్వతికిఁ గైసేఁతలు కావలయు" నన్న మహాకవి మధునాపంతులవారి 'ఆకాంక్ష'ను సంభావింతముగాక.

* *

[ శ్రీనాథుడు - శృంగారిము (ఒక సమీక్ష). కర్త: శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి. ప్రథమ ముద్రణము 1980. మూల్యము 6/-. క్రౌనుసైజు 70 + 16 పుటలు. ప్రతులకు – దీపాల పిచ్చయ్య శాస్త్రి, నెల్లూరు - 2. ]

ఇది ఒక సమీక్షా గ్రంథము. స్కాలర్స్ ఎడిషన్‌గా ఈ గ్రంథమును "శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు తమ యెనుబదియాఱవయేట" ప్రకటించిరి. శ్రీ నిడుదవోలువారన్నట్లిందలి "విషయ విమర్శనము లోతైనది. విద్వన్మాన్యమైనది." ఇట్టి యీ వ్యాసరచనకు వెనుకనుండిన హేతువును శ్రీ దీపాల వారిట్లు పేర్కొనిరి.

"శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తాము రచించిన శ్రీనాథచరిత్రకు 'శృంగార శ్రీనాథ'మని పేరు పెట్టినారు. శ్రీనాథుడు శృంగారి కాడనియు అతని చరిత్ర కాపేరు పెట్టుట తప్పనియు ఒక రాక్షేపించినారు. ఆ యాక్షేపము తప్పో ఒప్పో విచారింపకుండనే పెద్దలు ఒకరిద్దరు ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథున కన్యాయము చేసిరని అందందు తాకనాడినారు.

శ్రీ శాస్త్రిగారు శ్రీనాథునియెడ నపార గౌరవాభిమానములుకలవారు. వారేమి? శ్రీనాథునకన్యాయము చేయుటయేమి? అది సరిగా విచారింపక అన్నమాట. ఆ మాటకు నా మనసు నొచ్చినది. శ్రీ శాస్త్రిగారు శ్రీనాథున కన్యాయము చేసినారనుట పొరపాటనియు శ్రీనాథుడు శృంగారి కావుననే వారతనిచరిత్రకు 'శృంగార శ్రీనాథ'మని పేరుపెట్టినారనియు లోకమునకు తెలుపవలెనన్న సంకల్పము కలిగినది.

అందుకు అతడు శృంగారి యని రుజువు చేయవలె గావున అతడెలాటి శృంగారియో విపులముగా వివరిస్తూ ఈ వ్యాసము వ్రాశాను. అతడు శృంగారి యనుటకు, అతని రచనలనే ప్రమాణముగా చూపించాను. నా స్వకపోలకల్పన మేమీలేదు.

ఏతావతా, ఈ వ్యాసము శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శ్రీనాథుని చరిత్రకు 'శృంగార శ్రీనాథ'మని పేరు పెట్టుటలో తప్పేమీ లేదని చెప్పుటకు వ్రాయబడినదని హెచ్చరిక" (తొలిపలుకు పుట - iii)

అప్పటికి ఏబదియారేండ్ల క్రిందట అనగా 1923 లో శృంగార శ్రీనాథము ప్రకటింపబడినది. పిమ్మట 1928లో క్రీడాభిరామము ప్రభాకరశాస్త్రి గారి పీఠికతో వెలువడినది. శృంగార శ్రీనాథమున 'మిక్కిలి జాగ్రత్తతోనే శ్రీనాథుని స్త్రీ లౌల్యమును' ప్రభాకరశాస్త్రిగారు సూచించిరి. దానిపై ఆక్షేపములు

వెలువడినవి. అందుకు 'పండితులు, కావ్యతత్త్వ పరిశోధకులు, ప్రౌఢులు'నగువారికే పడయ దగిన రీతిని వారు క్రీడాభిరామ పీఠికలో మరికొంత విషయమును చేర్చి ఉచితరీతిని బదులుపలికిరి.

'శ్రీనాథుఁడు సుఖ దుఃఖములను, లాభనష్టములను, మానావమానములను దనకుఁ దటస్థించిన వానిని జాటుసేయక చాటి చెప్పుకొను స్వభావము గలవాఁడు....తన వలచిన శృంగారవర్తనమును గూర్చియా సిగ్గుపాటు! అతఁడు దానినొక ప్రాభవ విశేషముగానే పరిగణించెను' అని వ్రాయుచు, లోకమునుండి అట్టి సందర్భములను మరికొన్నిటి నుదాహరించి, తుదకు 'వేయేల? నీతివర్తనము విషయమున భూతకాలముకంటె వర్తమానకాలమే హెచ్చుగా కీర్తనీయమని నా నమ్మకము' అని తమ యభిప్రాయమును వెలిబుచ్చిరి.

కాని ఆ వాద దావాగ్ని ఆరక ఇంకను రగులుచునే యుండెను. ఎడనెడ పత్రికలలో కొందరీ విషయమై ప్రభాకరశాస్త్రిగారిని (వారు దివంగతులైన పిదపను కూడ) తాకనాడుచు వ్రాయసాగిరి. అందుకు "నొచ్చి" "హెచ్చరికగా" శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారీ సమీక్షా వ్యాసము నీ వయసున నిట్లు శ్రమకోర్చి కూర్చిరి. ఈ రచనకు గల పూర్వ రంగ మది.

క్రీడాభిరామ పీఠికలో"పై విమర్శకులు శ్రీనాథుని నిష్కళంక మూర్తిని జూచిరట. కాని వాస్తవముగా నే నట్టి దానిఁ జూడలేక పోయితిని....చేయి సాగినట్లెల్లఁ జెలరేగి వ్రాయుచుండు వ్రాఁతల కిట్టివాని కేమని బదుళ్లు చెప్పవచ్చును?" (క్రీడా. పీఠిక 87) అని ప్రభాకరశాస్త్రిగారు మిన్నకుండిన విషయము నందుకొని దీపాలవారు నాటివారికిని నేటివారికిని వస్తుతత్వము విశదమగునట్లీ వ్యాసమును రచించిరి. ఈ గ్రంథమునందలి ఆద్యంతపంక్తు లిట్లున్నవి.

"శ్రీనాథుడు శృంగారలోలుడు. ఈ సంగతి నేటి పండితులలో పలువురికి తెలియదు." (పు. 1)

"....వాదించుట విడ్డూరముగాని విజ్ఞత కాదని ఇక్కడ హెచ్చరిక ........ అతనికి శృంగారము ముఖ్యము; ఔచిత్య మౌపచారికము. (పుట 69) అతడు రూపొందిన శృంగారము. శృంగారమునకు మారుపేరు శ్రీనాథుడు." (పుట 70)

1. వేశ్యాసాంగత్యము 2. స్తనవర్ణన వ్యామోహము 3. అనువాదములలో శృంగారము అను మూడువిభాగములలో నికచర్చకు తావులేనివిధమున దీపాలవారీ విషయము నిందు విపులీకరించినారు.

ఆ విపులీకరణము కూడ దీపాలవారి కలమునకు సహజమైన నిండుదనముతో, పాండిత్య ప్రౌఢిమతో, వాదపటిమతో (ఉదాహరణలు చూపనవసరము లేదు. వ్యాసమంతయు నుదాహరణమే) చమత్కార ప్రసంగములతో (పు. 8-పేరా 3, 47-అంశము 1) నలరారుచున్నది.

ఈ వ్యాసమున డా॥ బెజవాడ గోపాలరెడ్డిగారి "ముందుమాట" ఆలోచనాజనకముగా ఆంగ్లమున కలదు. పండితుల అభిప్రాయములను పొందుపరుపబడినవి. కవి సార్వభౌముని సాహిత్యమునందభిమానము కలవారందరును కొని చదువవలసిన గ్రంథమిది.

—శ్రీవత్స.



# శృంగార శ్రీనాథ ప్రశంస - లేఖలు

[ గురుదేవుల 'శృంగారశ్రీనాథము' వెలువడ్డతర్వాత ఎందరెందరో ఆ రచనకు ముగ్ధులై అభినందన పత్రాలను పంపారు. మామిడిపూడివారి లేఖ వాటిల్లో ఒకటి. దరిమిలా గొబ్బూరివారి లేఖ ఇంకొకటి. ఆ నడిమికాలంలో, తెలుగుదేశంలో, ఆగ్రంథం కలిగించినంత జిజ్ఞాస సంచలనం మరి ఇంకో విమర్శగ్రంథం కలిగించలేదంటే అతిశయోక్తి కాదు. గొబ్బూరివారి అప్పటి ప్రయత్నమది ఫలోన్ముఖమయిందో లేదోమరి! అట్టి ఊహే మణిమంజరి సంపాదకులు శ్రీ ఆంజనేయులుగారికీ కలిగి 'శృంగారశ్రీనాథము'ను ఆంగ్లంలోకి అనువదిస్తున్నారు. ఈ సంచికనుండి క్రమంగా వారి ఆంగ్లానువాదాన్ని మణిమంజరిలో ప్రకటించగలము—సం ]

M. VENKATARANGAIAH M.A.,
Professor of History and Economics

Maharaja's College,
Vijayanagaram
17-9-1924

ఆర్యా !

మీరు రచించిన 'శృంగారశ్రీనాథ'మను గ్రంథమును రెండవ పర్యాయము చదివి ముగించి ఈ ఉత్తరమును వ్రాయుచున్నాను. ఇట్టి గ్రంథ మిదివరకు మనభాషలో నెవరుగాని రచించి యుండ లేదని నా దృఢాభిప్రాయము. ఈ కార్యమును కొనసాగించుటలో మీరు గావించిన పరిశోధన, పరిశ్రమ వర్ణనాతీతములు. మీతోటి పరిచయభాగ్యము నా కిదివరకు కలుగకపోయినను మీ గ్రంథవర్ణనము వలన నాకు కలిగిన పరమానందమును సూచించుటకై నేనీ యుత్తరమును వ్రాయుచున్నాను. ఈ పర్యాయము నేను చెన్నపట్టణము వచ్చినపుడు మీ దర్శనము చేసెదను. మీనుండి ఎన్నియో కొత్త విషయాలను నేర్చుకొనవలయునని కుతూహలపడుచున్నాను. చిత్తగించవలెను.

ఇట్లు, తమవిధేయుడు,
మామిడిపూడి వెంకటరంగయ్య.

---

ఎలమంచిలి,
6-6-1947.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి
దివ్యసముఖమునకు,

సే॥ గొబ్బూరు వేంకటానంద రాఘవరావు అనేక నమస్కారములుచేసి వ్రాయు విన్నపములు.

చాలాకాలమునుండి నాకు తమ దర్శనభాగ్యము లభించలేదు. తమరు మద్రాసు ఓరియంటల్ లైబ్రరీలో పనిచేయుచుండినపుడు నేను ఆ లైబ్రరీలో అప్పుడప్పుడు తమ దర్శనము చేయుచుంటిని.

తమరు రచించిన "శృంగారశ్రీనాథ"మను పేరు గల శ్రీనాథుని జీవితచరిత్రము రెండుమూడుసార్లు చదివితిని. చాల సంతోషించితిని.

ఇప్పటికి ముప్పదియేండ్ల క్రిందటనే నాకొక ఉద్దేశము కలిగెను. ఇంగ్లీషులో **English men of letters** -అను గ్రంథమాలికలో ఆంగ్లభాషా

వాఙ్మయములకు ఎన్నతగిన సేవచేసిన మహనీయుల జీవితచరిత్రలు-ఒక్కొక్కటి రెండువందల పుటలకు మించకుండ చక్కని చరిత్రలు ప్రకటించారు. ఆ గ్రంథముల General Editor ఒకప్పుడు ఇండియా సెక్రటరీ John Morley [ఆయా] కవియొక్క సంగ్రహజీవితచరిత్రతో, ఆ కవికాలపు విశేషములు ఆ కవి నెట్లు ఊపినవో తన కావ్యరచనల వలన అతడాకాల జీవనవిధానముపై [తా]నెట్టి ప్రభావము చూపగలిగెనో, ఆ రచయిత విశిష్టత యెట్టిదో, ఆ శైలి యెట్టిదో - ఈ ముఖ్యాంశములు విడువక, విసువుపుట్టింపక - రెండువందల పుటలు మించని పుస్తకములు - చక్కని విమర్శనముతో అలరారుచున్నవి - ముఖ్య దేశకాల పాత్రముల కనుకూలముగా దేశి తెనుగుకవుల ప్రత్యేక సాహిత్య విశేషములతో Telugu Men of letters ఒక కావ్యమాలికక్రింద ప్రకటించుట అత్యవసరమని తోచి ఒకప్పుడు కీ॥ శే॥ కాశీనాథుని నాగేశ్వరరావు గారితో విన్నవించితిని. 'ఇంక ఇప్పుడు కా' దన్నారు వారు. కాలమా గడిచిపోతున్నది.

నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రెగ్గడ, శ్రీనాథుడు పెద్దన్న..........లక్ష్మణరావు, గురజాడ అప్పారావు మొదలైన వారి జీవితచరిత్రలు రావలసియున్నవని నావిన్నపము. మీ శృంగారశ్రీనాథము చూసిన తరువాత ఆ యుద్దేశము బలపడినది. కవి కావ్యశి ల్ప ములో విశేషములు, రచనలో ఏ విశిష్టత కారణముగా ఆ కావ్యములు ప్రజాహృదయముల నాకర్షించుకొనినవో ఆ శైలీపరీక్షకూడ చేర్చుట అవసరమని నా అభిమతము. ఇట్లుండగా గత జనవరి నెలలో శ్రీనాథుని జ్యోతిశ్శాస్త్ర ప్రభావము మరొకసారి చదివి తెలుసుకొందమని నైషధము చదువు చుండగా, ఒక మిత్రుడు - ఇంకా నైషధము చదువుతున్నారా? అని హేళనచేసెను. ఆ సంగతి ఆHeadingతోనే భంకాపత్రిక సంవత్సరాది సంచికకు పంపి నాకు తోచిన కొన్ని బొమ్మలతోకూడ, నా మతికి తగిలిన కొన్ని విశేషములు వ్రాసితిని - ఆ ప్రతియొకటి తమతావుకు పంపమని భంకా పత్రికాధిపతిని వేడితిని. తమకు ఒక ప్రతి పంపినట్లు ఆ పత్రికాధిపతి వ్రాసెను. బొమ్మలు తారుమారు పడినను నా అభిప్రాయములు తమకు కొంతవరకు వ్యక్తముచేసుకోగల్గితినేమో అనుకొనుచున్నాను.

శ్రీనాథునిలో మంచిని గ్రహించుట మాని అతనిని తిట్టిపోయుట పరిపాటిఅయినది - ఈ 'గొఱ్ఱె దాట్లు' కొంతవరకు కట్టించవలెననిపించి ఆ వ్యాసము వ్రాసినాను. తమవలె శ్రీనాథమహాకవి యందు నాకు భక్తి తాత్పర్యములు కలవు.

పెద్దల ఆశీస్సులతో అనుజ్ఞపొంది చేసిన పనులు జయప్రదము కాగలవు. తాము తమ జీవితమంతయు ఈ ఆంధ్రభాషావాఙ్మయ సేవకై వినియోగించుచు ధన్యులైన పుణ్యమూర్తులు. మీకిదే చేతులు మోడ్చి నమస్కరించి వేడుచున్నాను - Telugu Men of letters Series అని అర్థము వచ్చునట్లు చక్కని నామకరణము దయచేసి అది ప్రారంభించి పనిచేయుటకు తమ అనుజ్ఞతో ఆశీర్వాదము అనుగ్రహించమని కోరుచున్నాను. తమ స్వహస్తములతో లిఖించి పంపిన ఉత్తరము చదువుకొను భాగ్యము త్వరలో లభించునని ఆశించుచున్నాను. బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు ఈమధ్య నిక్కడనుండి 'నుడికడలి' లో పనిచేయుచున్నారు. ఇపుడు వారి స్వగ్రామము కనకవల్లి వెళ్లియున్నారు.

ఇట్లు విన్నవించు

భవద్విధేయుడు

గొబ్బూరు వెంకటానంద రాఘవరావు.

x x x

# వార్తలు - విశేషాలు

"మణిమంజరి"–ప్రభాకర జయంతి సంచిక ఆవిష్కరణోత్సవం: శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరాబాదు) వారి 'మణిమంజరి' షాణ్మాసిక సంచిక 7-8-81 తేదీ సాయంత్రం 6-30 గంటలకు శ్రీనివాస సాహితీ సమితి పక్షాన సుల్తాన్ బజారులోని శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో ఏర్పాటైన సాహిత్య సమావేశంలో ఆవిష్కరింపబడింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాలశాఖ అమాత్యశేఖరులు



'మణిమంజరి'ని ఆవిష్కరిస్తున్న మంత్రివర్యులు శ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు, ప్రక్కనున్న వారు కె. వి. భాస్కర్‌రావు గారు.

మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు నాటి సభకు ముఖ్య అతిథిగా విచ్చేసి సంచికను ఆవిష్కరించారు. ఆంధ్రాబ్యాంకు పౌరసంబంధాధికారి శ్రీ కే.వి. భాస్కరరావుగారు సభకు అధ్యక్షత వహించారు. రాష్ట్రీ సాంస్కృతిక వ్యవహారాలశాఖ డైరెక్టరు డా॥ పి.యస్.ఆర్. అప్పారావుగారు సభా ప్రారంభకులు కాగా జంటనగరాలలోని పలువురు విద్వాంసులు విదుషీమణులు సభలో పాల్గొని 'మణిమంజరి' సంచికను, శ్రీ ప్రభాకర పరిశోధక మండలి (హైదరాబాదు) వారి కృషిని ప్రస్తుతించి ప్రసంగించారు.

ఆరంభంలో సభవారు ఆచార్య తిమ్మావఝల కోదండ రామయ్యగారి ఆకస్మిక మరణానికి సంతాపం తెలుపుతూ వారి స్మృతి కంజలి ఘటించి ఒక నిముషం మౌనం పాటించారు. శ్రీ ప్రభాకర పరిశోధకమండలి కార్యదర్శి డా॥ వేటూరి ఆనంద మూర్తిగారు స్వాగత వచనాలు పలుకుతూ తమ పరిశోధక మండలి కార్యకలాపాలను సమీక్షించి కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి సంపూర్ణ గ్రంథావళిని 1988లో రానున్న ప్రభాకర శతజయంతి లోపుగా ప్రకటింప జేయవలసిన ఆవశ్యకతను గుర్తుకుతెస్తూ ఆ కృషిలో భాగంగా 'మణిమంజరి'ని వెలువరిస్తున్నట్లు తెలియజేశారు.

సభాధ్యక్షులు శ్రీ భాస్కరరావుగారు తమ అభిభాషణలో ఇలా అన్నారు. "మణిమంజరి నిజంగా పరిశోధక విద్యార్థులకు, యోగజిజ్ఞాసువులకు, వాఙ్మయారాధకులకు విలువగల 'మణిమంజరి' లాటిదే. ఎన్నెన్నో అపూర్వవిషయాలు ఈ సంచి

కలో ఉన్నాయి. ప్రభాకర శతజయంతినాటికి ప్రభాకరశాస్త్రిగారి సంపూర్ణ గ్రంథావళి ప్రకటింపబడటం ఆత్యవసరం. విలువగల ఈ పత్రిక ఆపకుండా వెలువడుచుండడం కూడా చాలా అవసరం. అందుకు ప్రజలు ప్రభుత్వముకూడా సర్వవిధాల తోడుపడాలి" అన్నారు.

సభను ప్రారంభిస్తూ డా॥ పి. యస్. ఆర్. అప్పారావుగారు 'వ్యవసాయంలో షాణ్మాసికలు జీవనానికెట్లా ఆధారభూతములు, ఆరోగ్యప్రదములు పుష్టికరములు అవుతాయో ద్వైమాసిక, త్రైమాసికలుగా కన్న షాణ్మాసికగా వెలువడే 'మణిమంజరి' కూడా వాఙ్మయ వ్యావసాయకులకు అన్నివిధాలా అలాగే సేవ్యము స్వీకారము కాగలదు' అన్నారు.

తరువాత వక్తలు పలువురు ప్రసంగించారు. ఆచార్య దివాకర్ల వెంకటావధానిగారు తమ ప్రధానో



'మణి మంజరి' ఆవిష్కరణ సభలో ప్రసంగిస్తున్న శ్రీ దివాకర్ల వెంకటావధాని గారు.

పన్యాసంలో శ్రీ ప్రభాకర గురుపాదుల వాఙ్మయ కృషిని, పరిశోధనా పాటవాన్ని, కవితా ప్రతిభని, యోగశక్తిని, పరిపూర్ణ మానవతావాదాన్ని సోదాహరణంగా విశదీకరిస్తూ 'మణిమంజరి' వారి సంపూర్ణ వ్యక్తిత్వాన్ని ఎలా ప్రతిబింబిస్తున్నదో వెల్లడిచేశారు. పత్రికలో ప్రకటింపబడిన లేఖలు, వ్యాసాలు, శ్రీవారి జీవనరేఖను చిత్రించే రచనలు, మహాత్ముడు మున్నగు ప్రసంగాల ఆంగ్లభాషాంతరీకరణాలు మణిమంజరి విలువను అధికం చేసినవంటూ "మణిమంజరి మామూలు పత్రిక కాదు ఎన్నెన్నో అపూర్వములైన విషయాలను సంతరించుకొన్న గొప్ప గ్రంథమిది" అన్నారు. నేడు బహుళంగా సాగుతున్న పరిశోధన వ్యాసంగానికంతకూ ప్రభాకరుల కృషియే ప్రాతిపదిక కల్పించిన దన్నారు. తదుపరి డా॥ వాసా ప్రభావతీశాస్త్రిగారు, ఆచార్య తిరుమలగారు ప్రభాకరశాస్త్రిగారి కీర్తిమూర్తిని ప్రస్తుతిస్తూ మణిమంజరి చేస్తున్న సేవను ప్రశంసించారు. పిదప ముఖ్యఅతిథి మాన్యశ్రీ భాట్టం శ్రీరామమూర్తిగారు ఉపన్యసిస్తూ మానవోత్తముడుగా వెలుగొంది-దరిజేరిన వారి అజ్ఞానాంధకారాన్ని పోద్రోలి అందరికీ విజ్ఞానాన్ని ఆరోగ్య భాగ్యాన్ని ప్రసాదించిన ప్రభాకరుల ప్రజ్ఞ కంజలి ఘటించారు. మానవ కల్యాణాని కుద్యమించిన మాస్టర్ యోగ సాధనయందు తమకుగల జిజ్ఞాసను వ్యక్తం చేశారు.

అట్టి మహనీయుల స్మృతి కంకితమై వెలువడుతున్న 'మణిమంజరి' కృషిని హర్షిస్తూ లాంఛన ప్రాయంగా తమ మంత్రిత్వశాఖ పక్షన ఐదువేలుదారంగా ఇస్తున్నట్లు సభలో హర్షధ్వానాలమధ్య ప్రకటించి శ్రీ ప్రభాకర పరిశోధక మండలి వారి ప్రణాళికకు చేయూతనిచ్చి వారి కృతజ్ఞతకు పాత్రులైనారు. శ్రీనివాస సాహితీ సమితి ఉపాధ్యక్షులు డా॥ యస్వీ రామారావుగారి వందన సమర్పణతో నాటి సభ పరిసమాప్తమయింది. ❋



ఛాయాచిత్రంలో ఉన్న కొందరు ముఖ్యులు. కూర్చున్నవారు – ఎడమనుండి – గురుదేవులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, జయంతిపురం జమీందారు వి. డి. యస్. ప్రసాద్‌గారు (3), ముక్త్యాల జమీందారు వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాద్‌గారు (4), ముక్త్యాల (యువ) జమీందారు వి. ఆర్. జి. కె. ఎమ్. ప్రసాద్‌గారు (5).

రెండోవరుస (ఎడమ నుండి) దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు ([illegible]), డా॥ వేటూరి చంద్రశేఖర శాస్త్రిగారు (5), డా॥ వేటూరి శంకరశాస్త్రిగారు (7), చల్లా సూర్యనారాయణగారు (8).

[ చూ. పుట. 130, తెలుగు విభాగం ]

# manimanjari

Volume 1 - No. 2. August 1981
VARDHANTI ISSUE

A bi - lingual Bi - annual
Literary Yoga Research Journal

*Editors :*

**ANJANEYULU VETURI**
**ANANDA MURTHY VETURI**



SRI PRABHAKARA PARISODHAKA MANDALI

'SRINIVAS' 6/2RT (New)
Vijayanagar Colony,
HYDERABAD - 500 457.
Andhra Pradesh

*About ourselves:*

# "Like Holding A Candle To The Sun"

Nannichoda's "Kumara Sambhava" (1-49)

The bi-annual "Manimanjari" is devoted to the cause of literary research in Telugu and propagation of Yoga. Manimanjari dedicated to the sacred memory of the late Veturi Prabhakara Sastri, will be published in a year on the occasion of his birth in February and his demise in August. In celebration of his 31st anniversary, (Vardhanti) this number is now before you.

| | | |
|---|---|---|
| The price of each journal (In land) | Rs. 15 | (with postage. Registration charges extra) |
| Annual subscription | Rs. 25 | |
| Annual subscription (Foreign) | $ 8 | |

Only a limited number of copies are available.

You may become a subscriber by sending money either by M.O. or by a bank draft. Outstation cheques drawn in favour of Manimanjari, Hyderabad should include in addition Rs. 2/- towards bank charges.

In future "Manimanjari" will contain many new features. Sastriji's varied and original contributions will continue to appear in the journal.

*Editors*

MANIMANJARI
6/2RT (New) Vijayanagar Colony,
Hyderabad-500 457,
Andhra Pradesh.
India.

